శ్రీః

శ్రీలక్ష్మీ హయగ్రీవాయనమః

శ్రీసరస్వత్యైనమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః :-

శ్రీలక్ష్మీ శ్రీనివాసాయ - శ్రిత**చిత్తప్రమోదాయచ,**

భక్త సంత్రాణ శీలాయ - శేషాద్రీశాయ, **తే నమః ॥**

శ్రీముత్తిరుమల క్షేత్ర విలసిత శ్రీపద్మావతీ అలమేల్మంగాసమేత

# శ్రీ శ్రీనివాస దివ్యకళా వైభవము

(పద్యప్రబంధము)






రచయిత

శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు యం ఓ యల్ (ఇందిరాల)



శ్రీఈశ్వర సం. హేమంత శశిరములు

౧౯౯౭

శ్రీః

శ్రీలక్ష్మీహయగ్రీవాయనమః

శ్రీమహాసరస్వత్యైనమః

-: శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః :-

వేంకటాద్రివంటి వినుతమౌశైలంబు - విశ్వమందులేదు వెదకిచూడ

వేంకటేశువంటి వేల్పులేడుగదా - అవని వర్తమానభవితలందు

శ్రీతిరుమల క్షేత్రవిలసిత శ్రీపద్మావతీ అలమేల్మంగా సమేత

# -: శ్రీ శ్రీనివాస దివ్యకళా వైభవము :-

-(పద్య ప్రబంధము)-




రచయిత

శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు యం ఓ యల్ (ఇందిరాల)

సికింద్రాబాద్ మహబూబు కళాశాలా విశ్రాంత ప్రధానాంధ్రాధ్యాపకులు

ThisBook is Published with the Financial Assistance of
"TIRUMALA TIRUPATI DEVASTHANAM'S"
Under the scheme aid to Publish Religious Books

శ్రీ శ్రీతిరుమల తిరుపతి దేవస్థానము యాజమాన్యమువారి ఆర్థిక సహాయముతో

శ్రీమదార్షకళాభారతీనిలయ పక్షమున ఈగ్రంథము ముద్రింపబడినది

శ్రీఈశ్వర సం హేమంత శశిరములు

1997

| | |
|---|---|
| గ్రంథ ప్రచురణము | శ్రీమదార్షకళాభారతీ నిలయము |
| గ్రంథము | **శ్రీ శ్రీనివాస దివ్య కళావైభవము** |
| | (పద్యప్రబంధము) |
| గ్రంథకర్త | **శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు** |
| | (యం ఓ యల్) ఇందిరాలగ్రామము |
| | తా। భువనగిరి జిల్లా నల్లగొండ |
| | మకాం. భూదానపోచంపల్లి |
| | సికింద్రాబాద్ మహబూబు కళాశాల విశ్రాంత |
| | ప్రధానాంధ్రాధ్యాపకులు |
| కృతిభర్త | శ్రీ తిరుమల క్షేత్ర నిలసిత శ్రీ అలమేల్మంగ |
| | పద్మావతీ సమేత శ్రీ శ్రీనివాస స్వామివారు |
| గ్రంథముద్రణ సమయము | శ్రీ ఈశ్వర నామ సం హేమంత శశిరములు, |
| | 1997 |
| గ్రంథ ముద్రణ సహాయకులు | శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన |
| | యాజమాన్యము వారు, వారికి కృతజ్ఞతాహార్దిక కృతజ్ఞతలు, |
| ప్రతులు | వేయి (1000) |
| గ్రంథమూల్యము | రూ. 50 (ఏబది రూపాయలు) |
| గ్రంథ ప్రాప్తి స్థానము | (1) తిరుమల తిరుపతి దేవస్థానము |
| | (2) శ్రీరామ బుక్‌డిపో, సికింద్రాబాద్ |
| | (3) శ్రీరూపా బుక్‌డిపో, సికింద్రాబాద్ |
| గ్రంథ ముద్రణ స్థలము | **శ్రీ పద్మావతీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,** |
| | హైదరాబాద్ ఫోన్ 7611413 |
| లేజర్ టైప్ సెట్టింగ్ | **శ్రీ సాయిమేధ కంప్యూటర్ క్రియేషన్స్** |
| | హైదరాబాద్ ఫోన్ 3068708 |

శ్రీః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

—: కృతిపతి శ్రీవేంకట శ్రీనివాస ప్రభువులు :—



-: నమస్సుమాంజలిః .-

శ్రీదివ్యద్వం సప్తశైలనిలస(ద్భీ) శ్రీనివాసం హరిం।

వేదాతీత విభుం విశేషవిభవం విశ్వైకరక్షామణిం

సాధూదార గుణైక భక్తవరదం - సత్యైక ధర్మప్రభుం।

శ్రీదాక్షిణ్యదయామృతాబ్ధిమనిశం - శ్రీభూషణం నౌమ్యహమ్

పద్మావతీ మనోబ్జాంతర్లీన మత్తాళిరూపిణే।

శ్రీశేషశైలవాసాయ - శ్రీనివాసాయతే నమః॥

శ్రీనాయకాయ - శ్రితమానస మందిరాయ॥

పద్మావతీ చరణసారసషట్పదాయ

భక్తాశ్రయాయ మదనన్య కృతీశ్వరాయ

శ్రీ శ్రీనివాసవరదాయ నమోచ్యుతాయ॥

-: శ్రీశుభంభవతు .-

శ్రీః

శ్రీః

శ్రీమహాలక్ష్మీసమేత శ్రీహయగ్రీవాయనమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

శ్రీసరస్వత్యైనమః

-: సవినయ విజ్ఞాపనము :

శ్రీసప్తగిరి నాథాయ - త్రిలోకైక బంధవే।
శ్రీలక్ష్మీ ప్రియ కాంతాయ - శ్రీనివాసాయతేనమః॥

''కలౌ వేంకట నాయకః'' అని పరమభక్తులైన పెద్దలసూక్తి, కృతయుగంలో నరసింహుడు, త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు, ద్వాపరంలో శ్రీకృష్ణుడు, కలియుగంలో శ్రీవేంకటేశ్వరుడుగా శ్రీమన్నారాయణుడు భక్తసంత్రాదిశీలుడై ధర్మసంస్థాపకుడై అవతరించి చేతనోద్ధారణ గావించుచున్నారు. శ్రీపద్మావతీ అలమేల్మంగా పతియై శ్రీవేంకటేశ్వరుండైన శ్రీశ్రీనివాస ప్రభువు వేంకటాచలంబై ప్రసిద్ధిగన్న ఈశ్రీగిరిపై భక్తుల పాలిటి కల్పవృక్షంబై కలియుగ ప్రత్యక్షదైవంబై పిలిచిన పలికే ఆపద్బాంధవుడునై భక్తులచే సేవింపబడుచు నిత్యకల్యాణ పచ్చతోరణములతో అంగరంగ వైభవోపేతుడై చెలువొంది కొలువొంది వెలుగొందుచున్నాడు. ఆజగద్భర్తయైన శ్రీనివాస ప్రభులకు సాష్టాంగదండవత్ప్రణామంబులు.

వారి అనుగ్రహంతో ఆచార్య పరమాచార్యాది ప్రపన్నుల మంగళాశాసనముతో శ్రీస్వామివారి సన్నిధిలోనే వారి అనుగ్రహంతో అప్రయత్నంగా నలవడిన ఈకవితాసూక్తిని స్వామివారికే అర్పింపవలెననియెంచి శ్రీస్వామివారి వైభవములతో కూడిన ఈచిన్ననైన ''శ్రీశ్రీనివాస

దివ్యకళావైభవంబను కృతిని స్వామి అనుగ్రహంతో వెలయించి కృతజ్ఞతతో భక్తి ప్రపత్తులతో శ్రీపద్మావతీ అలమేల్మంగా సమేత శ్రీశ్రీనివాస ప్రభువుల పాదారవిందములలో సమర్పించుకొంటిని. అచ్చట స్వామివారి కళాశాలలో చదువుకొని వారి అనుగ్రహంతో ఉద్యోగినై విశ్రాంతిపొంది ఈచిన్నని కృతిని వెలయించి శ్రీవారి దేవఋణ విముక్తిగా కృతజ్ఞతాపూర్వకముగా చంద్రునికో నూలుపోగన్నట్లు ఈకృతి శ్రీనివాస స్వామికర్పించుకొని నన్నును నాకవితను నాజన్మను సార్థకము గావించుకొని కృతకృత్యుడనైనందులకునెంతగానో తృప్తిగాంచితిని, ఈదాసుని కృషియంతయు శ్రీస్వామివారి నిర్హేతుక జాయమాన కృపయే కారణమై ఫలించినది కాని నేను నిమిత్తమాత్రుడను. తిరుపతి దేవస్థానంవారు హిందూధార్మిక ఆధ్యాత్మిక సాహిత్య ప్రచారమునకు కంకణము కట్టుకొని యధోచితముగా ఆర్థిక సహాయము చేయుచున్నారని తెలిసికొని తిరుమల తిరుపతి దేవస్థానము యాజమాన్యం వారిని ఈగ్రంథముద్రణకై ఆర్థిక సహాయము అర్థింపగా వారు యదాశక్తి అందించిన ఆర్థిక సహాయముతో సహృదయ సాహితీ
**శ్రీ తూ శ్రీకాం డూ లి నరసింహా చార్యులుగారు కు లియ**
ప్రియులైన మిత్రుల సహాయముతో; శ్రీమాన్ కే.శే కాండూరు వేంకటాచార్యులగారి స్మారకార్థముగా వారి శ్రీమతిగారు యధోచిత ఆర్థిక సహాయము అందింపగా స్వామికృపతో గ్రంథమును ముద్రించి శ్రీశ్రీనివాస
**వారికందరికి నా హార్థిక కృతజ్ఞతలు;**
ప్రభువు పాదారవిందములలో సమర్పించుకున్నాను. ఈగ్రంథమునకు తమ అమూల్య సందేశము అందించిన పెద్దలకు సాహితీబంధువులకు మిత్రులకు ప్రత్యేకంగా ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానము యాజమాన్యం వారికి మత్హార్థిక కృతజ్ఞతాభివందనములనందించుకొనుచున్నాను

గ్రంథమును ముద్రించియిచ్చిన పద్మావతీ ప్రింటర్స్ వారికి

కృతజ్ఞతలనందించుకొనుచున్నాను భక్తి సాహితీప్రియులు క్షీరనీర న్యాయముగా గ్రంథములో స్వారస్యమును గ్రహించి యానందించుటకు గ్రంథ పఠనముగావించి వారు సంతసించి నన్నానందింపజేసి నాకవితకు ఇతోధిక ప్రోత్సాహమిచ్చుచు నన్నాశీర్వదింతురని ఆకాంక్షించుకొనుచు నమస్సుమాంజలితో సెలవుతీసికొనుచున్నాను

విత్తగింపవలెను

శ్రీ ఈశ్వర శరద్రుతువు

ఇట్లు

భవదీయుడు

నల్లదీగ శ్రీనివాసాచార్యులు

శ్రీః

శ్రీరస్తు శ్రీలక్ష్మీ హయగ్రీవాయనమః శ్రీశుభమస్తు

శ్రీవ్యాసపుర (వాసర) సరస్వత్యైనమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

(శ్రీతిరుమల క్షేత్ర విలసిత శ్రీపద్మావతీ అలమేల్మంగాసమేత)

# -: శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవము :-

(పద్య ప్రబంధము)





శ్రీశేషశైల శిఖరాభరణాయమానం
పద్మావతీచరణ చారణ చంచరీకం!
ఆల్మేలు మంగ సుదతీనయనాభిరామం
శ్రీ శ్రీనివాస విభుమాత్మనివొమినిత్యమ్ !!

## కృతికర్త



శ్రీమాన్ నల్లదీగ శ్రీనివాసాచార్యులు యం. ఓ. యల్.
విశ్రాంత మహబూబు కళాశాలా ప్రధానాంధ్రాధ్యాపకులు,
సికింద్రాబాద్

## కృతి బహూకృతి స్వీకర్త



శ్రీమాన్ కే.శే. కాందూరి వేంకటాచార్యులుగారు యం.ఏ. బి.ఎడ్.
విశ్రాంత జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్, నాంపల్లి - హైదరాబాద్
వీరి పక్షమున వీరి శ్రీమతి గారు కృతి బహూ
కృతి స్వీకర్త ఐనారు,

: శ్రీ :

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీసరస్వత్యై నమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీ శ్రీనివాస దివ్య కళా వైభవము

## ప్రథమ సర్గము

### (౧) ఇష్టదేవతాదిస్తుతి : (సంస్కృతము)

శ్రీలక్ష్మీ రమణీ మనోహర విభుం
విశ్వాకృతిం సుందరం
శ్రీ శంఖారి గదాంబుజాసి విలస
చ్చార్ఙాయుధో ద్యత్కరం।
హేమాభాచ్ఛదుకూలినం
గళలసచ్ఛ్రీ వైజయన్తీ స్రజం
సాషాఢోద్భవనీల నీరద తనుం
నారాయణం నౌమ్య హమ్। ౧

#### బ్రహస్తుతిః

శ్రితావన కృపాంబుధిం - త్రిదశలోక సంపూజితం
చతుర్నిగమ భాసురోన్ముఖ చతుష్కసంశోభితం।
మనోజ్ఞ కమలాసనం హిత మరాళ సంయాయినం
సమామి విధి మాత్మని ప్రథిత భారతీనాయకమ్. ౨

#### నీలకంఠస్తుతిః

కైలాసదివ్య గిరిధామ నివాసమీశం
గౌరీమనోజ్ఞ హృదయాంబుజ మత్తభృంగం।
నందీశ్వరాదిసురరుద్ర గణాను సేవ్యం
శ్రీనీలకంఠ మనిశం ప్రణమామి దేవమ్. 3

## లక్ష్మీ స్తుతిః

క్షీరాబ్ధి రమ్య దుహితాం ప్రభు విష్ణుమూర్తేః
వక్షస్థలే లలిత కౌస్తుభ శోభితాంగీం।
వాత్సల్య పూర్ణ జలజాక్ష యుత రమ్యనేత్రీం
నౌమి శ్రియం త్రిభువనా వన దేవదేవీమ్. ४

## శారదాస్తుతిః

శ్రీ శారదాం సితనవాంబుజ సుస్మితాస్యాం
వీణాం సుధాద్రవినదై రుపలాలయన్తీం।
పంకేరుహాసన విరాజిత వాఙ్మయీం తాం
నౌమి శ్రితా వన కృపాం కవితాకళాంగీమ్. ౫

## అన్నపూర్ణాస్తవమ్

దేవీముమాం పశుపతే ర్వపు బాసురార్థాం
భూతేశమానస మనోహరరాజహంసీం।
కాత్యాయనీం శ్రితజగజ్జనీం కృపాఢ్యాం
మన్మాతరం మనసి నౌమి సదాన్నపూర్ణామ్. ౬

## హయగ్రీవస్తుతి:

జ్ఞానస్వరూప మనిశం నిగమాంతవేద్యం
శ్రీ శంఖచక్రవర పుస్తక దివ్య దక్ష
మాలాఢ్యహస్తజలజం సిత పద్మవాసం
నౌమి ప్రభుం హయముఖం మధుకైటభారిమ్. ౭

## విష్వక్సేనః

విష్వక్సేనం గణాధ్యక్షం
విష్ణుసేనాధినాయకం ।
వన్దే శ్రీశపదారాధ్యం
సూత్రవత్యాధిపం విభుమ్. ౮

**గణపతిః**

గణాధిపం విఘ్నహారం
శివయోః ప్రీతివర్ధనం।
సిద్ధి బుద్ధీశ్వరం దేవం
తం నమామి గజాననమ్. ౯

--శ్రీరంగనాథ ః--

వేదత్రయీ మత లసత్పరవాసుదేవం
ప్రత్యక్షదైవ మనిశం శుభకృన్మనోజ్ఞం
శ్రీభూసతీవిబుధ సూరిజనాది సేవ్యం
వైకుంఠరంగ విభు మాత్మని నౌమి నిత్యమ్. ౧౦

భోగీంద్ర భోగ పరికల్పిత రమ్యతల్పే
నిద్రాభిముద్రలలితం చ సుఖం శయానం।
రాజ్ఞీకరాబ్జపరిచర్యహితాంఘ్రియుగ్మం
నౌమి ప్రభుం శ్రీతజనా వనరంగనాథమ్.॥ ౧౧

(వేంకటేశ్వరస్తుతిః):-

శ్రీశేషశైల శిఖరే లలితోరు వప్ర -
క్రీడాయమాన మదవారణ నీలమేఘః।
పద్మావతీకుచమనోహరచూచుకాయ -
మానాఽకృతిశ్చ కరుణార్ద్రగుణీ పునాతు॥ ౧౨

సౌభాగ్యభాగ్యవిలసత్కలమేలుమంగా-
రాజ్ఞీమనోజ్ఞమృదు మానసరాజహంసః।
పద్మావతీమహితమంజుల పాదపద్మ
మాధుర్యమత్తమధుపః హృది మే చకాస్తు। ౧౩

భక్తాంతరంగ నవకైరవ పూర్ణ చంద్రః
తాపత్రయార్తజన చాతక వర్ష మేఘః।
షడ్వైరి పీడిత హితాశ్రిత కల్పభూజః
మన్మానసే లసతు వేంకటరాజహంస ః। ౧౪

శ్రీ శంఖ చక్ర ఘటితాంబుజ హస్తయుగ్మ !
భవ్యోర్ధ్వపుండ్రలలితోన్నత ఫాలభాగ !
రత్నప్రభా పటల హేమకిరీట ధారిన్ !
పీతాంబరోజ్జ్వల ! హరే ! అవ మాం రమేశ ! ౧౫

కారుణ్యపూర్ణ కమనీయ కళాకలాప -
శ్రీరమ్య పంకజ దళాయత సౌమ్యనేత్ర!
దీవ్యత్కృపామృత విశేషమనోవిశాల!
లక్ష్మీపతే! ఉరగశైలపతే! నమోఽస్తు ౧౬

లస చ్చికుర లోలుభం
సులలితోర్ధ్వ పుండ్రోజ్జ్వలం
ప్రశస్త గుణవైభవో
న్నిబిడ రమ్య ఫాలోన్నతం
దయామృతతరంగితా
యత విశాల లోలేక్షణం
మదీయ హృది నౌమ్యహం
వృషగిరీశ్వరం శ్రీపతిమ్। ౧౭

లక్ష్మీకటాక్ష లాలిత్య రాగ శ్రీస్మితభాసురః।
భక్తాంతరంగ సంచారీ పాతు శేషాద్రి రాణ్మణిః ౧౮

జయతు జయతు దేవో శేష శైలాధివాసః
జయతు జయతు పద్మామానసాంభోజభృంగః।
జయతు జయతు భక్తాభీష్టదో శ్రీనివాసః
జయతు మమ హృదబ్జే భాసమానోముకుందః। ౧౯

(అస్మద్గురువందనమ్):-

శ్రీనల్లదీగ వరవంశ సుధాబ్ధి చంద్రం
శ్రీనర్సమా నరహరి ప్రియ పుత్రరత్నం
శ్రీమూడమాహృదయపంకజభృంగరాజం
నౌమి ప్రపన్న నృహరిం జనకం మదీయమ్. ౨౦

నారసింహగురోః పత్నీం మాతరం చూడమాంబికాం।
సద్భక్త్యా నౌమి సతతం జ్ఞానసౌశీల్యభాసురామ్। ౨౧

శ్రీ మన్నమ్మడుంబకులవార్నిధి పూర్ణ చంద్రం
శ్రీతాయమాప్పలగురుప్రియకృత్తనూజం
దివ్యత్రపన్న విహితం పురుషోత్తమార్యం
నౌమి ప్రశస్త గుణవైభవ దేశికం తమ్ ౨౨

దివ్యన్మనోజ్ఞ కవిలోకనుతాప్రమేయాన్
వాల్మీకి రాద్యవిపరాశరపుత్రముఖ్యాన్
భాసాది సత్కవికులేశ్వర-కాళిదాస
వాగ్వైభవాన్ మనసి మే కలయామి నిత్యమ్. ౨3

ఆంధ్రైకవాఙ్మయతపోధనసత్కవీంద్రాన్
దివ్యత్కవిత్రయ ఋషిప్రభృతీన్ ప్రశస్తాన్।
శ్రీనాథ పోతవరసా శ్రయకావ్యకర్తౄన్
శ్రీమత్రబంధసుకవీన్ సతతం స్మరామః ,, ౨౪

ఇత్థం స్తుత్వా నమస్కృత్య
శ్రీహరే ర్దివ్యసత్కళా
వైభవాఖ్యకృతింభక్త్యా
కరోమి ప్రీతయే హరేః ॥౨॥

★ ★ ★

శ్రీమహాలక్ష్మ్యైనమః శ్రీహయగ్రీవాయనమః శ్రీసరస్వత్యైనమః

## శ్రీ శ్రీనివాస పర బ్రహ్మణే నమః

## ఇష్టదైవప్రార్థన - (ఆంధ్రమున)

శ్రీయారన్ మునునవ్వు సిగ్గువలపుల్
సింగారముల్ గుల్క, నే
పౌ లావణ్యము మేన దళ్కొలుక శ్రీ
పద్మావతీదేవి; యా
శ్రీలోలుండగు శ్రీనివాసు నెద
రంజిల్లంగ కల్యాణ శ్రీ
మాలంగైకొని చోద్య మొరగని
ప్రేమం బిక్కమమ్మేలుతన్ ! ౧

దేవాదిదేవేంద్ర దివ్య మౌళి ప్రభా
కమనీయ పాద పద్మములవాడు
గణనీయ రమణీయ ఘన విద్యుదాహ్లాద
మేఘ వర్ణపు తిరు మేనువాడు
మంద మంద స్మితానంద సుందరమైన
మోముపై నామమ్ము మురియువాడు
అమిత సౌభాగ్యద హస్తాబ్జయుగళిన
రాజిత శంఖచక్రములవాడు

మహిత సౌవర్ణమయ వజ్రమౌళివాడు
ఇరువురమ్మ లతో జగ మేలువాడు
శ్రితజనావను డురగాద్రి జెలగువాడు
శ్రీనివాసుడె మమ్ము రక్షించువాడు. ౨

శ్రీకరుణాలవాలుడయి
శ్రీగిరియందువసించి లోకర
క్షా కరు డౌచు భక్తజన
కామితదాయకుడౌచు సాధ్వీల
క్ష్మీకలితాంగుడౌచు జయ
శీలత గూర్చుచు భక్తకోట్లకే
శ్రీకరుడౌచు శేషగిరి
శ్రీపతి వెల్గుచు మమ్ము గాచుతన్। 3

గంభీరోన్నత సత్కృపాసరళిచే
కాలుష్యనిర్మూలనా
రంభంబుంగలిగించి; భక్తహృదయో
ద్రంధుల్ బాపి; సద్భక్తిభా
వంబున్ భక్తుల కిచ్చి పాపముల దెం
పంజేసి సంసార కూ
పంబున్ దొల్గెడి మమ్ముగావగదె ! దే
వా ! శ్రీనివాస ప్రభూ ! ४

హయగ్రీవ స్వామి :-

శ్రీవినిర్మల స్ఫటికసుశ్రీల తనుని
జ్ఞాన సౌందర్య వైభవా నందవిభుని
అఖిల విద్యలకాధారమైన గురుని
వరదు లక్ష్మీహయాస్యుని పరగ గొల్తు ; ౫

శ్రీహయగ్రీవ ! శ్రీహయగ్రీవ! యనుచు
ఎవడు త్రికరణశుద్ధిన నెదగి తలచు
వాని మోమున శ్రీవాణి స్వచ్ఛమైన
(1) దివ్యవాహినియైసాగు దీప్తిలివగ ; ౬

ముగ్గురయ్యల నెదలోన బూని కొలిచి
ముగ్గురమ్మల నర్మిలిన్ బొంద వేడి
విఘ్నహరులైన గణనాథ విష్వసేను
నాత్మ గని యిష్టసిద్ధికి నంజలింతు। ౭

ననెడి పెద్దల మాటల నాత్మ నమ్మి
చెదరిపోలేని భక్తితో చిత్తమందు
ఆశ్రితావను లక్ష్మీ హయాస్య గొలిచి
పలికెదను స్వామి సత్కళావైభవముల ౮

శ్రీగోదాసతి చల్ల నౌ కృపంతో
జిందాడుదృక్సంతతిన్
సాగన్ జేయుచు సత్ప్రసన్నసుజనుల్
సంకీర్తనల్ సేయగా
బాగోగుల్ గలిగించి సంతతము శ్రీ
భాగ్యంబులన్ గూర్చుచున్
లా గైదోడుగ నిల్చి సూక్తిసుధ లం
దంజేయుచున్ బ్రోచు నన్। ౯

అంబుజోదరపాదారవిందయుగళు
శ్రీయురస్థలు వటపత్రశాయి వెలమి
భక్తిసేవించి శ్రీరంగపతిని, బేర్మి
పెండ్లియాడిన మాతల్లి, బ్రీతిగొలుతు ౧౦

(1) దివ్య గంగాభవానియై దీప్తి సాగు (2) శ్రీశు

సుందరోజ్జ్వల శరదిందు మందహాస;
నవ్యకువలయ దళ లోచనాభిరామ;
చారుజలజాస్య; నీరజాసనమనోజ్ఞ;
శారదాదేవి మున్మదిన్ జేర గొలుతు। ౧౦

శారద కౌముదీధవళ
సల్లలితామల దివ్యదేహ, శ్రీ
మార మనోజ్ఞముగ్ధరతి
మానిని మించిన సుందరాంగి, లీ
లారమణీయ కోమలవి
లాసలతాంగి; విరించిరాణి; ద్రా
క్షారస రమ్య వాక్సుధల
సాగగ జేయుచు బ్రోచు నన్ దయన్, ౧౧

సులలిత మృదుమధు రసముల
చిలుకల పలుకలర గులుకు చెలువములలరన్
పలుకుల వెలదిని మది గని
పలికెద సిరిమగని కళల బలు విభవములన్ ౧౨

మీకున్ మా కిటనున్న బంధమును;ల
క్ష్మీవేంకటాద్రీశ ! స్వా
మీ ! కర్గింపక సర్వకాలముల సా
మీప్యంబులన్ గూర్చుమున్
మీకారుణ్య సుధార్ద్రదృక్కులము వె
మ్మిన్ మాకు నందించి మీ
శ్రీకంజాతపదైకసేవలిడి ర
క్షింపంగదే దాసులన్ (విన్)। ; ౧౪

శ్రీమదనవద్య సౌందర్యసీమలైన
అండ పిండ బ్రహ్మాండాల నిండియుండి
సృష్టిసంస్థితి లయముల జేయు నెవడో
ఆయఘోర లీయమహామహోత్తు వీవు ౧౫

ఎవ్వడు నీ చరాచర వి
శిష్టజగత్తుకు కార్యకారణుం
డెవ్వడు సృష్టి సంస్థితి పటి
ష్ఠతకున్ లయ కర్మ కార్యుడో
ఎవ్వడు నాది మధ్య లయ
మెందున నింతగ బొందకుండునో
అవ్విభు డీజగత్ప్రకృతి
(1)వైభవుడీవని గొల్తు శ్రీపతీ ! ౧౬

ఆది మధ్యాంత రహితు డనంతమైన
బహుళవిస్తార బ్రహ్మాండ భాండమునకు
కార్యకారణు డెవ్వ డాఘనుడ వీవ;
అనుచు నిర్గుణ సగుణ రూపాధ్యుగొలుతు ౧౭

## (రామాయణ రత్నహారము)

నవఘనాఘనశోభ నర్తింప తల్కీను
రమ్యేంద్రనీలమై రాము డలర
అతని కిరుదెసల నవనిజ సౌమిత్రి
పుష్యరాగముగ కెంపుగను విరియ
భరతుడు పచ్చయై పరగ శత్రుఘ్నుడు
భవ్యవైడూర్యమై భాసిలంగ
ఆవిభీషణుడు సుగ్రీవుడు కొమరొప్పు
మణి ప్రవాళమ్ములై మసలివెల్గ

(1) వైభవు డీవె కదయ్య !

ఘనజటాయువు గోమేధికంబు; హనుమ
వజ్రమై కొల్చివున్నాగ వరలుచుండ ;
రమ్యరామాయణాఖ్య శ్రీ రత్నహార
మీశ ! మీ వైజయన్తియై యేలు మమ్ము। ౧౮

(కేశవస్వామి)

అలచతురాననుండా శివస్వామియు
ఎరుగాడ జనియించి రెవనియందు
హరిహరబ్రహ్మాదులురుసురవర్యులై
భువనాధిపతులైరి యెవని వలన
కంసుని పంపున హింసింప వచ్చిన
దనుజాడా కేశిని దునిమె నెవడు
లలితేంద్రదీఒకల సిరుల్ గులుకాడ
అష్టమి(మీ) చంద్రు డెవ్వానిమోము -
ఇంద్రియాళికి రేడయి యెదిగె నెవడు
ఎవడు నెవడన నతడు కేశవుడుగాడె?
ఆ మనోజ్ఞపు కేశవ స్వామి వీవ
యనుచు శ్రీ శ్రీనివాస ! నిన్ మనన జేతు। ౧౯

(పితరులు)

ఈ మనోజ్ఞపు జన్మకు ప్రేమమీర
కర్మ గతిన నైమిత్తిక కారణంబుగ
తనరు తలిదండ్రులను నాత్మ దలచి నిమ్ము
స్వామి! మతియింతు గరుణింపు సాగిలింతు।,

ఎన్నిజన్మలలో నేను నెవరి కెవరి।
కెట్టి సంబంధ బంధాల బుట్టినానొ
అన్ని జన్మల కిల కారణంబు లైన
వారలకు బ్రాంజలింతు నిన్ బలుకనెంతు. ౨౦

(ఆచార్యపరమాచార్యులు)

అల ముడుంబాన్వయాంబోధి చంద్రు డైన
పరమ పురుషోత్తమాచార్య గురుని బుధుని
మదిని దలపోసి నతి జేసి మమత మీర
స్వామి ! మీవైభవంబులన్ ప్రస్తుతింతు 22

(మరిజ్ఞంటికవులు)

శ్రీశారదాదేవి చెలిమితో నెవ్వారి
వాకిట కనువూడ్చి వాసిగాంచె
ఎదగి శ్రీవాగ్దేవి యెవ్వారి గృహమున
నేడు తరాలదాకాడి పాడె
ఇహపరతారకం బెవ్వారి శ్రీసూక్తి
అమృత వాహిని యౌచు నవని విరిసె
ఈశు శ్రీవైభవ మెవ్వారి తిరునామ
సంకీర్తన సుధాబ్ధి సాగి మీరె
ఎవరి విఖ్యాతి కవికుల వితతి కెల్ల
మార్గదర్శకమై శిరోమణిగ వెల్గె
అమరింగంటి కవికుల విమల తిలకు
లైనవారిని గొలిచి తలంతు నిన్ను!. 23

వీడని దైవభక్తిగల విజ్ఞుల
మాన్యుల దివ్య సూరులన్ ;
వాడని వైష్ణవత్వములు వర్ధిలు
భాగవతోత్తమార్యులన్ ;
వీడని వాగ్వధూవిభవవేదుల
సత్కృవిలోక చంద్రులన్ ;
వేడుచు మీమహోజ్జ్వ విభవేందిర
గొల్చెద మిమ్ము మ్రొక్కుచున్!. 24

సరసుల హిత స్నేహితబుధ।
వర సుతులను జన్మలాది బంధుజనాళిన్
మరువక మదిలోదలచుచు
ఉరగాచలవాస ! నిన్ను నోర్మిభజింతున్ ; ।. ౨౫

హరిహరాఽమర విబుధుల నాత్మ నెన్ని
విఘ్నసేనుని గణనాథు వేడ్కఁదలచి
సూరివర్యుల శ్రీనిత్యసూరిజముల
భక్తిసేవించి మదిని నిన్ బలుకనెంతు, ౨౬

శారద నీరద మేదుర
సారపటీరాంగియైన శారద నెడదన్
కూరిమి పలుకిడ వేడుదు
శ్రీరమణా ! నిన్ను గొల్తు చేర్చుము కరుణల్ ౨౭

వెలగల కలుముల పడతిని
చెలిమిన హరి యురమునందు జెలగెడు సుదతిన్
కలిమిగల పలుకు నిడుమని
కొలుచుచు నిన్ బలుకుదయ్య! కూర్పుము దయలన్।. ౨౮

చలిమల సిరిపట్టిని కూ
ర్మలరిన మను వెండి కొండరాయల పడతిన్
చలికుడుము బుడుత తల్లిని
దలచుచు నిన్‌బలుకుదయ్య! దయలిడుమయ్యా ! ౨౯

ఆది కవులగు వాల్మీకి వ్యాస భాస
కాళిదాసాదిగీర్వాణ కవుల నెల్ల
మదిని గొనియాడి తత్సూక్తి మననజేసి
వ్రాతు నీవైభవంబు నిన్ ప్రాంజలించి।. 30

విమత మఖప్రయోగవిధి
విత్తము డుత్తమ వాక్ప్రయోగమం
ధనఘుడు వన్నెపాల్యుడు మ
దారుడు వాఙ్మయసృష్టికర్త తి
క్కన, హరదాసుడైన ఘన
కావ్యదురందురు డెఱ్ఱనార్యు డా
త్మన వెలుగొందు ద్రొక్కి; నిను
దాల్మిన బల్కుదు మీకృపల్ గనన్ 30

ఖ్యాతి గల మేటి శ్రీనాథ పోతనాది-
సాధు సరసజ్ఞులౌ ననువాద కవుల
అష్టదిగ్గజ కవులు ప్రబంధకవులు
నాది గాగల కవుల నే నాదరించి 31

తరుణరసాచితీరుచుల
ధాటిగ నాసురగంగతీరు తెం
పరితన మొప్ప దివ్యపద
పద్మపు తొయ్యలి యాడిపాడిన
ట్లురు రస,బావ రాగ తతు
లూరగ పాడిన తాళ్ల పాక సుం
దర కవి యన్నమయ్య విబు
ధాగ్రణి గొల్చి రచింతు నీకృతిన్ 33

అద్యతన కాల కవులలో వసఘమైన
సరస కవితా సుధోక్తుల పారమతిన
గ్రోలి వారికి ప్రాంజలిన్ లలత్వ -
మలరి నిన్నులుకుదయ్య ! పల్కులర జూడు !, 34

ఎందరో మహామహులు వింకెందరెంద -
రిల మహా కవివరులుష్టై యలరివారొ !
వారి నందర వెదనన్ ప్రస్తుతించి
స్వామి! మీ వైభవంబుల భక్తి వ్రాతు, 3౫

శ్రీః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణేనమః :-

## (3) కృతిసమర్పణము

శ్రీ యలమేలు మంగ పతి
చెల్వగు నీ సిరి కొండరాయడై
శ్రేయము గూర్ప, భక్తులను
జేరి దయన్ గని వెల్గి దుర్భవా
పాయము బాపి సత్పదపు
ప్రాపును జూపు పదాబ్జయుగ్మడై
ఈయిల శ్రీనివాసుడయి
శ్రీలిడి మత్కృతి నేలు; నాథుడై ।। ౧

స్వామి ! వేంకట పతి! పేర్మి సలిపి మ్రొక్కి
భవ్య భవదీయ సత్కళా వైభవాఖ్య
సత్కృతి శ్రీని తావక చరణకమల
సన్నిధిన చేర్చితిన్ కృప నెన్ని కొనవె ! ౨

జీవ శైవ కైత జెలువొంద జెప్పిన
జీవ కవి యె సుకృత జీవి వాడె
కృతిని నాదుకొనిన సుకృతాత్ముడే వాడు
ఉభయు లుందు రుర్వి యుండువరకు, 3

శ్రీలువిలసిల్లు తిరుమల సీమ వలరు
భక్తజన పారిజాతమై వరలు స్వామి !
తావకీనాంఘ్రి దాసుల దాస దాసు
నేలు కృతి నేలు మిహ పర శ్రీల నొసగి ; ౪

స్వామి ! పైతృక ధనము కాస్తంతలేని -
వాడ; స్వార్జితధనము తావంతలేవు;
ఉన్నదని తృప్తిమంటిని ముక్తి విడెడు
మీ పదాబ్జపు శ్రీనిధి ప్రాపు దప్ప !, ౫

ధరణీలేశము నేలుమాత్రమున దు
ర్ధ్వాంతాతిగర్వాంధులౌ
నరనాథాళిని చాటుకీర్తనల నెం
తన్ గొల్చి ధన్యుండనం
చరయున్ బల్కు కవిబ్రువుండు, నటులౌ
స్వాంతమ్మునన్ గొల్వ నిన్
పరమోదారు గుచేలు నేలిన గతిన్
పాలింపు; నిన్ నమ్మితిన్, ౬

ధనమోహోన్నత దుర్విదగ్ధమతులౌ
దంభక్రియుల్ పండితుల్
అనిశ మ్మానరదుర్వినాయక గృహ
ద్వారాల గేల్మోడ్చుచున్
వినుతుల్ సేయుచు నుంద్రు, వారివలె
నే వేడన్ విభూ! యన్యులన్
ఘనమౌ మీ చరణ ద్వయిన్ ధనముగా
గాంక్షింతు, గాపాడవే ! ౭

దురితోన్మాద పటుప్రగల్భజటిలో
త్తూ్కరోగ్రతాపత్రయో
త్కర షడ్వైరి కులాగ్రహోగ్రధిషణా
దంబాద్ధిపా రాధనల్
పరగన్ జేయను, రిక్తవహ్నినికర
వ్యాఘాతముల్ కాల్చినన్
ఉరుదుర్వారభవాబ్ధిముంచినను ని
న్నున్ దప్పనన్యున్ గనన్, ౮

జిట్టెడు పొట్టకై వెరపు
జెందక జేయగరాని చేతలన్
దిట్టగజేసి పట్టెడగు
తిండికి నేపడరాని పాటులన్
పట్టునజేసి కుంది కడు
వ్రందుట కంటెను భ్రాంతులన్నిటిన్
నెట్టగజేసి నిన్నెదన
నిల్పుట మేలదిగాదె? శ్రీపతీ! ౯

శితజనబాంధవుండవని
శ్రీగిరిమందిర సుందరుండవీ
వతుల కృపాంబురాశివని
భక్తజనార్తి హరుండవంచు నిన్
మతిమతుములైన సాధుజన
మాన్యులు విజ్ఞులు ధర్మతత్పరుల్
స్తుతులొనరించి చెప్ప విని
చూచితి మెచ్చితి నిచ్చితీకృతిన్ ౧౦

స్వామి ! సద్భక్తి మీర యీసరసకృతిని
మీపదాబ్జాల సిరులలో మెలగజేయు
పత్ర ఫల పుష్ప జలముల పగిదినిడితి
దాసు గనవయ్య మీ దాస దాసునిగను, ౧౧

కృతిని గన్నవాడు కృతికైనస్థితి గూర్చి
నేలువాడు పుణ్యశీలతముడు
అవనిలోన వీరు నాచంద్రతారార్క
ముంద్రు చిరయశస్సునందు కొంద్రు ౧౨

"నీవు నన్నిల స్మరియింపు నేను నిన్ను
సంస్మరించెద నిహపరసాధకమిదె
అని వచించినమీ పదాబ్జములయందు
కృతి నొసంగతి నీశ! సమ్మతిని గొనవె !" ౧౩

చక్కదనాలతండ్రి వని
చక్కన జేరితి చక్కమాలినీ,
చిక్కదనాల తేనియలు
చిమ్మెడు చొక్కపుచల్ల చూపునా

దిక్కునజారనిచ్చి కృప
దేలిచి ఈకృతి నేలి; నన్ దయన్
మక్కువ నేలు కొమ్ము వనమాలి!
మదాత్మసుమాంజలిచ్చితిన్'' ౧౪

చిక్కని సోయగాలు గడుచిందులు
ద్రొక్కెడి చుక్కలయ్యనే
చిక్కనరింపజేయు నొగసీనెడు
కొండలసొకురాయ! పె
న్మక్కువ మీర భక్తిన రమాసతి
విన్నెదనిల్పి కొల్వ, నీ
యెక్కసమైన చక్కదనమెంచి
తరింప నొసంగి తీకృతిన్! ౧౫

సీటులగుల్కు సొంపులెద
నిండినకొండలదండి రాయడా!
మేటిజగాలనేలుబలమేచిన
టీరములున్న రేడ! కో
నేటి పసందురాయుడ! గణింప
నిదొనెనరున్నవాడ! శ్రీ
ధాటిగలట్టి నీయడుగు దామర
లందిండుని చ్చితీ కృతిన్ ౧౬
(షష్ఠ్యంతములు)

శ్రీశైలేశునకనుపమ
శ్రీశుంభద్రాగహృత్కుశేయ రక్తా
శీశుండగు శ్రీహరికురు
సౌశీల్యోద్యోగ మా ని జన వేద్యునకున్! ౧

రాశీభూతకపాగిః

నీశా జసురేంద్ర బుధగణేడితగుణికిన్
ఆశామోహపిశాచా
వేశా పహనామవైభవేధిత హరికిన్ ౨

శ్రీశుభవిభవాశ్రయునకు
శ్రీశతపత్రాఽయతాక్ష శ్రీరమ్యునకున్
శ్రీశరదిందుస్మితునకు
ధీశుంభద్యోగయోగిద్విగ్వేద్యునకున్! ౩

స్థిరకరుణాహృదయున
కరి శంఖాద్యాయుధాదిగల వీరునకున్
సిరియెదతామరతుమ్మెద
కురుజలధరనీలతనునకున్ శ్రీహరికిన్! ౪

సిరి యురమున గల సామికి
నురుకరుణలు కనులసిరుల నలరెడుహరికిన్
ఉరగోద్గిరి గిరిధరునకు
కరివర వరదునకు,గరుడగమనాఢ్యునకున్! ౫

కరుణారసభరితాఽలస
సరసీరుహ రుచిర సద్విశాలాక్షునకున్
హరిహర పరమేష్ఠ్యమర
పరమాదరణీయ భక్తపాలన మతికిన్ ౬

అనుపమ గుణగణ శరధికి
ననఘ దయావితరుణునికి నఘహరమతికిన్
వినుత లస త్ఫణిరాడ్గిరి
ఘనునకు శ్రితపారిజాతుకా శ్రీపతికిన్ ౭

అగణిత శుభ విభవాస్పద
సుగుణామృత జలధికనఘ సూరి నతునాకా
నిగమేడిత జగదీశుకు
నగకుల వరశేషశైలనాయకమణికిన్ ౮

ఈ చిరుకబ్బపు కానుక
నేచిన సద్భక్తి మిగుల నేర్పడ నెడదన్
పూచిన తమకపు పువ్వుగ
దాచక హరి కొసగి జన్మధన్యుడనైతిన్। ౯
స్వస్తియగు స్వామి! మీకు మీ భక్తతతికి
సేవకాళికి భారత శ్రీకి నాంధ్ర
మాతృమూర్తికి శ్రీగిరిమాన్యప్రజకు
సాధు లలితైక సత్కళారాధకులకు। ౧౦

శ్రీశుభంభవతు

ఇయ్యది

శ్రీశ్రీనివాస దివ్య కళా వైభవం బను ప్రబంధంబున
సంస్కృతాంధ్రంబులందిష్టదేవతాదిస్తుతియు, కృతి
సమర్పణంబు షష్ఠ్యంతాదులతో
ప్రథమ సర్గము శ్రీశ్రీని
వాస పాద పద్మార్పణమై ముగిసినది।

శ్రీః

శ్రీః

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీ పరస్వత్యై నమః

శ్రీశ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీశేషశైలశిఖరాభరణాయమానం। పద్మావతీస్తన గిరీంద్రత టేశయానం।

సందర్శితాంఘ్రియుగళం "శరణంప్రజేతి" నామిశ్రియః పతిజగత్పతి

మప్రమేయమమ్

# శ్రీశ్రీనివాస దివ్య కళా వైభవము

(శ్రీ పద్మావతీ అలమేలు మంగా సమేత శ్రీశ్రీనివాస)

## (४) -: క్షేత్ర సందర్శనము :-

(ద్వితీయ సర్గ)।

శ్రీః
శ్రీహయగ్రీవాయ నమః
శ్రీ సరస్వత్యై నమః
శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీశ్రీనివాస దివ్య కళా వైభవము

## (౪) క్షేత్ర సందర్శనము (ద్వితీయ సర్గ)

అదె శ్రీ శైలము, యాదిమధ్యఘటి
    తాంతమ్మెమిలేనట్టి శ్రీ
సదనాధీశు విహార పర్వతము, శే
    షా హీశ నాగేశ్వరుం
డెదిగీ తీరు నగా కృతింగలిగి యా
    ఢీన్ సర్వలోకేశు డా
మదన స్వామిని గన్న తండ్రినిట సం
    భావించు సేవించుచున్। ౧

శ్రీ వినోదుని కైంకర్య రీతులెరుగ
అతని కనుకూలు డై క్షేమమరయు వాడు।
శ్రీనివాసుని విడలేక శేషుడవని
శేషగిరి యాపుడై యిట జేరినాడు ౨

భక్త జగతికి శేషత్వ పారతంత్ర్య
సకల కైంకర్య విధులను శరణ మనుచు
చేసినని జీవుడ చ్యుతున్ జేరుననుచు
జాట శేషుడు నిచట శేషాద్రియయ్యె 3

తాను దరియించి భక్తసంతతిని బేర్మి
మిగుల దరియింప జేయనీమేదినిపయి
ఇచట శేషాద్రియాపుడై యొదిగి శేష-
విభుడు విబుధాత్ముడై భక్తి వెలసినాడు ४

భువనములనెల్ల దనమేల్మి బొజ్జలోన
నిలుపుకొని లీలజెలువారు నలువ తండ్రి
శ్రీశ్రియః పతి భువికి వేంచేయుననుచు
శేషుడిట ముందుగా, జేరె శేషగిరిగ ౫

అటులగా కున్న నవనిలో నామహీయు।
భువన భాండోదరుని భారమూనువాడు
అన్యుడెవ్వడు శేషుడు దప్ప లేదు
అతడె శేషాద్రియై హరియాజ్ఞనలరె ౬

కలికిలోద్వేలదుష్టా హిగరళతతిని
హరణ మొనరింప విషధరోద్వరుడునైన
శేషు డీశుని యాజ్ఞతో శేషగిరిగ
అవతరించెనో! యన గిరియమరె నిచట ౭

వినుతు డౌ శ్రీశ్రియః పతి వేంకట పతి
శ్రీనివాసుడు నైయిట జేరి నిలువ
శేషగిరి శ్రీగిరీంద్రమై చెలువుమీరి
ఇహ పరశ్రీల నిడి భక్త నివహమేలు ౮

కొంగు బంగారమై భక్త కోట్లకెల్ల
కలుగు కోర్కెల నీడేర్చు కల్పవల్లి
శ్రీశ్రియః పతి, తత్పద శ్రీలగల్గు
శ్రీగిరీంద్రము నిది భవరోగతరణి ౯

సర్వపాప2 పహరమ్మైన సకలపుణ్య
దివ్య తీర్థాల మయమిది; తీవ్రకలుష
రోగ రాగాపనోదనారోగ్యకరము
భోగ భాగ్యప్రదమ్మి యీ భోగినగము। ౧౦

సకల యోగీశ్వరేశ్వర చారుచరణ
కమల రాగప్రభా2 మాన గర్భమైన
గిరి వరమ్మిది సప్తసద్గిరివరమ్ము,
శేషశైలము నివాసర శ్రీనిలయము'' ౧౧

అనుమదల పోసి మదిలోన వినుతిజేసి
ప్రకృతి సౌందర్యసౌభాగ్య భరితమైన
దివ్య వైభవ తీర్థ సందీప్తమైన
శ్రీమదుజ్జ్వల శేష2 హిశిఖరిగంటి ౧౨

భక్త కోటులు తరియింప పరమపదమె
ఇలకు పరవాసుదేవుడే కలివడంచ
దిగెనో యన శ్రీగిరి దీప్తిగాంచె
శేష పరతత్వ వేద్య మీశేషనగము ౧౩

ఎచ్చటెచ్చట జూడ నచ్చటచ్చట పచ్చ
పచ్చ నౌ నడవుల లచ్చి సొగసు !
ఎందెందు గను గొనునందందు కొండకో
నల లోయలంసిరి చెలుములూగు!

ఏలావు బరికింప వాలావు పూతీవ
బోటల చిరునవ్వు పూల సొంపు
ఏవైపు బరికింపవావైపు పెలయేటి
పిరి సోర పరవపు పరుగురొదలు ౧౪

ఎందు వెందున గాంచిన నందునందు
గడుసుకరి వేల్పు దొర తేనె కలిమిపాట!
యూరు కోయిల పాటలు మారుమ్రోగు
మేటి సిరికొండ యిదె యని మెచ్చి కంటి ౧౫

శ్రీలలరారు భారతవి
శేష పవిత్ర చరిత్రగల్గు క్షే
త్రా లఘు దివ్యదేశముల
రాజిలు నియ్యది క్షేత్రరాజ మీ
నేలవగల్గు భక్తతతి
నెల్లెడ బ్రోవధరా2వతీర్ణమై
లీలగ వెల్గె నీ గిరి; ని
లింపుల కొండని యెంచి గాంచితిన్। ౧౬

కలియుగ మందు జీవులను
గావగ నెంచియె విస్మయాకృతిన్
గలిగిన సప్త శైల పరిఘా
వృత మై కలితాపహారమై
కులగిరులందు మిన్నయయి
కొల్పెడి భక్తుల కొంగుబంగారై
వెలసె నగంబిదంచు నెద
విచ్చుగ నచ్చుగ మెచ్చు,గాంచితిన్ ౧౭

రాజ మార్తాండ తేజుడై రాజరాజ
రత్న మౌళి ప్రభోరు నీరాజితాబ్జ
రాగ చరణుని గోవిందరాజ విభుని
దివ్యమందిర గోపుర దీప్తు లివిగొ! ౧౮

అదియె గోవిందరాజుల యందమైన ;
అద్భుతంబైన రుచిర గేహంబు వదియె !
ఆ యనంతుని శయ్యపై నాదమరచి
వేడ్క శయనించినాడు దేవేర్లుకొలువ ౧౯

శ్రీనివాసుల పెండ్లికి జేసికొన్న
అప్పు రొక్కము ధనదున కందజేయ
వడ్డికాసుల నడ్డతో పరగ గొలిచి
అలసి నిదురించె నడ్డను తలగడమరి ౨౦

అతని సేవించి యటనుండి వితతకీర్తి!
మంతుడౌ మేటి కోదండమాన్యుడైన
రామచంద్రుని మందిరా రామములను
ఎంచి సీతమ్మ విభుని సేవించినాను! ౨౧

అచ్చటచ్చట శ్రీ శురూపాంతరములు
వెలుగు మందిరములను సేవించిభక్తి
మ్రొక్కులను దీర్చియటనుండి మోదమలర
శ్రీగిరీంద్రపు తటమును చేరుకొంటి! ౨౨

(కపిలతీర్థము)

శ్రీమదనవద్యమౌ సొంపు సిరులు గల్గు
కపిల తీర్థ ప్రదేశమ్ము ; ఘనత మీర
కలిని వడగించియిహపరమ్ములనొసంగు
కలిమి చెలువపు భోగభాగ్యాలసీమ! ౨౩

విమల స్వర్గంగభువికి దూకిన విధాన
సంతతోత్తుంగ హరి కరుణాంతరంగ
రంగదుజ్జ్వల తుంగ తరంగిణి యయి
గంగ కపిలేశు తలపైన గంతులాడె ౨౩

అలియర్ధాంగి యను మాట నక్షరాల
సార్థకము చేసికొన్నట్టిసరస సుమతి
కపిల తీర్థేశ్వరుడుగ శ్రీ కంఠుడలరె
పరమ భాగవతోత్తమస్వామి యితడు ౨౪

హరి పదాంభోజ జాతయౌ యమరగంగ
చోద్యమున బేర్మి సజ్జటా జూటమందు
నిల్పుకొన్నట్టి రసికతానల్పసుమతి
భక్తులకితండు మేల్కొంగుబంగరయ్య! ౨౫

అనుచు భక్తిన కపిల తీర్థాహగమున
భవ దురంతపు బంధంబు వాయగ్రంగి
శివ పరాత్పరు మదిలోన జేర్చిమ్రొక్కి
స్వామి! దయగల్గవలె నని సన్నుతించి ౨౬

వెడలి యటనుండి సద్భక్తి మృదుని వీడి
కపిల తీర్థప్రదేశాల విపులమైన
ఒంపుసొంపులనానందమొనరజూచి
శేషశైలపు పరిధులన్ జేరుకొంటి ౨౭

(శ్రీగిరి దర్శనము)

శ్రీ గిరిరాజ మల్లదిగో!

శ్రీహరివాస మదే! యదే! ధరా

శ్రీగిరి మోన్నతస్తనగిరిం

ద్రతటాంతర శాయికైన ల

క్ష్మీగణనీయ సంపదల

చెల్వము గూర్చెడి మెట్టినిల్లుగా
రాగవిలాస భోగమయి
రాజిలుచున్న దిలా వికుంఠమై! ౨౮

అదెరో! చూడరో! శ్రీగిరీంద్రమదె! య
య్యారే! భళా! యయ్యదే
ముద మొప్పారగ వెల్గుచున్నదదిగో!
మోక్షార్థులౌ వారికే
సదసత్సాత్త్విక బుద్ధిమాని పరమో
త్సాహైక సద్భక్తి సం
పదలన్ మున్గెడు భక్తి తత్పరుల ది
వ్యానందధామంబిదే! ౨౯

పదివేల శేషుల పలుమణీ గణ [illegible]
[illegible] పడగల సొగసు[illegible]
సహజ సౌందర్యమ్ము [illegible]
త [illegible]ఘాటికి [illegible]
వైకుంఠ[illegible] జగత్ప్ర[illegible]
[illegible]
అష్టలక్ష్మీ విలాసానంద రూపయౌ
శ్రీరమారమణీ శృంగార శిఖరి
భక్తజన కల్పవృక్షమ్మై వరద [illegible]
కోరి యిల వెల్గు[illegible]
రంగదుత్తుంగ శిఖర సత్సంగ[illegible]
తనరి చెలువారు శ్రీగిరిన్ దా[illegible] ౩౦

ఆవాసంబయి; శయ్యగానమరి, ది
వ్యైకాసనంబయ్యి; యొం

తోవింతౌ వలవాటుగానమరి; ము
ద్దుల్గుల్కు ఛత్రంబునై;
సేవల్ సేయుచు తీరుతీరుహరికిన్
చిత్తానుసారుండునై
భావోదారుడు శేషుడీ నగముగా
భాసిల్లగా గాంచితిన్, ౩౧

అదె శేషాద్రి; యదే ఖగాద్రి; కనగా
నాయంజనాద్రయ్యదే
అదె శ్రీ వేంకట శైలరాజ మదియే
నారాయణాద్రే యదే
అదిగో శ్రీవృషభాద్రి; శ్రీవృషనగం
బా! యయ్యదే; వేదస
ద్విధిగా సప్తగిరీంద్ర మిద్ది యని నే
వేడ్కం గంటి శ్రీశైలమున్, ౩౨

ప్రకృతిశ్రీకిది పుట్టినిల్లు; సొగసుల్
పారాడు కాంతారముల్;
సుకృతంబౌ కపిలాది తీర్థములు శ్రీ
శోభాస్పదంబౌ ఝరుల్;
వికృతా ఘౌఘ వినాశకాంబరనదీ
విన్యాస సౌందర్యముల్;
సుకృతుల్ మెచ్చెటి స్వామి పుష్కరిణి;
హెచ్చున్ మోక్షదంబై, యిటన్ 33

అదిగో! శ్రీగిరి యాదిశేషుని సహస్రా

నేక భోగాస్పదం
బదిగో! సుందర వైభవాస్పదమునై
భాసిల్లు సప్తాద్రి; య
ల్లదిగో! మంజులగోపురప్రమరమౌ
లావణ్య సంపత్తి; య
య్యదిగో! శ్రీహరి దివ్యమందిర మదే
యానందమై దీపిలెన్; ౩౪

ఇలలో జూడగ సాటిలేని గిరి రా
జేంద్రమ్మిదే; దివ్య శో
భలు చిందాడు వరాహదేవుని కృపా
పారా పగల్ సంతతం
బిల భక్తాళి పయిన్ సుధాంశుసమమై
వెల్గొందుచున్ సాగు; వ
త్సలతా మానసయైన శ్రీవకుళకా
శాంత్యోద్యన శ్రీయిదే! ౩౫

కపిల నారద తుంబురు కలుషహారి
శేష గోగర్భములు నాది శ్రేష్ఠమైన
దివ్య తీర్థములిట నెన్నొదీప్తి గాంచ
(1) శేషశైలంబు సాధు సంసేవ్యమయ్యె, ౩౬
సకల తీర్థాల నిలయ మీ శైలవరము;
పరమ సుర ముని యోగుల కిరవు నిద్ది;
ప్రకృతి సంపదలక్ష్మి కావాస సీమ
ఇహ పరశ్రీల నొసగు నియ్యహినగంబు, ౩౭

(1) శ్రీ శరీంద్రమ్ము

చక్కదనముల కిరవైన చొక్కమైన
అదియె చుక్కల కొండ యెత్తైన నగము
అందచందాల నొలికించు వల్లరి యదె
పసిడి కొండదె మోకాళ్ల పర్వతమది, ౩౨

అదియే శ్రీహరి దివ్య సన్నిధి, యవే
యందమ్ముగా గోపురాల్
కదలాడన్ గనువిందులో నెడద, ప్రా
కారంబదే యున్నతం
బది బంగారు విమానగోపుర మదే
స్వర్ణంపు కంబంబు, న
య్యది శ్రీస్వామి సరోవరంబది వరా
హస్వామి శ్రీసన్నిధా, ౩౬

సంతసంబులు మత్సాహ సౌరభములు
భక్తి గీతము లెద బరవళ్ళ ద్రొక్క
స్వామి సందర్శనపులాలసతలు హెచ్చ
ప్రభుపదాబ్జాల నెదలోన ప్రాంజలించి, ౪౦

పూర్వజన్మపు దుష్కృతపుంజములను
ఐహికపు జన్మమున జేయు నఘవితతిని
పార ద్రోలెడి భక్తుల పాలవెల్లి
పాపనాశని గంగాభవాని యదియె, ౪౪

అనుచు మదిలోన స్వామిని మననజేసి
పాపనాశని గంగమ ప్రస్తుతించి
తెలిసి తెలియక జేసిన కలియడంగ
క్రుంకులిడి మ్రొక్కియటనుండి కూర్మినెడలి; ౪౮

సాధు సద్భక్త తాపోపహారి యగు

రంగదుత్తుంగ కరుణాంతరంగిణీ యది
కలిమలధ్వంసియైన నాకాశ గంగ;
ఇంక తాపము లందునే గ్రుంకులిడితి ౪౩

అర్థిజనులకుద్విజాలకు నర్ఘ్యవిధుల
దక్షిణలతోడ నెరవేర్చి తగనతించి
వెడలియుటనుండి భక్తితో విభునుతించి
స్వామి శ్రీపుష్కరిణిలోన స్నానమాడి; ౪౪

శేషగిరి ప్రాంత సీమల శ్రేణికెల్ల
రక్షకుడు నేత యాదివరాహవిభుడు
ఇతని దర్శించి తదుపరి శ్రీనివాసు
దర్శనము జేయవలెను, ద్రుంధర్మవిదులు ౪౫

ఆ విధిన్గని యాదివరాహ విభుని
నెంచి సేవించి భక్తినర్పించి మిగుల
''ధరణి నేలిన తీరు నీదానునేలు''
మనుచు నతిజేసియుటనుండి మరలినాను; ౪౬

తత దీవ్యద్సువిశాల పక్ష పవనో
ద్భూరాతిమేఘోచ్చల
ద్వితతోత్తాల కులాచలప్రకరదు
ర్భేలాతిరావోగ్ర సం
తత శుంభన్మఖరీ కృతోత్సకలది
గ్దంతీంద్ర భీతింకరా
తత సత్వాండ జరాజ్ఞ సద్ధ్వజఘన
స్తంభంబు దర్శించితిన్; ౪౭

బమ్మమూారుతమున లేచి స్వామి పుష్క -

రిణిన స్నానాది విధి నొనరించి భక్తి
దనర శ్రీవిశ్వరూప సందర్శనముకు
విభునిస్తుతి జేసికొనుచునే వెడలినాను ౪౮

పరమ పూజ్యులు సాధుప్రపన్నులైన
జియ్యరార్యులు వైష్ణవుల్ శ్రీశు గాంచ
స్వామి మేల్కొల్పుబాడుచు సాగుచుండ
నేగితిని వారితో శ్రీశు నెదుగొలుచుచు ౪౯

నిగమ వైభవ తనురమ్యఖగతురంగ
స్వర్ణమయ దీవ్యదున్నత స్తంభమునకు
పాపవిషధరతతికూల ప్రాంజలించి
భక్తజనపంక్తి సాగి శ్రీవారి గంటి; ౫౦

త్రిభువన పావనదీప్తి మద్దివిజగం
గాహా జనకంబు లేపదములు
వేదసు స్వరముల విధులతో బ్రహ్మన్న
యెద నమ్మికడిగిన వేపదములు
కరిరాజు మొరవిని కడువేగపరుగిడి
యాపదన్ బాపిన వేపదములు
వైకుంఠమును వీడి భక్తులనిటగావ
పేర్మిన వెలసిన వేపదముల
ధరణి భక్తులకివియోగా శరణమనుచు
పేర్మి జూపింపబడుచున్న వేపదములు
ఆ పదమ్ములు నాపదల్ బాపజేయు
ననుచు శ్రీస్వామి పదములన్ ఘనత గంటి ౫౧

పరమశేషాద్రి దివ్యదాభరణమైన
ఇహపరశ్రీని భక్తులకెంచినిడెడు
భవజలధి నావ యేదివ్యపాదయుగళి
అదియె శ్రీదేవి ముద్దుల చరణయుగళి; ౫౨

అనుచు మదిలోన దలపోసి వినుతిజేసి
తరుణి పద్మావతీదేవి కరకమలపు
రాగరంజిత సౌందర్యరాశియగుచు
దనరు శ్రీవారి పద పద్మయుగళి గొలిచి ౫౩

అతివ పద్మావతమ్మరహస్యవేళ
అర్మిలిన ముద్దులాడెడి యడుగుదమ్మి
లివెయె కాబోలు; భక్తుల భవతరణపు
నావలివియని సేవించినాను పేర్మి ౫౪

రాజదేవేంద్రదిగ్రాజిత సురముఖ్య
రత్నమౌళి ప్రభారంజితములు
మాన్యభూపాల సామ్రాణ్ణత మణిమౌళి
కాంతి నీరాజనాక్రాంతతములు
పరమ యోగి మునీంద్ర భవ్య ఋషీశ్వర
మానస పద్మ సమర్చితములు

విబుధ ప్రకాండ సద్వినుత శ్రీయతి రాజ
ముఖ్య ప్రపన్న సంపూజితములు
ఫణి ఫణా నేక మణి గణ భాసురములు
దురిత భవభయరోగ సంహరణగతులు

మా శ్రియః పతి పదములు మమ్మునేలు
ననుచు సేవించి సద్భక్తి నాత్మ గంటి; ౫౫

దుర్మదోద్వేలదనుజుల దునుమనెంచి
దుముకు మాస్వామి జంఘాబలమును గంటి
ప్రియ సతుల్ కొల్వుదీర్చెడి పీఠములయి
వెలుగు శ్రీవారి సక్థులన్ వేడ్కగంటి, ౫౬

దుడుకు సింగపు నడుమునెన్నడుముగంటి
భువనములకెల్ల విశ్రాంతి భూమియైన
కూర్మి బొజ్జను గంటి శ్రీకునికియైన
కౌస్తుభోరస్థలంబును గాంచగంటి ౫౭

శంఖ చక్రమ్ములలరు భాస్వన్మనోజ్ఞ
దీర్ఘభుజముల; శరణ మిదేయటంచు
పదములను జూపు శ్రీహస్త పద్మములను
మోముపై నూర్ధ్వపుండ్రము మురియ గంటి; ౫౮

అనఘ జన రక్షకంబులౌ నిన శశాంక
నయన పద్మాల శోభల నంటి పారు
సజ్జనా వన వాత్సల్య సరితలెల్ల
నన్ను జేరిన యట్లు నేనాత్మ గంటి; ౫౯

లలితకుటిలాలకల సొరు లలరు ఫాల-
మష్టమీ చంద్రమా దీప్తి మానితంబు;
పచ్చకర్పూర కస్తూరి వాసితోర్ధ్వ-
పుండ్ర సౌభాగ్యమును భక్తిభూని గంటి ౬౦

మహితనవరత్న ఖచితహేమాఢ్యమౌళి
చారు కాంతిచ్ఛటల్ దెసల్ వెగివెలుగ
శిరముపై గుల్కు తీవిగా జెలువమలర
విభుని శ్రీ శ్రీనివాసుని వేడ్కగంటి; ౬౧

సౌషధ నూతన శంపాలతాశ్రయ
ఘన నీలనీరదాకారమలర
ఇంద్ర నీలాద్రిపై హేమాద్రినడయాడు-
తీరు స్వర్ణకిరీట దీప్తులలర
అంజనగిరికిరువైపుల ప్రవహించు
అమర గంగై వలవాటు మురియ
చూడ జీకటి కొండజాట్టిన కనకాద్రి
పగిది బంగరు వల్వజిగి వెలుంగ
ముగ్ధమోహన సౌందర్యమూర్తి యగుచు
చీనిచీనాం బరమ్ములఁ జెలగు వాని
పరమ భక్తాళి కే దయాభరణం డైన
వరదుడౌ శ్రీనివాసుని భక్తి గంటి; ౬౨

ఇంద్ర నీలప్రభాసాంద్రమౌ రేరాజు
శ్రీగిరి శిఖరాన జేరెనగ
నీలి కల్వలరాజు నేలకు దిగివచ్చి
అద్రిపై నిట నడయాడె ననగ
ముద్దుల మురిపాల ముత్యాల జాబిల్లి
ముంగిట సయ్యాడి మురిసెననగ
రతనాలరవ్వలరంగైన నెలరేడు

దివినుండి భువికి తాదిగియెననగ
భువన మోహన సౌందర్య పుంజమేమొ
తాల్మినిచ్చట నర్చావతారమగుచు
శ్రీనివాసుల రూపునన్ జెలగెననుచు
స్వామి నెదనెంచి కొలిచి సాష్టాంగపడితి ౬౩

చల్లని తండ్రి, చూపుల ప
సందుల గుల్కెడి నల్లనయ్య, కో
కొల్లలుగాగ కూరుములు
కూడిన మేల్మెనరున్న మంచి దొ
నుల్లమునున్నవాడు కడు;
నోర్మిన నమ్మిన వారి నందరిన్
కల్లలుగాని పేరిమిన
గాచెడి కొండలరాయ డీతడే! ౬౪

పడతి సిరిలచ్చి దొరసాని యెడదతమ్మి
బాయ జాలనియల తేటిరాయడితడె
తనను నెఱనమ్మి కొలిచెడి దాసదాస
జనులపాలిటి వేల్పుల సాకుటావు ౬౫

తెలిసి తెలియక జేసిన కలితనంపు
తప్పు మన్నింపుమని వేడు దాసజనుల
గన్న బిడ్డల తీరున కనికరించి
క్షేమ మొనగూర్చువాడు దయామయుండు ౬౬

ఇతడటే త్రిభువన వితతవిఖ్యాతుడు
సృష్టి సంస్థితి లయోత్సీలసుమతి

ఈ స్వామి కౌసల్య కెనలేని దశరథ
ఘనునకౌ జన్నంపు కడుపుపంట
ఇతడె శ్రీ దేవకీ సతికి శ్రీ వసుదేవ
విభునకౌ సుకృతంపు విభవఫలము
ఇతగాడు వ్రజగోపపతి నందునకు యశో
దకును గారాల ముత్యాలపంట
తనర నీతడు వకుళమ్మతల్లి పేర్మి
గడిది కనిపెంచుకొన్నట్టి కండ్లపంట
భక్తసుజనుల యమృతంపు పాలవెల్లి
మన్మనోలక్ష్మిపతి యని మదిని గంటి ౬౭

వసుమతీలోకమున నుతభారతమున
భక్తతతినేలవైకుంఠ పదమువీడి
శేషగిరి మందిరమ్మున జేరి నిలిచి
కొలివు దీర్చిన శ్రీనివాసులను గంటి; ౬౮

అమ్మ లక్ష్మమ్మ నెద కౌస్తుభమ్మునందు
జెలిమి నిలిపిన శృంగార శ్రీనివాసు
డితడు నితడేనటంచు నే కుతుకమంది
ఎంత రసికుడు వీడని యెంచి గంటి; ౬౯

ఆర్తజనులకు నభయప్రదాయియగుచు
ధూర్తజనులకు దుర్భయదుండునగుచు
దారుణోత్కలి మకరసుదర్శనుడుగ
శత్రుహృద్భేద్యనిస్వనశంఖు డితడె ౭౦
భవవిషోరగ హరఖగోధ్వజుడునచు

కలుషితాజ్ఞానతిమిరభాస్కరుడటంచు
భక్తచింతామణీంద్రమై బరగెననుచు
పతిని వేంకటపతిని శ్రీపతిని గంటి 20

శ్రితజన పారిజాత గుణ
శీలుడు; నార్తజనావనుండు; సం
తతము తపించుభక్తజన
తాపము నార్పెడు చందమామ, స
మ్మతిగని తన్నుగూర్చి తప
మందెడు యోగిజనాల చిత్త సం
స్థితి గలస్వామి; యంచు మది
జేరిచిమ్రొక్కితి శ్రీనివాసునిన్ 21

కలియుగ మందు సజ్జనుల
గావగ విస్మయ దివ్యమూర్తివై
వెలసితివయ్య! శ్రీగిరిన
వేల్పులు గొల్వగ ; భక్తసంతతుల్
పిలిచిన బల్కుదైవమయి
వెల్గిన దీనజనావనుండ! నిన్
దలచిన వారి కష్టములు
తప్పు నటంచు మతించి మ్రొక్కితిన్ 23

కలియుగ దైవ మీవనుచు;
కల్మష సంహతినాడ్తువంచు; ని
య్యిలను ప్రసిద్ధి గంటివని
యెంతయొ సత్యమటంచునమ్మినీ
నళిన పద ద్వయంబు నెద

నర్మిలి నిల్పి మదింగలట్టి నా
కలికుల పంకమున్ దుడుచు
కాంతుడ! నిన్ గడుపేర్మి వేడితిన్ ౭౪

ఇలగల దుర్విదగ్ధ కుహ
నేధిత దుర్మత దూష్య దౌష్ట్యదు
ష్టలకుల కిల్బిషంబులను
సాగిలి నిన్ దరిసించి నంతనే
తొలగగజేసి దుర్భరపు
దుఃఖము భాపి భవత్పదంబులన్
కొలువుడు ముక్తి గాంచుడని
కూర్మిన దెల్పెడి తండ్రి వీవెగా ! ౭౫

నళిన దళాయతాక్ష! కరు
ణారస పూర్ణ మనోజ్ఞమానసా !
కలుములరాణి కూరుముల
కమ్మని మానస రాజహంసమా!
కలియుగ దైవరాయ కృప
గల్గగ నాపయి చల్ల చూపులన్
జిలుకవె తండ్రి! నాపయిన ;
చేరినుతించి నతించి వేడితిన్, ౭౬

త్రిభువనామర సౌందర్య దీప్తులన్ని
ఒక్కరూపౌచు నిచ్చటే యొదిగి యొదగి
చూచువారల హృదయాల దోచుకొనుచు
వశము గావించు మోహన స్వామివనుచు ; ౭౭

నిన్ను నమ్మితి జేరితి నీకే మదిని
ఇచ్చుకున్నాను; పెరవారినెప్పు డైన
మదిని దలపోయి నినుదప్ప; మాన్యచరిత !
నీ పదశ్రీల నాత్మలో నిల్పుకుంటి; ౭౮

దారణోద్ధృత మీషణత్రయము గల్గి
కష్ట సుఖముల సుళ్ల చే గలియబడుచు
షడ్రిపోత్తుంగ లహరీ విషాహులెసగు
భవమహోదధి దాటించు స్వామి! నన్ను ౭౯

అనుచు మదిలోన నార్తితో నటమటించి
నిన్ను జేరితి శరణంటి నీలవర్ణ
కరుణ నెదగల్గి దాసుని గనికరించి
స్వామి! యీ దీనునేలు నిన్ ప్రాంజలింతు, ౮౦

స్వామి! యీతీరు మిమ్మునే స్వాంతమందు
భక్తి దలపోసి సాష్టాంగపడితిననుచు
విన్నవించుచు హరిని సేవించుచుండ
అర్చకులు తీర్థమిది గొను డనిన యంత ౮౧

స్వామి శ్రీపాద తీర్థ ప్రసాదములను
భక్తి గొని పేర్మినుతియించి ప్రాంజలించి
తొలగుడని కింకరుల్ వేగ దొలగజేయ
వెనుదిరిగి తిర్గిచూచుచు వీడుకొంటి, ౮౨

జగతి శేషావతారులాచార్యవరులు
ఘనులు యతిరాజుల భాష్యకారగురుల;
స్వామి వేంకటపతికి నాచార్యులగుచు
ఇచటె వేంచేసిరనుచు సేవించుకుంటి, ౮౩

పరమ యోగీశ్వరేశ్వరుండురు కృపాబ్ధి;
యోగ సంవర్ధితానంద యోగివరుడు
శ్రీ నృసింహుడు నిచటె వేంచేసెననుచు
పేర్మి నరసింహ విభుని సేవించుకొంటి, ౧౪

సకల యోగుల హృదయ సంచారుడైన
శరణనుచు చేరుకొన్నట్టి పరమ భక్తి
పరుల పాలిటి యజ్ఞంపు పురుషుడైన
వరదరాజుల సేవించి భక్తి గొలిచి ౧౫

మాన్యతమమైన దివ్య విమాన సీమ
సాగి శ్రీ బృహద్ద్వార దేశంబునందు
ఇరుగడల వెల్గు దేవేర్ల నెమ్మిగొలువ
తెలుగు విభుడగు కృష్ణరాయలను గంటి, ౧౬

అటనటంగల శ్రీవారి వైభవంపు
నునికి పట్టై నరూపాల నోర్మిమీర
కనుల పండువగావించుకొనుచు సాగి
వినుతమౌస్వామి సన్నిధిన్ వీడుకొంటి, ౧౭

మదిలో శ్రీశు స్వరూప సంపదల సం
భావించి చింతించుచున్
ముదముల్ ముప్పురి వేయ భక్తిగనుచున్
పూజించి; మంగాపురిన్
కదలన్ శ్రీయలమేలు మంగ పద స
త్కంజాతముల్ నా యెదన్;
విధిగా వెళ్లితి; స్వామి శ్రీసతిని సే
వింపంగ నే నర్మిలిన్, ౧౮

వినుతంబౌ కలినాశకంబయినదే
    పీపుష్కరిణ్యంబులన్
మనసే శాంతిలివట్లు క్రుంకులిడి దు
    ర్మాలిన్యమింకన్ శుచిత్వం
బును నభ్యంతర బాహ్యమందనుభవం
    బొందన్; మహోత్సాహినై
కనువిందై వెలుగొందు శ్రీకిరవునా
    గారంబునే జేరితిన్, ౧౯

ఘన దంతి ధ్వజ హేమకాంతిలలితా
    ఖండంపు స్తంభంబు నే
ననవద్యంబగు భక్తితో వినతితో
    నర్చించి యాపైన మా
తను పద్మావతి నంఘ్రు దమ్ములను స
    ద్భక్తిన్ దగంగంటి; యు
ర్చనలన్ జేసి త్రినేత్ర సత్పలముదా
    రంబొప్ప నర్పించితిన్, ౨౦

పరమ పురుషోత్తముడునైన దురితహరుని
విశ్వకల్యాణకారుని వినుతగుణుని
ఇహపరంబును భక్తులకిచ్చి బ్రోచు
భోగ శ్రీ శ్రీనివాసుని మురిసి కంటి, ౨౧

భువనములనెల్ల మోహాబ్ధిముంపజేయు
వల్లవీ ముగ్ధ హృదయాలు పల్లవింప
వేణుగానము జేసిన వేదవేద్యు
వేణుగోపాలదేవుని వేడ్కగంటి, ౨౨

గోపకాంతల యజ్ఞానకాపథంపు
వలువ లూడిచి జ్ఞాన భావంబు గూర్చి
ఏలుకొన్నట్టి వేణుగోపాల విభుని
భక్తిమీరగ గంటి నే ప్రస్తుతించి, ౬౩

అచట గల దివ్యదర్చావతారములను
దేవదేవుల నర్చించి భావమలర
భక్తిసేవించి శ్రీవైష్ణవార్చకులకు
తగువిధంబున దక్షణల్ తాల్మినొసగి; ౬౪

వారి కర్మిలి సాష్టాంగ ప్రణతిజేసి
దీవెనల బొంది తిరిగి యాదేవదేవి
దివ్య సారూప్య సౌందర్యదీప్తులలరు
తల్లియలమేలుమంగను దాల్మి గంటి, ౬౫

తల్లి కొడుకుల సంబంధ మల్లినట్లు
అమ్మ పదపల్లవములకు ప్రాంజలించి
కల్లలెరుగని భక్తితో కలతలడగ
నెంచి మాయమ్మనిట్లు స్తుతించినాను. ౬౬

పద్మవనవాసినీ! సదా పద్మవిభవ!
పద్మ సౌందర్య పరిపూర్ణభద్రనయన!
పద్మసంపద్వినోదినీ! పద్మవదన!
పద్మనాభాంఘ్రి పద్మసంపన్నివాసి! ౬౭

కువలయోత్కృష్టమలోన్నతకుచవలాంగి!
కువలయేశ్వర సోదరి! కువలయాక్షి!
కువలయాధీశ కేశవు కూర్మిరాణి!
కువలయామోద సుందరి కొలుతునమ్మ; ౬౮

చల్లని తల్లి! నిన్ను మన
　　సారగ నమ్మి నుతించు భక్తులన్
కల్లలులేని సత్కృపల
　　గాచెడి యుల్లములున్న తల్లివై
ఉల్లసమొంది భక్తులకు
　　శోభలగూర్చెడి కల్పవల్లి! శ్రీ
వల్లి! నతించియర్మిలి కృ
　　పామృతవల్లి ! నుతింతు భక్తినన్ ౯౯

ంశ్రీశు వక్షస్థలాన వేంచేసియున్న
ఘన మనోహర శ్రీవత్సకౌస్తుభమున
కొలువు దీరించి భక్తుల కోర్కెదీర్ప
వెలసి తీవని శ్రీలక్ష్మి ! వినుతి జేతు ౨౦౦
శ్రీనివాసుల హృదయమ్ము చెక్కుపెరుగు
నీదు హృదయమ్ము నవనవనీతయమ్మ !
పురుషకారిణివై మమ్ముబ్రోవుమనుచు
పరగనెఱిగింపవమ్మ! నీపతికి బేర్మి ౧౦౧

-: శ్రీశుభంభవతు :-

-: శ్రీః :-

ఇయ్యది
శ్రీ శ్రీనివాస దివ్య కళా వైభవంబను
ప్రబంధంబున క్షేత్రదర్శనాది వర్ణనంబు
లతో ద్వితీయ సర్గము శ్రీ శ్రీనివాస
దివ్యపాదారవిందములో
సమర్పితంబై ముగిసినది :

శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీలక్ష్మీ వైభవమ్ తృతీయ సర్గము

## (౫) శ్రీలక్ష్మీస్తుతిః (సంస్కృతము)

శ్రియా లాలితాంగీం లసత్సద్గుణాంగీం
కృపాపూర్ణరమ్యాబ్జ పత్రాయతాక్షీం
సితాబ్జైక వాసాం హరి స్వాంతబాసాం
సదానంద లక్ష్మీం భజే హంభజే హమ్ ౧

చి దానంద దీపాం శ్రితానందరూపాం
స్వభూపీవరోరస్థళావాసరమ్యాం
కళా పూర్ణ భద్రాం దయోదారముద్రాం
సదానౌమ్యహం శుద్ధ లక్ష్మీం మదంబామ్ ౨

సదా పద్మవాసాం సదా పద్మహస్తాం
సదా సత్కృపా పూర్ణ హృతపద్మభాసాం
ల సత్పద్మవర్ణాంల సత్పద్మనేత్రాం
భ జామ్యంతరంగే చ లక్ష్మీం మదం బామ్ 3

శరచ్చంద్ర మా స్యాంశరద్యోత్నహాసాం
శరద్గాంగికా ఫేన హృద్భావముగ్దాం
గజ శ్రీవినోదాం గరీయార్ద్రమోదాం
భతామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ४

మహద్దివ్యమాయాం మహద్భక్తి సేవ్యాం

జ్వలన్నవ్యదివ్యాబ్జ హస్తైర్మనోజ్ఞాం
జగచ్ఛ్రీనివాసాం జయశ్రీ సమేతాం
సదానౌమ్యహంమోక్ష లక్ష్మీం మదంబామ్ ౬

సతీం శుద్ధ లక్ష్మీం సమస్తార్థ లక్ష్మీం
మహాద్భాగ్య సౌందర్య కృద్ధాన్య లక్ష్మీం
మహద్రాజ్య లక్ష్మీం మహద్ధ్యాన లక్ష్మీం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౭

లసద్రమ్య భావాం లసన్ముగ్ధ హాసాం
లసత్కుంతలాలోల రాజీవనేత్రాం
లస ద్రత్నభూషాం లసన్మందహాసాం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౮

దయా దృక్తరంగాం దయా పూర్ణ చిత్తాం
దయాభావ సంపూర్ణదాక్షిణ్య రూపాం
దయా వాక్ప్రగల్భాం దయా మోఘచేష్టాం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౯

జగద్భక్తవేద్యాం జగచ్ఛ్రీ విశేషాం
జగద్భోగ భాగ్యప్రదోదార శీలాం
జగన్మోహనాంగీం జగన్నాథ దేవీం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౧౦

మహద్బుద్ధి సిద్ధిప్రదాం సర్వ శక్తిం
లసన్ముక్తి భుక్తి ప్రదాభ్యం తరంగాం
శ్రితా నన్యవాత్సల్య దీపాంప్రసన్నాం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౧౧
పరబ్రహ్మరూపాం పరాశక్తి దీపాం

పర(ప్రౌఢ దోర్వీర్య భగ్నంకరాభాం
పరాతత్వరూపాం పరంధామ వాసాం
భజామ్యంత రంగేచ లక్ష్మీం మదంబామ్ ౧౨

తపశ్శక్తి వేద్యాం తపోలోకవాసాం
తపశ్శాలిభిస్సన్నుతాబ్జాంఘ్రియుగ్మాం
తపోభిస్సుసాధ్యాం తపస్సాధుపూజ్యాం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౧౩

(శ్రియం వేద వేద్యాం జగత్సేవితాంఘ్రీం
లసత్పద్మసింహాసన స్థాం(ప్రశస్తాం
సతీం విష్ణుపత్నీం సముద్రైకపుత్రీం
భజామ్యంతరంగేచ లక్ష్మీం మదంబామ్ ౧౪

అఘానంత హారీమమోఘార్థదాయీం,
సదా భక్త భక్త్యార్చితాంఘ్రిద్వయాబ్జాం
ప్రపన్నానుకూలాం ప్రశ స్తా ప్త పాలాం
భజామ్యం తరంగేచ లక్ష్మీం మంబామ్ ౧౫

నటల్లోచనాబ్జాం నటత్కుంతలా స్యాం
నటన్మంజు మాధుర్య వాత్సల్య బావాం
నట భ్రమ్యతన్వీం నటన్మందహాసాం
భజామ్యంతగేచ లక్ష్మీం మదంబామ్ ౧౬

రమాం బాసురాంగీంజగత్సన్నుతాంగీం
సదా భక్త హృత్పద్మసంభావితాంఘ్రీం
నుతాం శ్రీనివాసాఖ్య దాసేన భక్త్యా
స్తుతామీందిరా మంతరంగే మదంబామ్ ౧౭

లసచ్చి కురలోలుభాంలలితపూర్ణ చంద్రాననాం
శరద్విమల శుక్ల సత్ప్రతిప దేందుమందస్మితాం
తటిద్రుచిరలాతో త్కనకవర్ణదేహ ప్రభాం
నవాబ్జ కర పల్లవాం నౌమివిష్ణువక్షస్థితామ్ ౧౮

కృపా లలిత లోచనాం శ్రితజనావనీంమాతరం
హరేర్మధురమానసే సతతచారిణీం హంసినీం
శ్రితార్తి హరణే రతాం త్రిజగదాధిరాజ్ఞీంరమాం
జగత్సుజన సేవింతాం నౌమి దేవదేవీం శ్రియమ్ ౧౯

త్వదీయ పదపంకజే
శరణమాగతం వీక్ష మాం
కురుప్రచుర వత్సలో
న్నిభృత చిత్తవృత్తింమయి
ప్రసార్య కరుణామృతం
సుతమనీష యా పాహి మాం
నమామి హరివల్లభే!
జనని! సత్కృపా ర్ద్రేక్షణే! ౨౦

లలిత సుస్మిత పల్లవాధర లాలితాననపంకజే!
కలమనోహర కోకిలాస్వరగాన వైభవలాలితే!
లులిత నీల క చాళి పూర్ణ నవాష్టమీందు ముఖోజ్జ్వలే!
ఫలమనోరథదాయి! సంశ్రిత సన్నుతే! సతి! నౌమ్యహమ్ ౨౧

ఇమాం శ్రీశ లక్ష్మీస్తుతిం వైభవాఖ్యం
పఠంత్యంతరంగే చ యే సత్ప్రపన్నాః
సుఖం యాన్తి తే సర్వసౌభాగ్యసిద్ధిం
మనోజాద్యరోగాపహం కామితార్థమ్

-: ఇతిశమ్ :-






శ్రీః

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీలక్ష్మ్యైనమః - శ్రీశ్రీనివాసాయనమః - శ్రీసరస్వత్యైనమః

## (౫) శ్రీ లక్ష్మీ వైభవము (ఆంధ్రము) తృతీయ సర్గము

శ్రీ గిరీశ్వరి! మంగాపురీమతల్లి!
శ్రీలు గల తల్లి! నతి జేతు పాలకడలి
కనక శౌక్తిక మయమైన కడుపునిండ
కన్నబంగారు పంట! మా కలిమివంట
రాజ లితివంట; ఆకాశరాయనింట, ౧

శ్రితుల సద్భక్త సుజనులగుతుక మలర
మాతృహృదయమ్ములమృతమై మమతబెంచ
కన్నమాయమ్మవంట మా కలిమిపంట
పురుషకారిణివై శ్రితున్ బ్రోతువంట, ౨

చొక్కపుమేల్బంగారపు
చక్కని జిగిగల్గి మేటి సొరు లెసంగన్
నిక్కపు సిరులకు నెలవై
మక్కువ వెలుగొందు నిన్ను మాతా! తలతున్ 3

తేజముల నోజముల బెంచి రాజ రాజ
సముల నొనరింతువంట నీ చరణ కమల
శ్రీల నెఱ నమ్మి నిన్ గొల్చు సేవకులను;
చల్లనౌ మేటి యెద పాలవెల్లి వీవు! ౪

విన్నిద నమ్మికొల్పు గుణ
నిర్మల చిత్తుల లేమి బాపి పెం
పన్నిట గూర్చి యోజమును
బాయనితేజము గూర్చి మేటిసం
పన్నుల జేతువంట కడు
పారగ బెట్టెడి కన్నతల్లి(గా)వై
మన్నన జేసిపెంతువట
మంగళ దాయిని! తల్లి! మ్రొక్కెదన్, ౬

రమ్య కరుణార్ద్రహృదయ! హిరణ్యవర్ణ
కనక రజతాభసుమదామఘనమనోజ్ఞ!
ఇందు సోదరి! స్మిత చారుకుందరదన!
జ్ఞాన వినుతాంగి! హరివల్లభా! నతింతు ౭

కరుణ గలట్టి మానసము
గల్గిన తల్లివి; నీ పదంబులన్
స్థిరముగ నాత్మ నిల్పుకొని
సేవలొనర్చు త్వదీయ భక్తులన్
సిరులను పుత్ర పౌత్రుల వి
శేష సుఖంబుల గూర్చి సర్వధా
పరమ దయాంబురాశివయి
పాలన జేతువటమ్మ ! శ్రీసతీ ౮

పుట్టినయిల్లు రత్నపరి
పూర్ణ మనోజ్ఞసుధాంబురాశి; నీ
మెట్టినయిల్లు శాశ్వతపు
మేల్సిరి గూర్చు వికుంఠసీమ; చే
పట్టినవాడు విన్నిదన

బాయకనిల్పిన వేంకటేశ్వరుం
డిట్టి విశిష్ట భాగ్యములు
తీరులు నీ వెకదమ్మ! మా సతీ! ౯

వితత రథాశ్వహస్తి విభ
వేధిత రాజ్య మనోజ్ఞ లక్ష్మి! సం
తతము విశిష్టధాన్యముల
దాల్మిన నిచ్చెడు ధాన్యలక్ష్మి! కీ-
ర్తితమగు సాధువిద్యనిడి
దీపిలు విద్యలలక్ష్మిరాగరా
జిత సుగుణాఢ్య సంతతిని
చెల్మిన గూర్చు తనూజలక్ష్మి! స- ౧౦

న్నుత మగు సాహసైకసుగు
ణోన్నత ధైర్యవిశేషలక్ష్మి శో;
భిత బలదర్పశౌర్య గుణ వీ
రతవెల్గెడు ధీరలక్ష్మి ! ఆ
తతమగు పాడి పంటల ను
దారతనిచ్చెడి ధేను లక్ష్మి! నీ
వతులితమైన సర్వవిభ
వాశ్రయ రూపవిశేషలక్ష్మి వం ౧౧

చితకరుణార్ద్రచిత్తవని
శార్ఙ్గికి దీనుల జాలి వేదనన్
సతము నెఱుంగ జేసి విభు
సన్నిధి జేర్చెడి తల్లి వంచు నిన్
కుతుకము మీర నీ చరణ
కోమల పద్మములెన్ని యాత్మలో
మతిమతులెల్ల గొల్చెదరు;
మా జననీ! నిను నిల్పితిన్ మదిన్; ౧౨

నమ్మిన భక్త సంతతి వ
నారత మార్ద్రదయాంతరంగవై
నెమ్మిన చల్ల చల్లనగు
నిర్మల రాగరసా మృతేక్షణన్
సమ్మతి జూపి నీ పతికి
జక్కగ దెల్పుచు గావజేతువం
చమ్మరొ! తెల్పవింటి తమ
సన్నిధి భక్తులు; నిన్ను గొల్చితిన్, ౧౩

నీ కరుణాకటాక్షముల
నీడలు నింతగ సోకకున్న నా
నాకము లేదు; దిక్పతుల
నర్తన లేదు; అజామరేంద్ర వి
శ్వైక విభుప్రపంచములు
చాలుచు నిల్వగ లేవు తల్లి! నీ
శ్రీకమనీయ పాదముల
జేరితి; నన్ గరుణింపు చల్లగన్; ౧౪

జనకుడు క్షీరసాగరుడు;
చారునదీప్రకృతీందిరమ్మయే
జనని; సహోదరుండనగ
చంద్రుడు; కల్పక పారిజాత చం
దన సుర ధేను సన్మణులు
దారులునౌ ననుజన్ములంట; వా
హనమట వైనతేయుడు; మ
హద్వర పద్మనిధుల్ త్వదీయముల్; ౧౫

అనితర సర్వసంపదల
కాశ్రేయ వట్ల వనైకచారముల్;
అనుపమ లప్సరాంగనలు
నాసురభామలు విష్ణ సత్సఖీ
జనములు; దేవ జాతులు ప్ర
శస్తులు భృత్యులు; నిత్యసూరులే
ఘన పరిచారకుల్; పటును
ఖంకరవైభవ మందు పెత్తనం ౧౬

బరయ పరైక ధామమగు
భాసుర దివ్య వికుంఠమందిరం
బురు రమణీయమౌ గృహము;
పూర్ణ కళా కమనీయమూర్తి శ్రీ
హరి ప్రియమైన భర్త; వర
హంస విహారుడు; దర్పకుండు సుం;
దరసుతులొప్ప; గన్గొనగ
ధారుణి భాగ్య మటన్న నీదటే! ౧౭

స్వామిని! త్పావకీనమగు
వత్సలతా గుణ తత్వ సంపదల్
ఆ మహనీయులౌ హరిహ
రాజుల కాసురనాయ కాళి కిం
తేమతిమంతు కైనను గ-
ణింప నెఱుంగగ రావటమ్మ! త
ల్లీ! మహిమాఢ్య! నన్ను గన
లేవటె! రిక్తుడ బ్రోవరావటే? ౧౮

అమ్మలకెల్ల నమ్మవయి
యాది మహా జగదేకలక్ష్మివై
ఇమ్మహిలోన మాతలకు.
నెన్నగ మూలపుటమ్మవై జగ
త్ప్రమ్మత మూర్తివై కృపలు సాగగ
బ్రోతువటమ్మ! మమ్మ; నిన్
నమ్మిన వారికింతయున-
నష్టము లేదు గదమ్మ! శ్రీసతీ! ౧౯

శేషశైలా ధి నాయక శ్రీనివాసి!
సమ్మతోన్నత సద్వక్షస్స్వినివాసి!
రాజ్ఞి ! అలమేలుమంగాపురాధివాసి
ఆశ్రితుడనమ్మ! బ్రోవు కృపాంబురాశి! ౨౦

అమ్మ! మాయమ్మ! మామంచి బంగరమ్మ!
విశ్వమునకెల్ల దండ్రియా వేంకటపతి
కింత నెఱిగించి నన్ను రక్షింప జేయ
పురుషకారంబు సేయమ్మ! మ్రొక్కుదమ్మ! ౨౧

పతికి నేకాంత సేవలో పలుకు మధువు
లొలుకు శృంగారసూక్తులు పలుకు వేళ
మనసు గికురించు నిన్ బ్రతిమాలు వేళ
నను నెఱింగించి కాపాడ మనవె తల్లి! ౨౨

విశ్వపతి శ్రీనివాసుని విమల హృదయ
పద్మ సంవాసినీ! సత్కృపాబ్జ నయన!
సుస్మితానంద సౌందర్య శోభితాంగి!
పతికి నెఱిగింపు నాదైన భావములను, ౨౩

అష్టలక్ష్మి స్వరూపిణి వమ్మ! నీవు
అష్టసిద్ధుల కధిపతివమ్మ! నీవె
నవవిధి శ్రీలు వెలువారు భవనమందు
శ్రీనివాసుల గూడి రాజిల్లు దీవు! ౨౪

కాకదుర్దైత్యమతి భవత్కారుణ గోరి
శరణ మనినంత తల్లివై చల్లనైన
కృపల రక్షింపలేదె? నిన్నెపుడునైన
మరువకుండగ శరణంటి మాత! గనవె! ౨౫

భక్తి శ్రద్ధాసమన్వయ భక్తవరుల
కొంగు బంగార మీవని కూర్మి మీర
నమ్మి గొలిచెడి వాడెందువమ్ము గాడు
అమ్మవని నిన్ను జేరితి నమ్మ! గనవె, ౨౬

తల్లీ! నిన్నెదనమ్మి భక్తిగని చే
తంబందు నీవైన సం
పుల్లాబ్జాంఘ్రుల గొల్చుచుందునవిశం
బున్ శ్రద్ధగా; నీవు నా
యుల్లంబందు వసించి నత్పుంతలే
న్మ్యానంబుగాకుండ శో
భిల్లన్; నన్ గృపవేలుకో గదవె; నీ
బిడ్డన్ గదే శ్రీ పతీ! ౨౭

కడలి ముద్దుల కూర్మి బంగారు బిడ్డ!
పొగను కరివేల్పు రాయని సుందరాంగి!
మిన్నగా నమ్మువారల కన్నతల్లి!
నన్ను గరుణింపు నిన్ శరణంటినమ్మ! ౨౮

కలుముల జవరాలివి నీ
వల ఘనుడగు చుట్టుకైదువగు జోదుకునీ
వలరించెడు చిలుకల ప
ల్కులసిరి చెలివనుచు నిన్ను గూరిమి గొలుతున్ ౨౯

జలజ మందస్మితోరు ప్రసన్న వదన!
భాగ్య హస్తాబ్జ! సౌభాగ్యభాగ్యవతివి;
అభయ కర పద్మవని భక్తశుభదవనుచు
వినుచు కారుణ్యవని హరిప్రియ! నుతింతు 30

హరిహరబ్రహ్మదేవాది పరమభక్త
సేవితాబ్జాంఘ్రియుగళివి శ్రీవిశేష
పద్మ శంఖాది నిధి మహాధ్యాసురాంగి
వతుల కారుణ్య హృదయవు నతులు నీకు, 3౧

నీరజాయత కరుణార్ద్ర చారునయన!
పద్మ భూషిత కోమల పద్మ హస్త!
గంధ మాల్యాది శోభినీ! యిందువదన!
అఖిల భువనేశ్వరీ! హరిప్రియా! నుతింతు,

-: శ్రీశుభం భవతు: -

ఇయ్యది

శ్రీశేషశైలాధినాథుండై శ్రీయలమేలు మంగాపతియైన
శ్రీ శ్రీనివాస పాద పద్మములలో సమర్పితమై ముగిసినది

శ్రీశుభాశిషంబు

శ్రీ

శ్రీ

# శ్రీ శ్రీనివాస దివ్యకళా వైభవము

## (౬) శ్రీవారి మేలుకొలుపు

### చతుర్థ సర్గము

శ్రీ సతీమణి కౌసల్య చెలువ మలరు
కడుపు బంగారుపంట! మా కన్నతండ్రి!
తూర్పుసందెలు చెలువారె తోయజాక్ష!
స్వామి! మీకివె శ్రీసుప్రభాతశ్రీలు, ౧

రామ! శ్రీనరశార్దూల సామగాన
లోల! ధర్మావతార! సీతాలలామ
మధుర సౌందర్య హృదయాబ్జమధుపరాజ!
దాశరథి! లేర! సుప్రభాతమ్ము నీకు ౨

దేవకీదేవి వసుదేవ దివ్య గర్భ
శుక్తిముక్తాఫలా! శ్రీయశోదతనయ!
నందనందన! రాధికా నందహృదయ
కమలబాంధవ సుప్రభాతములు నీకు, ౩

లలిత మాతృత్వ యౌ వకుళామతల్లి
కండ్ల గని పెంచుకొన్న బంగారు కన్న!
సాధ్వి పద్మావతీ మానసైక హంస!
స్వామి! సుప్రభాతము శ్రీనివాస! నీకు ౪

మేదినీ జీవులను గావ మేఘవర్ణ!
మీ దయల్ మాకు రక్షగా సాదుకొలుప
శేషశైలాధివాస ! ఓ శ్రీనివాస!
మేలుకొనవయ్య! స్వామి! మమ్మేలుమయ్య! ౫

దేవ! ఖగరాజకేతనా! దేవదేవ!
శేర! గోవింద! లీలావతార! శేర!
శ్రీరమానాథ! భువన సుశ్రీల నెల్ల
నేలుకొనవలె కరుణించి మేలుకొనవె, ౬

భువన లీలావినోద! ఓ పుణ్యపురుష!
శేషభూషణ! ఫణిరాజ శ్రీవిశేష-
తల్పమున్ వీడవయ్య! నిద్రలను వీడి
స్వామి మేల్కొను శ్రీశేషశైల వాస ౭

తల్లి! జగముల నేలెడి చల్లనైన
ఉల్లమలరిన శ్రీశుని యురముపైన
పల్లవించెడు కోర్కెల బవ్వలించు
స్వామినీ! లెమ్ము శ్రితకల్ప వల్లి! వేగ ౮

కువలయాధీశ! తమరు మేల్కొనినగాని
మేలుకొనలేవు జగములు; చాల మాకు
రమణ! మీ మేలుకొలుపె శ్రీరామరక్ష,
స్వామి! కరుణించి మేల్కొనవయ్య వేగ, ౯

గొల్ల పడుముల కనుదమ్ములెల్ల త్రుళ్లి
తనర వికసించె; సూర్యలోచముడ! శేర
బిగియురక్కసి చీకటిన్ విరుగదన్ని
శ్రీపరంజ్యోతి! మేల్కొర! గోపవేష! ౧౦

యామినీనీలకుముదినీ భామ విరిసె
సరసతల గుల్కజేయు శశాంకనయన!
రంగుమీరగ వేద విహంగమాళి
శ్రావ్యముగ బల్కె మేల్కొర స్వామి! వేగ ౧౧

పడతి శ్రీసతి కుచ చక్రవాకయుగళి
రాపిడులు సేయు చీకటి రాత్రి బాయ
మేలుకొనవయ్య నిత్యభోగాలు వెలుగ
శ్రితజగత్పతి నిదురేల! శ్రీనివాస! ౧౨

శ్రీశ! కరుణాలవాల! శ్రీ శ్రీనివాస!
రేయి మెలమెల్లగా జారి మాయమయ్యె
మలయ పవనుడు మెల్లగా మసలి లేచి
చల్లగా నావులించెను స్వామి! లేర ౧౩

మధుర సౌందర్య ప్రకృతి శ్రీమాతకనుగు
పసిడి జిలుగుల పొత్తిళ్ల పాపయగుచు
తూర్పు కొండల లోయల తొట్లెలూగు
బాల సూర్యుడు తోచె తమాలవీధి, ౧౪

తూర్పు కనుమలలో నుషాతోయజాక్షి
త్రుళ్లిపడి లేచి స్మేరయై తొంగి చూచె
రంగు బంగారు వేకువ రానెవచ్చె
లేవరా! స్వామి! నిద్దుర లేవవయ్య! ౧౫

ప్రకృతి సౌందర్య మాతృదేవత మహోజ్జ
పోషణల మీరు తూరుపుబోటి నుదుట
బూనిదిద్దిన కుంకుమ బొట్టువంగ
ఇనుడు తూరుపు కొండపై దువర దోచె ౧౬

పావనములయ్యె మీ కృపా పరమమరి
సకల వేదాంగనలు పేర్మిపాము గావ
మునము పారిడి మధురిమల్గలికి యాడ;
శేషగిరివాస! మేలుకో శ్రీనివాస! ౧౭

షుములు తుంబురు నారద సనకసాదు
లెలమి నిను బాడి పెద్దలై నిలిచినారు
పరమ సంకీర్తనులు తాళ్లపాకవారు
వినుతులను బాడ వేచిరి వేంకటేశ । ౧౯

సప్త సుస్వర రీతుల సామ వేద-
సార సంకీర్తనమ్ముల సరసచతుర-
దేవ గంధర్వ భామినుల్ భావమలర
పాడ వేచిరి మేలుకో స్వామి! వేగ ౨౦

కూరుములు మీర తమరి దేవేరులైన
ఇంతి పద్మావతియు నలమేలు మంగ
లెలమి వీణలమీటి మిమ్మలర జేయ
వేచినారయ్య! మేలుకో వేంకటేశ! ౨౧

పద్మినీ చాయలుషయు పెంపలర బేర్మి
గొలువ నొక చక్రరథముపై జలజహితుడు
వారువము లేడు గట్టి యనూరుడంత
సాగ వెడలెను విశ్వసంచారుడగుచు, ౨౨

మౌను లెల్లరు స్నాతోత్తమాంగులగుచు
భవ్య పూజార్ఘ్యపాణులై భక్తిమీర
నిగమ సూక్తులతోడ మీవెలవుముందు
వేచినారయ్య! శ్రీపతీ వేగ లేర! ౨౩

స్వర్ణ కలశాల గొని ద్విజ శ్రేష్ఠవార్య
షుములు సద్భక్తి నాకాశ గంగనుండి
తీర్థముల గొని మీ ద్వార దేశమందు
వేచినారయ్య! మేల్కొనవేమి! స్వామి! ౨౪

ఘనులు భవదీయు లధికారు లనధికారు
లరసి మీ సేవలన్గొన నారసికొనుచు
వేత్రహస్తులు నిలదీయ వేచివారు
వేగ మేల్కాను తండ్రి! శ్రీవేంకటేశ ౨౫

వైనతేయాది వాహకుల్ జ్ఞానమతులు
నిత్యసూరులు వైకుంఠనిలయు లెల్ల
అర్హులై స్వామి మీ దర్శనార్థులగుచు
వేచియున్నారు మేల్కాన వేమి? స్వామి! ౨౬

దివ్యసూరులు పన్నిద్దరవ్యయోరు
కీర్తిమంతులు, ద్రావిడోద్దీప్తినలరు
వేదములబాడుచున్నారు వేడ్కలలక
వేగ మేల్కానవయ్య! శ్రీవేంకటేశ ౨౭

మత్స్య! కూర్మ! వరాహ! శ్రీమనుజసింహ
వామనా! జామదగ్ని! శ్రీరామ! రామ!
కృష్ణ కల్క్యవతారాది కీర్తనీయ
విశ్వ రూపుడ; మేల్కానవేమి? స్వామి! ౨౮

స్వామి! మీదగు బ్రహ్మోత్సవాలకెలమి
మూరుతము బెట్ట జ్యోతిషబుధులు తమరి
నిలయమున వేచియున్నారు. నిదుర మరల
మనలబోకుర! అలమేలు మంగనాథ! ౨౮

వరద! మీ వైన బ్రహ్మోత్సవాలకొఱకు
ననుమతులగొన నధికారులనధికారు-
లర్హులై వేచియున్నార లాజ్ఞ నిడగ
వేగ మేల్కానవయ్య! శ్రీవేంకటేశ! ౨౯

అను స్వామికి సుప్రభాతములను
పాడి శ్రీవిశ్వరూపసేవలను గనిరి
వరదునకు ఉత్సవాలను జరుప వెంచి
కదలివారం తనధికారము నత పరులు 30

స్వామి శ్రీసుప్రభాతమున్ స్వాంతమందు
నిలిపి పఠియించువారికి నిత్యసత్య
శాంతి సౌఖ్యంబు కలుగని సంతతమ్ము
దలచు చేగిరి యధికార ధర్మవిదులు 31

ఇయ్యది

శ్రీ శ్రీ అలమేలు మంగా సమేత శ్రీ శ్రీనివాస పాద పద్మ

ములలో సమర్పితమైముగిసినది

-: శ్రీశుభంభవతు :-

శ్రీః

శ్రీశ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీహయగ్రీవాయనమః

# శ్రీశ్రీనివాస దివ్యకళా వైభవము

## (౭) శ్రీశ్రీనివాస కల్యాణ వైభవము

### పంచమ సర్గము

అదియు కన్యా సు సంక్రమణంపుమాస-
మునను శ్రవణైకనక్షత్రమందు మిగుల
స్వామి బ్రహ్మోత్సవంబుల జరుపనెంచి
అందముగదిద్ది తీర్చిరి మందిరముల, ౧

శ్రీవిశ్వ శ్రేయస్కర
పావన శ్రీ వేంకటేశ బ్రహ్మోత్సవముల్
సేవింపదగుచు భక్తుం
గావన్ భవతారకమ్ముగా భాసిలుతన్। ౨

ధర్మా ధర్మంబులకును
నిర్మల సత్పుణ్య పాప నిచయంబులకున్
కర్మల కతీతు డెవ్వడొ
ధర్మమను డతని కిపుడు ధర్మోత్సవముల్। 3

శ్రీలంరారు వేంకటగి
రీంద్రము భూమి వికుంఠ సీమగా
వాల వెలింగె; సప్తగిరి
వాయుంలో సిరిపేర్మలందు! భో
గాలదరింప భక్తులను
గావగ వేంకట నాథుడీ ధరన్

లీలం జూపి వెల్గెను ని
　　లింపులు గొల్వగ లోకభర్తయ్యై, ౪

స్వామి బ్రహ్మోత్సవంబులు బరిఢవిల్లు
వేళ లీనాడు, వేంకట శైలమింకు
దిగిన వైకుంఠ సీమగా, దేజరిల్లె
ఎంచి భక్తులు చూచి తరించి పోవ, ౫

విద్యుద్దీపపు కాంతి పుంజములతో
　　వెల్గెన్ నభోభూస్థలుల్ !
సద్యోనిర్మిత దివ్యవైభవకళా
　　సౌందర్య సౌభాగ్య కృ
త్యుద్యంబై యలరార మంటపములెం
　　తన్ మీరె; వేదాంతస
ద్వేద్యుండౌ విభు శ్రీనివాసుం కగున్
　　దివ్యోత్సవంబుల్ కడున్ ౬

ఎందున జూచిన భక్తుల
సందడి ధర్మాధికార్ల సందడు లెలమిన్
ఇందీవరసుశ్యాముని
సుందర బ్రహ్మోత్సవాలు శోభిలు ననుచున్ ౭

మందిర సీమల నంతట
నందముగా దిద్ది తీర్చినారధిపతులా
నందము ల లరగ నిలయం
బందెదొగెను శ్రీనివాస బ్రహ్మోత్సవముల్, ౮

ఎచ్చట జూచినన్ మిగుల హెచ్చిన
మంగళ శ్రీలు కుల్కు సాం
పచ్చపడంగ ముచ్చటగు
పచ్చని మామిడి తోరణాలజా-
లచ్చపు పెండ్లి వేడుకల
లక్షణముల్ కనువిందు సేయ; మా
లచ్చికి శీను సామికి భ
ళా యను వెల్లట పెండ్లి వేడుకల్, ౯

మామిడి కన్నెం మరువంపు జి గి మీరి
దూగాడు లేనవ్వు తోరణాలు
నునుమబ్బుపైటల గనువిందు గలిగించు
దివ్య విద్యుత్స్మితోద్దీప శ్రీలు
స్వర్ణ విద్యుత్ప్రభావైనతేయస్ఫూర్తి
కలిగించు శుభపతాకాంజాలు
చుక్కల సిరులన్ని చక్కని పుడమిపై
మురిసెడు నునునవ్వు ముగ్గు వరుస
లలరు పువ్వుం పడతుల పొలుపు మీరు
నవ్వుపువ్వుల దండలు నాట్య సరళి
దీప్తులొలుక గ తిరుమలన్ దీర్చినారు
స్వామి బ్రహ్మోత్సవాల వైభవపు వేళ ౧౦

అండ పిండ బ్రహ్మాండాల న మరియున్న
ఆపరబ్రహ్మ కేటేట నమర జరుగు
వైభవోన్నత బ్రహ్మోత్సవం గాంచ
భక్తు లాసక్తులై తర్లి వచ్చినారు, ౧౧

అది నవాహ్నిక బ్రహ్మోత్సవైక దీప్తి
ధర్మతత్పరు లాలయ ధర్మకర్త
లధిపతులు మంత్రివర్యులాచార్యవరులు
జీయరార్యులు నటకు వేంచేసినారు; ౧౨

పరమ భక్తులు యాత్రిక ప్రముఖులెల్ల
భక్తితత్పరులై తర్లి వచ్చినారు
ఎంచి విశ్వోత్సవములసేవించినట్లు
విభుని బ్రహ్మోత్సవముల సేవింపదలచి ౧౩

స్వామి పరవాసుదేవుడై పరిఢవిల్ల
భక్త సుజనులు పరమ ప్రపన్నులెల్ల
నిత్యసూరులు సిద్ధులై నిలిచి కూర్మి
గొలువ; తిరుమల యవనివైకుంఠ మయ్యె, ౧౪

విఖనసాచార్య విబుధాదివేద విదులు
వినుతులాగమ శాస్త్రకోవిదులు నెల్ల
స్థండిలము దర్భమౌంజ్యాది సకల వివిధ
ఉత్సవావసరపు వస్తువులను గొనుచు; ౧౫

పెద్ద పెద్దల యనుమతిన్ వేడ్కబడసి
విఖనసాచార్యవర్యులు విధివిధాన
మమరి యా విష్వ సేనుని మంత్రవిధిన
నర్చనల నుత్సవా రంభ ణమునవిడిరి ౧౬

పసిడి యుత్తలను భక్తితో గైకొని
1 వైఖానసాగమ పండితాళి
శ్రీనివాసునకు మా శ్రీ మహాలక్ష్మి కి
బ్రహ్మోత్సవంబని వచ్చినారు

(1) పాంచరాత్రాగమ పండితాళి

స్వస్తిస త్పుణ్యాహ వాచనాంకురమహ
దారోపణాది సత్కర్మలలరె
ఘన భేరికలు మ్రోగ గరుడ ధ్వజారోహ
ణంబయ్యె దోషసర్పంబులదర
ముప్పది మూడు కోట్లొప్పిన వేల్పుల
యాహ్వాన భేరిక యలరిమ్రోగె
ఋగ్గీతముల నెల్ల ఋత్విజుల్ సేసిరి
భువనవైభవ మొప్ప హవనవిధుల
నిత్యనైమిత్తిక నిజహోమ బలిహార
కార్యాదు లొప్పెను గలియడంగ
వేద వేదాంగాది వివిధపురాణ స
త్కావ్యపారాయణ క్రమము లమరె
బంగరపు పళ్లెరములందు పండ్లుపూలు
పసుపు కుంకుమ హారతుల్ మసలియాడ
వెలగి దివి నుండి భువికి విచ్చేసి యిటకు
చేర వచ్చిన వేల్పుల చెలులనంగ
తళుకు లీనెడు కుంకుమ తిలకమెసగ
పేర్మి బాడిరి మ్రొక్కిరి పేరటాండ్రు, ౨౯

ఆసురీ సంపద లావరించిన వారి
మదిదెల్ల హోమ ధూమంబులాడె
షడ్వర్గరిపులలో సదమదమౌ వారి
మనసు శాంతిల వేదనినద మూగె
తాపత్రయాలలో దల్లడిల్లెడి వారి
స్వాంతమ్ములకు శాంతి పాఠ మొప్పె
ఈషణ త్రయమున దూషితులౌ వారి
యెదలు రంజిల్ల సద్విధులు సాగె

భవ భయంకర విషసర్ప బాధితులకు
పరమ పావన వేంకట పతి మనోజ్ఞ
నామసంకీర్త నౌషధాన్న సేవ
నంబు లమరెను శ్రీ శోత్సవంబు దవర ౧౯

(శ్రీవారి కల్యాణవైభవము)

శ్రీలు విలసిల్లు కల్యాణ సీమలందు
వేదములుస్తంభములు నౌచువేడ్కదనరి
వెలుగు కల్యాణ మంటప శ్రీలలోన
స్వామి కల్యాణ వైభవంబలరునంట! ౨౦

చూడముచ్చట గొల్పట! చూచువార
లిహ పరానంద సౌఖ్యంబులెదగ మిగుల
జన్మతరియింతురంట! ఈ జన్మ కిట్టి
వైభవమ్మ అందట! యని భక్తులంద్రు ౨౧

లలిత మందస్మితోన్నత జలజ విమల
దళ విశాలాయతామృత తరళ నయన
యైన శ్రీమహాలక్ష్మి నా శ్రీనివాస
రాట్టు కిడునట ఆకాశరాజు నేడు, ౨౨

ముప్పది మూడు కోట్ల సుర
ముఖ్యులు దేవగణాదిదిక్పతుల్
తప్పక వత్తురంట! యరు
దౌనపురూపపు దివ్య భామినుల్
ఒప్పుల కుప్పలై మిగుల
నొయ్యన నాట్య మయూరులౌచు బల్
మెప్పుగ నాడ వత్తురట!
మేటి కళా కమనీయు లౌచున్ ౧౩

హరి హరబ్రహ్మ దేవాది పరమభక్త
సేవితాబ్జాంఘ్రియుగళికి శ్రీనివాస
విభవ కల మేలుమంగకు పెండ్లియంట!
చూడ సంబరమట! భవమూడునంట ౨౫

ఒక్క స్వామికి కల్యాణ మొనరసేయ
భువనముల కెల్ల కల్యాణముల నొనర్చు
ఫలము సిద్ధించునని యెంచి భక్తజనులు
స్వామి కల్యాణముల నోర్మిజరుపుచుంద్రు, ౨౬

మనిషి కొకమారె కల్యాణ మమరు; స్వామి -
వారి కగు నిత్యకల్యాణ పచ్చతోర -
ణమ్ము ! సతతమ్ము సాగిన నెమ్మిమీర
స్వామి కృపలెల్ల మనపైన సాగుచుండు, ౨౭

తల్లి దండ్రులు శుభముల దనిసిరేని
పిల్లలకు కూర్ములభివృద్ధి పెరుగుచుండు
తల్లి దండ్రులు చల్లగా నుల్లమలర
పిల్ల లెప్పుడు చల్లగా వెలుగుచుంద్రు ౨౮

అందులకె స్వామి దయగోరి యాశ్రితాత్మ
లైనభక్తులు హరికి కల్యాణములను
చేసినను స్వామి భక్తులన్ జెలిమిమీర
తిరిగి కల్యాణ శ్రీలిచ్చి కరుణ నేలు ౨౯

అనుచు దలపోసి భక్తులు ననములైన
పెద్ద పెద్దలు వచియింప పేర్మిమీర
స్వామి కీనాడు భక్తులు భక్తిమీర
హరికి కల్యాణ మొనరించి మురియుచుంద్రు, 30

సప్తఋషులును తాపసుల్ శౌనకాది
మునులు యోగులు సిద్ధులు వినయధనులు
విబుధులెల్లరు వేంకట విభుని దివ్య
వైభవోజ్జ్వల కల్యాణ వేళకపుడు!
పిలుపు నందింప వచ్చిరి పేర్మిగదుర 30

నిత్యసూరులు వైకుంఠనిలయులెల్ల;
సకలలోకాధివాసులౌ సాధుజనులు
మొదలుగా గల సుకృతులు ముక్తి జూపు
విభుని కల్యాణములను సేవింపజనిరి, 32

ఆది శేషుడు సపరివారంబుతోడ
శేషభూధర రూపుడై చేరినాడు
సప్తగిరి వాసులెల్లరు స్వామి విశ్వ
విహితకల్యాణములను సేవింపజనిరి, 33

మన్మథుని గన్న తండ్రికి మంగళాంగి
యైన శ్రీమహాలక్ష్మికి మాననీయు
భవ్య కల్యాణ మగునని భక్తకోట్లు
తరలి వచ్చిరి తండోపతండములుగ, 34

అల శ్రీనివాసుల కలమేలుమంగకు
తిరునాళ్ళ చాటించి తెలిపినారు
ఆ బ్రహ్మనే గన్న యా పరబ్రహ్మకు
ఆది లక్ష్మికి ది కల్యాణమనిరి
త్రిభువనాధి పుడైన దేవాదిదేవున
కా శ్రీమహాదేవి కనిరి పెండ్లి;
విశ్వవిరాట్స్వరూపేశ్వరునకు విశ్వ
శ్రీదేవికోత్సవ శ్రీలనిరి

జారవిడువక నీ మహోత్సవపు వేళ
బేర్మి మీరగరండు సేవించుకొనుడు
తిరిగి రాదిట్టి సమయంబు మరల మరల
ఎంచి సద్భక్తులార! తరించ రండి ౩౫

పరమ సద్భక్త సజ్జనోద్ధరణ గోరి
ఘనులు విబుధులు ధర్మాధికారులెల్ల
తెలియ శాస్త్రిక యంత్రాల దెలిపినారు
గిరిధరుని పెండ్లి వేడ్కలకరిగినారు, ౩౫

శ్రీమహాలక్ష్మిసురేశ్వర శ్రీనివా
సులపెండ్లిసందడి శుభములనుచు
పేరు పేరున బొట్టు బెట్టి పేరంటాంధ్ర
బలుదిక్కులందుండి పిలిచినారు
దివ్యులన్ మునుల యాత్రికులను భక్తులన్
భక్తితో నాహ్వానపరచినారు
అలమేలు మంగా రమానాయకుల పెండ్లి
మొదట పెద్దరికమ్ముబూనినారు
ఎవరు వారన గాంచనెవరు వారె
అన్నమాచార్యవర్యులే యువనిలోన
స్వామి కల్యాణ వైభవోత్సవము దొలుత
మొదలిడిరి నేటికదియు పెంపెదగెవెలగె ౩౭

(తిరువంజనోత్సవము)

చెలువమలరిన హృదయులౌ శిల్పవరుల
ఉలులు గిల్గింతపెట్టగా పులకరించి
దివ్య సౌందర్యరూపాల దిద్దుకున్న
స్తంభములు వెల్గు మంటపస్థానమందు,

పసిడి నగిషీల చెక్కడమొసగ మిగుల
వెలుగు తిరువంజనపు మేల్మి పీటపైన
వింతసొంపులగుల్కు దేవేర్లతోడ
శ్రీనివాసుని వేంచేపు చేసినారు, 3౮

అంతలో మంగళపు మేటి వాయిదములు
హరికి తిరువంజనోత్సవ పరమవిధులు
జరుగునని మారుమ్రోగెను; జగతికెల్ల
శాంతి సౌఖ్యపు సిరులిల సాగుననుచు, ౪౦

అర్చకాస్థాన ముఖ్యులాచార్యవరులు
వేదవిజ్ఞులు జియ్యరుల్ భృత్యులధిప
గణము లభ్యంగనార్ఘ్యముల్ గలిగిహరికి
జెలగు రువంజ నోత్సవములకు జనిరి; ౪౧

చతుర వైఖాన సాగమాచార్యవరులు
నొనర విభునకు తిరువంజనోత్సవంబు
లాగమోక్త ప్రకారంబుగాగ చేయ
దలచి మొదలిడి రావిదుల్ తగినతీరు, ౪౨

మహిత తిరువంజనోత్సవ మంటపమున
సంబరముగూర్చు హేమపీఠంబువందు
పూని తనవారి కుభయ విభూతి నిడగ
స్వామి తిరువంజనోత్సవస్వాంతుడయ్యె, ౪3

ఇల నుభయవిభూతికి ప్రతివిధులునైన
మాతృమూర్తులు శ్రీసతీమణులు మురిసి
ఓరచూపుల సింగార మొలుక బేర్మి
జూచుచుండగ విభుడు కూర్చుండినాడు ౪౪

అల విస్సేనుని యాజ్ఞతో సురలాది
సద్భక్త గణముల సద్దుమణగె
అమరాధినాథుడు నాలపట్టుమువట్టె
అజుడోర్మిబట్టె కాళాంజినపుడు
జమిళి చామరముల చంద్రసూర్యులువేసి
రాదిభిక్షువును ఛత్రంబు బట్టె
అణిమాధిపతి ఫణిరాజు పాదుకలిడె
నారదాదులు పాడినారు శ్రుతుల
భారతీరమణుండునుదివ్యర్షులెల్ల
వేదసూక్తులతో వేదవేద్యుగనిరి
దివ్యసూరులు భక్తులెంతేనిగనిరి
స్వామి తిరువంజనోత్సవవైభవముల, ౪౫

''తచ్ఛయోరావృణే,, మని
మెచ్చన్ నిగమోరు పంచమేదుర సూక్తుల్
హెచ్చుగ పలికిరి ద్విజులే
పచ్చన్ స్నానోత్సవాన స్వామికి వేడ్కన్, ౪౬

''నీరాట్టమ్ముల'' బాడిరి
కూరిమినన్ వైష్ణవార్యకోటి సభక్తిన్;
పేరిమినన్ద్రవిడాగమ
పారాయణమొప్పినారు స్వామికివేడ్కన్ ౪౭

పసుపుంగుంకుమ; పూలు; నక్షతలు ధూ
పంబుల్ ప్రదీపంబులున్
పసుపుంబట్టలు; నీటిస్నానములు; దో
షన్; బాసలై వేదముల్
మెసలన్; ''నన్ శరణన్న వారినవిశ

మ్మేలంగ నేనుందు'' నం
చెసగన్ బల్కి ప్రమాణ మూనెనను! దో
చెన్ శ్రీశుస్నానోద్విధుల్; ४८

''నీవు స్మరియింపు నన్ను; నిన్ నేను నెపుడు
స్మరణ జేతును మనది స్వస్వామి భావ
మహిత సంబంధమనుచు ప్రమాణమూన
వరలుదన'' నొప్పె హరి తిరువంజనమ్ము, ४౯

వేదవిదాంవరిష్ఠులగు
పెద్దలముందర, సర్వదేవతా
మోదముతోడ వేదవిధి
బూనిప్రమాణపు సాక్షిగాగ నా
సాధన గల్గి నన్గొలుచు
సాధులబ్రోచెడి సత్ప్రతిజ్ఞలీ
మాదిరి జేతు నంచు,నిట
మాధవుడొప్పెను స్నానవేడుకల్, ౫౦

పరమనిగమాంత వైభవ భాసురాంగు
డైన మా శ్రీనివాసుల మాననీయ-
భవ్య కల్యాణ దివ్యోత్సవంబులిపుడు
సాగునని విష్వసేనుడు చాటిచెప్పె; ౫౧

అజుడు పురహరుడింద్రదిశాధిపతులు
మాత వకుళమ్మ భవ్యానుమతుల తోడ
శ్రీనివాసుల నప్పుడు చెలిమి మీర
పెండ్లికొడుకును జేసిరి పెద్దలయ్యె; ౫౨

తనకన్న తండ్రికి ఘనమైనపట్టుపీ
        తాంబరమును గట్టె ధాత భక్తి
దనపేర్మి తమ్ముని కనకరత్నపు కిరీ
        టమును తల నిడె బిడౌజుడలరి
అతడె నేనని స్నేహమమర శ్రీహితునికి
        నూర్ధ్వపుండ్రముదిద్దె నుదుటభవుడు
లోకేశుడనుచు శ్రీలోలుకు దిక్పతుల్
        తులలేని భూషణంబుల దొడిగిరి
అల శచీదేవి మరదికి నందమొలుక
        పెండ్లిబొట్టిడి బుగ్గపై బెట్టె చుక్క-
నరుత నిడె వైజయన్తి నావరునినిట్లు
పెండ్లికొడుకును జేసిరా పెద్దలెల్ల ౫౩

అల సముద్రుడె యాకాశరాజునయ్యె
లక్ష్మిపద్మావతమ్మ నలంకరింప
ఆజ్ఞనిడ; వాణీ; శచి, యుమ, యప్సరాళి;
పెండ్లికూతురు జేసి రా వెలదిసిరిని; ౫౪

సిరిగలయత్తకు సింగారములు దూగ
        వాణి పీతాంబరంబమరగట్టె
ముదితచెల్లెలు సిరినుదుటుంచె శచి పెండ్లి-
        బొట్టు ; సిరిచుక్కను బుగ్గపైన
పసుపు కుంకుమపూలు పలుతీరుగాజులు
        సిరికభేదాంగియ్యె గిరిజపెట్టె
ముదితకు ముక్కుకుముత్తెపుముక్కెరన్
        అల తిలోత్తమపెట్టె చెలువమలర
తీరుతీరైన మణిమయ తారహార

ములను రంభాదిసురచిరంటులు నొసగిరి
హరికి చిలుకల కలికిగా సిరిని దిద్ది
పెండ్లికూతురుజేసిరా పేరటాండ్రు ౪౫

ఈవిధంబుల తలపులు భావమందు
మసలదలపోసి యర్చకమాన్యులెల్ల
శ్రీనివాసు లకాశ్రీకి చెలిమిమీర
కలుగజేసిరి శ్రీయలంకారములను ౪౬

మంగళవాద్యముల్ మఱి ముందుమ్రోగగ
నాదసుస్వరములా నందమిడగ
పటహ మృదంగాది పటుతూర్య భేరికల్
కొమ్ములు బాకాలు నెమ్మిమ్రోగ
ఉపనిషత్పురాణ ణోన్నతవేదోక్త
లాగమవేద్యులెల్లరును బలుక
ద్రావిడ వేద పారాయణంబుల వైష్ణ
వాచార్యవర్యులు భక్తిసలుప
హరి హర బ్రహ్మ లమరులు నురగ గరుడ
నిత్యసూరులు వైకుంఠనిలయు లెల్ల
కొలువ; గజవాహనమ్మునైగులుకఠీవి;
పెండ్లికొడుకయ్యె వెడలె మా వేంకటపతి, ౪౭

సకలమంగళకరసర్వవాయిద్యముల్
నాదసుస్వరములు నమరిమ్రోగ
వేల్పుముత్తైదువుల్ వివిధ మంగళ గీత
ములబేర్మిబాడుచుముందుసాగ
పుడమివేల్పుల పెద్దముత్తైదువులుగూర్మి
బరగనివాళులబట్టి నడవ

వాణి యైంద్రాణి శర్వాణి మంగళవస్తు
పాణులై సాగిరి రాణువముగ
రక్తిజెలువార భక్తపురంధ్రు లరుగ
మానికపు పల్లకిపయి పద్మావతమ్మ
కుందనపుబొమ్మగా పెండ్లికూతురయ్యి
పెండ్లిమంటపమునకు దా వెడలెనపుడు ౫౮

మౌక్తికోజ్జ్వలకల్యాణ మంటపమున
అర్చకులు శ్రీని శ్రీశ్రీనివాసునపుడు
ఒకరికొకరభిముఖముగా నొప్పునటుల
చెలువమలరంగ వేంచేపు చేసినారు ౫౯

ఇంద్రనీలోజ్జ్వలాకార మెగసి యాడు
చారుతా నంద జలధరశ్యామునకును
దివ్యవిద్యుల్లతా శ్రీకి దీప్తి తనర
పెండ్లిజరిగెడు తీరు లింపెదగదోచె ౬౦

మధురమోహపు నీలాల మబ్బుతునుక
నేల దిగివచ్చెనోయన నెగడె స్వామి
నీలజలధరు గనగ శంపాలతేమొ
వెదకుచున్ వచ్చెనన సిరి వెలది తోచె ౬౧

దండినునుమబ్బుదొరకు మోదంబులలర
మెండుబంగరు మెరుపమ్మ కండదండ-
గూర్చ బెండిలి సేయంగ గొమరుమిగుల
పుడమి మురిపాల వానల మురియునంట! ౬౨

అనుచు ప్రజలెల్ల సంబరాలారవోసి
శ్రీనివాసుల కల్యాణ సేవలందు

తగనిమురిపానమరచిరి తమను తామె
విభున కప్పుడె కల్యాణవిధులు సాగె ౬౩

విస్వసేనుని నర్చించి పెండ్లివిధుల
వరలజేయుచు నావధూవరుల మధ్య
యవనికమరించి వేదవైభవులునపుడు
ఎంచి జీలకర గుడము బెట్టించినారు, ౬౪

ఏకముగ విప్రవర్యులుప్రాకటముగ
ఉభయ వంశీయ గోత్రాల నొనరజెప్పి
తైలధారగ జలధారతనరిసాగ
కరము బల్కిరిమహాత్సంకల్పములను, ౬౫

ఇటునేడుతరముల నటునేడుతరముల
తరతమభావాల దరల జేసి
ఏడేడులోకాలనేలెడుమాస్వామి
తరియింపజేయునెంతని తలంచి
ఉభయవిభూతిసద్విభవాదిదంపతీ
గోత్రంబులన్‌బుధుల్‌గొలిచినారు
త్రిభువనసంసారదివ్యమౌరథమునన్‌
సమతుల్యచక్రులైసాగుడనుచు
ఘనులుధర్మాధికారులాకాశరాజు
లగుచు నిల్లాండ్రతోడజలంబులిడుచు
శ్రీనివాసులకాశ్రీని దానమిడగ
సిరిని కెంగేల గొనియెనావరదుడపుడు ౬౬

అనుచు మంత్రులుదేవాలయాధిపతులు
అడుగకుండనె మామలై యనఘులొసచు

స్వామి కిడినారు సద్వస్తువాహనముల
పసిడికాన్కల నిడిరి సద్భక్తు లెల్ల, ౬౭

పేర్మిబంగారుబొమ్మ మా పెండ్లిపడుచు
నెదన కలతలు రాకుండ నేలుకొనుచు
మాకు మముగన్నవారలై మంచినిడుచు
నెంచి మమ్మేలుడనుచు దీవించినారు, ౬౮

(1) పరమవైఖానసాచార్యవరులు నిగమ-
మంత్రముల సుస్వరంబులు మసల జెప్పి
శిషులొగిపల్క శ్రీమంగళాష్టకములు
రూఢిజేయించి రక్షారోపణముల ౬౯

ఇనశశుల్ సాక్షిగా నిలనింగిసాక్షిగా
సత్పంచభూతముల్ సాక్షిగాగ
దిక్పతుల్ సాక్షిగా దివిజులు సాక్షిగా
సకలభూతంబులు సాక్షిగాగ
జగదాది ప్రకృతియు జగములుసాక్షిగా
సర్వమంగళసురుల్ సాక్షిగాగ
అలనిత్యసూరిజనంబులుసాక్షిగా
సత్యమౌ నాయెద సాక్షిగాగ
నమ్మి నన్నెద గొల్చెడి మిమ్ము మేము
అరసియేలుదు మాశ్రితులార ! యనుచు
పలుకువిధి శ్రీనివాసదంపతులు పేర్మి
బాసలిడుతీరు తలంబ్రాలు బోసికొనిరి, ౭౦

---

(1) పాంచరాత్రాగమాచార్యవరులు నిగమ-

శ్రీమతి పద్మావతీమంగళాంబుజ
కరపుటిన్ పద్మరాగాలు గాగ
శ్రీశ్రీనివాసుల శిరముపై దొరలగా
నును మల్లెమొగ్గలై ఘనత మీర
స్వామిమేల్తిరుమేనుపై జాలుకొనిపోగ
లలితేంద్ర నీలాల చెలువమలర
కనకచేలంబుపైమునుకొని కదలాడ
పైడిపూమొగ్గలై పరిఢవిల్ల
శేషశైలాధివాసుడౌ శ్రీనివాసు (స)
సరసకల్యాణవైభవోత్సవపుమేల్మి
ఆణిముత్యాల తలబ్రాలు నాశ్రితులకు
(1) శుభములిడునని విబుధుల సూక్తులలరె ౭౧

వినుత పరకాల శ్రీయహోబిలవిశిష్ట(బ)
వానమామలజియ్యరుస్వాములెల్ల
దివ్యసూరుల శ్రీసూక్తి తేజరిల్ల
స్వామికిడినారు మంగళాశాసనములు, ౭౨

శ్రీమహన్తులు మౌనులు సామగాన
ములను బాడుచు నక్షతల్మురిసి వేడ్క-
వేసిదీవించి వినతులై వేడినారు
భక్తులర్చించిరాది దంపతులనపుడు, ౭౩

శ్రీమన్నారాయణగురు
స్వాములు చినజీయరార్యవర్యులు భక్తిన్
శ్రీమంగళానుశాసన
మేమారక నిడిరి హరికి మేలిమిభక్తిన్, ౭౪

---

(1) పాంచరాత్రాగమాచార్యవరులు నిగమ-

వేదవేదాంగవేద్యులు విబుధవరులు
జ్ఞానయోగులు భక్తులు ధ్యానయోగ
ముక్తులీశుని కల్యాణములను భక్తి
వెలుగసేవించి హరిని దీవించినారు ౭౫

వేదవిదాంవరిష్ఠులురు
విజ్ఞతతోనిగమాళిజెప్పగా
ఏధితద్రామిడాగమ వి
వేకులు ద్రావిడవేదగానముల్
మోదముమీరబల్కసుర
ముగ్ధవధూటులు నృత్యగానమ
ర్యాదల నొర్మింజేయు ఖగ
రాజు పయిన్ హరిసాగె వేడుకన్ ౭౬

ఆతతపక్షానిలాందోళితాఖిల
దైత్యలోకంబులు తల్లడిల్ల
బాలార్కరుగ్గీల భర్మతను శ్రీలు
విరజిమ్మదిక్కులన్ సురులుతనియ
ఉచ్ఛ్వాసనిశ్వాసలూగి సాగగ కాద్ర
వేయాదు ల దరుచుపీగిపోవ
వేదస్వరూపుడై వెలుగొందుఖగరాజు-
పై శ్రీనివాసులు పరిఢవిల్లు
విజదీప్తులు విరియ దేవేర్లగూడి
మత్తమదగజగమనుడై చిత్తమలర
శ్రీవికుంఠమునుండి వేంచేసెననగ
స్వామి గరుడోత్సవాధ్యుడై సాగె వీధి ౭౭

మానవుడు జన్మసాఫల్యమలరవలయు -
నన్న, హరిగరుడోత్సవానందవిధుల
నెంచి సేవింపవలయు తరింపవలయు
ఒప్పె ప్రాముఖ్యమట గరుడోత్సవంబు ౭౮

ద్రావిడ వేద వైభవము
ధాటిగ జాటగ వైష్ణవోత్తముల్
భావములూర సామముల
బాడగ శ్రోత్రియ సద్విజోత్తముల్
భావజు రాజు పూలజిగి
బాకుల చానలు సేయ గానముల్
శ్రీవిభుడూరునేగె కుల-
శ్రీసతు లోలి నివాళు లివ్వగన్ ౭౯
(గరుడోత్సవము)

శ్రీస్వామి పద్మావతీస్వామినిన్ గూడి
గరుడాళు వారిపై కదలిరాగ
సిరిచుక్క బుగ్గపై చిరునవ్వులొలుకంగ
హరినోరగంట సిగ్గారలజాడ
శ్రీహరి కూరిమి సిరులూర వీక్షించె
శ్రీసతినాకేకరే క్షణమున
సిరిమేను వేన్నుడు జిలిపినందాకంగ
తనువులు పులకరింతలనుద్రుళ్లె
వారికూర్మలవైనముల్ పరగబేర్మి
జూచు వారల యెదలుదోబూచులాడ
భక్తసుజనులు నిర్వృతింబరగి ఝాడ
శ్రీ శ్రీయః పతు లలరి యూరేగినారు ౮౦

ఉత్సుకత మీర సద్భక్త వత్సలుండు
స్వామి వైకుంఠ వీధిలో సాగినట్లు
ఒర్మితో సాగు తిరువీధియుత్సవముల
ఎంచి సేవించి శ్రితులు తరించినారు ౮౧

శేషత్వ విబుధు డా శేష ఫణీంద్రుపై
శ్రీభూమి నీళలు చేరికొలువ
వేద స్వరూపుడా (1)పెరియ తిర్వడి పైన
శ్రీ సతుల్ గొల్వ నా సీనుడయ్యె
(2) సిరియ తిరువడి సుందరు హనుమన్నపై
విజయోజ్జ్వలాంగు డై వేక్క నమరి
ఉదయాస్తమయముల నొప్పార నిన శశి
ప్రభలలోనిన శశి విభుడునయ్యె
ఆఖేట మొనరింప నరిగజ కేసరి
యై మేటి యశ్వవా హనమునొప్పి
భువన మోహన సౌందర్య మోహినిగను
తానె త్రిభువన మూల సత్ప్రకృతిననుచు
పసిడి పల్లకి పైన సంతసము లెసగ
శ్రీనివాసుడు నూరేగె శ్రి తులు వొగడ ౮౨

పరమ యోగుల మానస పరమహంస -
య్యైన శ్రీ శ్రీనివాసుడు హంసవాహ
నమున శ్రీరాజ హంసుడై సుమతులలర
వరలె తిరువీధి దివ్యోత్సవముల మురిసి ౮౩

సర్వ లోకేశుడా రమా సతుల గూడి
సర్వ భూపాల వాహనోత్సవము నమరి

(1) పెరియతిరువడి = గరుడుడు (2) సిరియ తిరువడి = ఆంజనేయులు

సకల సుజనులు సేవించి సంతసింప
సార్వభౌ మోచిన పథాన సాగి వెలిగె ౧౪

గోపికాజన చిత్తని గూఢ జటిల
దారుణాజ్ఞాన వస్త్రాపహారుడయ్యె
చేతనా చేత నా శ్రయ భూతుడపుడు
పొన్న వృక్షంబు పై నేగె బుధు లు వొగడ ౧౫

దినము కొక తీరు శ్రీహరి ఘనమనోజ్ఞ
వాహనము పైన సిరి గూడి పరమభక్తి
రసకళామయ హృదయులు రక్తి బొగడ
పరగ తిరువీధి దివ్యోత్సవమ్ములమరె; ౧౬

(రథోత్సవము)

ధరణీ చక్రము కాంచనాంచితమహా
ద్గాంభీర్య మౌతేరుగాన్
వరచక్రంబులు చంద్ర సూర్యులమరన్
వర్ధిల్లు తన్మాత్రలే
వరలన్ సప్తహ యంబులై నడుప నా;
వాణీశు డా తేరుపై
సురులై భక్తులు గొల్వ సాగె హరి తా
శోభిల్లి దేవేర్లతో, ౧౭

వసుమ తీదేవి యరద రూపంబు దాల్చి
శుభదకల్యాణ వైభవశోభలలర
హరిని మనసార సేవించి మురిసి సాగె
ననగ; శ్రీహరి రథయాత్ర తనరి సాగె ౧౮

తనరు బ్రహ్మోత్సవాన రథస్థుడైన
శ్రీసహిత కేశవునిని దర్శించువారి
కవని మరు జన్మరాదని ఘనులు భక్తు
లెంచి మదిలోన హరిని సేవించినారు ౮౯

ఏడు కొండల వాడ! శ్రీవేంకటేశ!
అడుగు దండాలవాడ! శ్రీయాదిదేవ!
వరద! గోవింద! గోవింద! స్వామి యనుచు!
ఎంచి భక్తులు రథము సాగించినారు ౯౦

జగములే లెడి వేంకట స్వామి వారి
మేటి తేరుత్సవంబిది నీటు లొలుక
దివ్యులా డుచు పాడగా దేరుముందు
విభుడు నూరేగి నాడుదే వేర్లగూడి ౯౧
లోక కల్యాణ మొన గూర్చలోక విభుడు
తరుణు లలమేలు మంగ పద్మావతులను
కూడి బంగరు తేరుపై కొమరు మీర
సాగి యూరేగినాడు సజ్జనులు గొలువ ౯౨

హరి పద దాసదాసులమ
యాచిత సత్కరుణా మృతమ్ములన్
కురియగ జేయులక్ష్మికడు
కూర్మిల బంచెడు తల్లి మాకు; శ్రీ
గిరి పతి యైన మాధవుడు
కీర్తిలి గొల్చెడి తండ్రి మాకు; నిం
కొరులను గొల్వనేమి పని?
కొండలరాయడె మాకు సర్వమౌ ౯౩

అత డె మాపాలి యిల వేలు పవనిలోన
వలయు సుఖముల సమకూర్చు వాడు నతడె
ఒరులతో మాకు పనియేమి? సిరి మగండె
(1) ప్రభువు మాకని భక్తులు ప్రస్తుతింత్రు; ౯౪

నల్లని నవ్య నీరదపునా
ణ్యత మీరిన సౌరువాడు; సం
ఫుల్లసితాబ్జ పత్రముల
బోలిన మేల్కనుదోయివాడు; సొం
పిల్లగ జల్లనౌ మిసిమి
వెన్నెల జిల్కెడి నవ్వు వాడు; రం
జిల్లు కృపాసముద్రుడగు
శ్రీగిరి నాథుడె మాకు రక్షయౌ ౯౫

శ్రీదీవ్యచ్ఛుం శేషశైల గిరిపై
జెన్నొందు వాడర్మిలిన్
శ్రీదేవీ సహితాంత రంగుడగుచున్
శ్రీభక్త మందారమ్మై
శ్రీదీవ్యచ్ఛుభమంగళంబుల సదా
శ్రేయస్సులన్ గూర్చుచున్
ప్రాదుర్భూతకృపా కటాక్షములతో
పాలించు మమెప్పుడున్ ౯౬

నీ పద శ్రీకి దాసునై నిలిచి యున్న
నేను నీవాడననుచు నన్నెంచియడుగు
వాని కభయంబులిడు చునౌ వ్రతములనుటె
చెప్పుకున్నట్టివాడు మా శ్రీశుడితడు; ౯౭

పెబువు మాకనిపామరుల్ పెర్మిగొల్త్రు

మిత్రతన్ గోరినన్ జేరి మెలగువాని
దురిత మున్న గణింపక దరికి జేర్చి
వేడకన్ బ్రోతు నేనని విశదపరుచు
వెంకటస్వామి మా ఇంటి వేలుపనుచు ౯౮

శ్రీమదన వద్య శేషగిరీంద్రుడైన
శ్రీ శ్రీయః పతి కరుణతో చెలువ మలరి
ఇంతి పద్మావతీ యలమేలు మంగ
డెందములనేలువాడు మాబంధువతడు ౯౯

శ్రీకళ్యాణ గుణాభిరామ విభవ
    శ్రీ మత్కృపాంబోధియౌ
శ్రీకాంతా కమనీయ కౌస్తుభలస
    చ్ఛ్రీ వత్స వక్షస్థళుం
డీకారుణ్య రసార్ద్ర మానసుడు ప్రౌ
    ఢిన్ వెల్గి శేషాద్రిపై
మా కాదోషము పెట్టి సంపదల పెం
    పందించు మా తండ్రియై ౧౦౦

శ్రీరమణుండు, చారుతుల
    సీదళ దాము డుదారుడా శ్రితో
దారుడు; ధర్మరక్షకుడు;
    ధర్మచరిత్ర పవిత్రమూర్తి, శృం
గార గుణాభిరాము డురగ
    గాచల మందిర సుందరుండు, వం
దారుజ నాశ్రయుండు; మము
    దాల్చిన వేంకటనాథుడే లతన్ ౧౦౧

భవ్య! మంగళకర! చారుదివ్యమూర్తి
సాధ్వి! పద్మావతీ! పద! సాదసా శి!
నవ్య! నీరద ! నీల! సుందరుడవైన
ప్రభువు! శ్రీపతివేంకటపతియెమాకు! ౧౦౨

వినుత ముఖ ప్రయోగ విధి
విజ్ఞులు భాగవతోత్తమోత్తముల్
ఘనులు ప్రపన్న నూరిజన
గౌరవనీయులు సేయు యజ్ఞ సం
జనిత హవిస్సులంది సుర
సంఘము దిక్పతులాది ముఖ్యులీ
యన ఘుని వేంకటేశ్వరుని
యాశ్రిత భక్తులు గొల్చిరీవిధిన్ ౧౦౩

ఈ శుభబ్రహ్మోత్సవాల ముగింపువేళ
ఒప్పు శ్రీ పుష్పయాగ మహోత్సవమున
దేవతోద్వాస నాది సద్విధులు ముగిసే;
అవభృత స్నానమటుపైన నమర జరిగె !, ౧౦౪

స్వామి బ్రహ్మోత్సవాది దీక్షా విశేష-
మవభృత స్నానమున విరమణము సేయ
భక్తులా స్వామితో పాటు భక్తిగలిగి
జన్మతరియింప స్నానముల్ సలిపినారు ; ౧౦౫

అరయుగ జాల మింద్రియజ
యంబుల; నాశల ద్రెంచలేము, పెం
దురునగు షడిపూగ్రతల
ద్రుంచగలేము; భవంబునీదగా

బరగెడు శక్తిలేదు; వెర
 వా! గనలేమిట; దిక్కు నీవె; శ్రీ
ధర ! కడలేర్తు నీవాయని
 దాస్యత బల్కిరి భక్తు,లర్మిలిన్ ౧౦౬

(తెప్పోత్సవము)

పరమ పవిత్రమై విబుధ
 వైభవ కోటికి నాలవాలమై
పరమగు భోగ భాగ్యమిడు
 స్వామి సరస్సున పూర్ణ తీర్థమం
దిరుదెసలం జెలంగి విను
 తించెడు రాణుల నోర జూచుచున్
మురియుచు తెప్ప వేడ్కలకు
 మోహనుడై హరి సాగె కూర్మినన్, ౧౦౭

భక్త సుజనుల డెందముల్ రక్తి గలిగి
మిగుల నాకర్షణంబయి సొగసుమీర
స్వామి తెప్పోత్సవంబులు సాగె; చూచు
వారి జన్మలు ధన్యతన్ వరలె మిగుల ౧౦౮

చంచలమైన చిత్తమున
 చక్కని విద్యల సార సంపదన్
అంచిత శాస్త్రతాత్వికర
 హస్యములన్ గనజాలలేవి మ
న్నించని నాస్తి కాళికిల
 నింతగ తెల్యదు దైవలీల; ని
న్నెంచి త్రిశుద్ధితో గనగ
 నేర్చిన వాడిట పావనుండగున్, ౧౦౯

అనుచు భక్తులు భక్తి తత్పారవశ్యులయ్యి
పూని శ్రీ శ్రీనివాసు తెప్పోత్సవముల
కనుల పండువసేయగా గాంచినారు
వినతులిడి నారు శరణని వేడినారు, ౧౧౦

( ఉంజిలుత్సవము)

శ్రీ శ్రీనివాస! ఓ శ్రీచిద్విలాస!
శ్రీశేషగిరివాస! శ్రితజనపోష!
కారుణ్య పరిపోష! కమలాలయేశ
చారుత్వ శృంగార సౌందర్యవేష!
ఊగరా! యెద గూర్మలుప్పొళ్లలూర
ఉంజిలి నూగరా! ఓదయోదారా! ౧

౨. మన్మథ మన్మథా! మాన్యముకుందా!
మన్మనోహితనాథ! మధురగోవిందా!
మహిత విశ్వవినోద! మధురాధినాథా!
విహిత ధర్మవినాద! వేద వినోద! ౨

3. ఒనర బ్రహ్మాండమే యంజలిగాగ
అనఘ వేధములు సూత్రంబులుగాగ
మెండైన విధులు పూదండలుకాగా
దండికావ్యములు సత్ఫలములుగాగ
వుయ్యాల జంపాల లూగరా స్వామి!
పయ్యాడు సిరులతో సాగి రావేమి 3

౪. కలికి తనంబుల కలువ కన్నూపు
చిలిపిదనంబుల సిగ్గుకన్నూపు
మురువుగొల్పెడి మేటి - మరుతూపు చూపు
విరబూసి కోర్కెలింపె దగిన చూపు

దొరలాడ శ్రీదేవి మురసి తానూప
మరునయ్య! ఊగరా! మదిబేర్మితోప ౪

౫. బిరుసుపాలిండ్లపై సరములేయాడ
దొరలినెన్నుదుట క్రొంజిరు చెమటాడ
బాహుమూల ప్రభల్ - బలిసి సయ్యాడ
సోహ మే నని యెద - సోలుచు నాడ
కువలయేందిర చీరకుచ్చిళ్ళ విదల (1)
స్తవములనూపె నూగవేస్వామి! మిగుల (2) ౫

౬. కలరమ్య కంకణ క్వణ నిక్వణంబు
మలయుజ పవనాన - మసల మణీంతంబు
కల కంఠకలరమ్య - గళ గీతికంబు
కులుకు ముగుదతనమ్ము - లలరె డెందంబు
మరుని చిల్కలకొల్కి - మగువనీళమ్మ
మురిసి యూ పెను యూగు మురః స్వామి! నెమ్మి ౬

జలజాయ తేక్షణా కలితు లొమేటి
లలన లెందున సాటి రానట్టి బోటి
అలరు విల్తుని ముద్దులలరుపూబోటి
లలితాల వాల యా - రాధావధూటి
కలరమ్య మోహన గానాలతోడ
గళమూపి యూచె యూగర వేల్పురేర! ౭

అలవిల్లి పుత్తూరు తులసీ వనాన
జలధిజ గోదగా జనియించి యైన
ఇలవట పత్ర శాయిని గొల్చి గాన-
మలర శ్రీ గీతికా మల స్మూక్తులీన

పలుతీరు కూర్మి పెంపులనూపె స్వామి!
వలరాజ గోపాల విభు! యూగవేమి? ౮

౯. సాకూత సరసవాక్చాతురీ మతులు
గోకుల వాసులౌ గోపికా సతులు
మధురాను రాగాలు మదిని పెల్లుబుక
సుధ లూరు సంగీత సూక్తులింపొలుక
లాలి పాటల నూప లాలింపులలర
లీల వేంకట గోపబాల! యూగుమురా! ౯

అలసురుల్ నిత్యసూరులు దిశాంపతులు
సులలిత భవదీయ సూక్తి సంస్థితులు
తెలియ నిన్ మదిగొల్చు ధీమతాంవరులు
పలుతీరు స్తుతియించు భక్తి తత్పరులు
కలకంఠులమరాంగనలు నూప సఖుల -
గల సియూగుమురా వేంకటరాయ ! మిగుల ౧౧౧

అనుచు పాడుచు నాడుచు ఘనత మీరు-
పరమ భాగవతోత్తముల్ భక్తి గొలువ;
స్వామి వారికి నుంజిలుత్సవము జరగె
పరగ గనువారి కన్నుల పండువయ్యె ౧౧౨

(ఏకాంత సేవామందిరము)

చక్కని నిల్వుటద్దములు
చల్వల పందిరి ధూప దీపముల్
అక్కున జేర్చుకోదగిన
యందపు మల్మలు దిండ్లు; మెత్తనౌ
మక్కువ పూల పాన్పు నును
మక్కిన తీరగు పండ్లు పాలు; సొం

పెక్కిన పైడి మంచము త
మింగలి గించు మిఠాయి పల్లెముల్ ౧౨౩

చొక్కిల జేయు చందనము
జుమ్మనిపించు పనీరులత్తరుల్
నిక్కపు కప్పురంపు నిండు విడెమ్ములు; చిత్రవుల్;
మిక్కుట మౌ జవాజి నును
మేలిమి కేసరి పున్గులెల్ల
జెక్కుసుంగధ వస్తువులు
చిత్రములున్ పరదాలు కూర్మినన్- ౧౨౪

అందముగ జేర్చి యేకాంత మందిరమును
సుమశర స్వామి కూర్మల సొగసులీను
మమతలను దేల్చునే కాంత మందిరముగ
దిద్దితీర్చిరి వేల్పుల ముద్దరాండ్రు, ౧౨౫

మోదమలరగ వేల్పు ముత్తైదువులును
పరగ కాన్కల నిడి శ్రీనివాస పతిని
మందిరమ్మున జేర్చి శ్రీమతుల నపుడు
స్వామి పదసన్నిదిన జేర్చి పాడి రెలమి ౧౧౬

(ఏకాంతసేవ)

బ్రహ్మాండ బాండమున్ బంగరు బొజ్జలో
నిదురింపగా జేసి ముదముమీర
పవళింపు మాయయ్య! పవళింపరా స్వామి!
వటపత్రశాయి! పూ పాన్పునొదిగి
పడతులిద్దరు పేర్మి పాదసేవలుసేయ
వలపులు గులు కాడ చెలిమిజూపి

పాలారగించి మేల్వల పాలారగింప-
రా! స్వామి! సతు లను రాగమిడగ
చెలులునందిడు శృంగార సీమలందు
దివ్యదానంద జలధుల దేలియాడి
చెలువ మలరుము; కల్యాణ శ్రీనివాస!
శ్రీ సతుల్ గొల్వ నేకాంత సేవలందు; ౧౧౭

అన్నుల మిన్న యౌనల మేలు మంగకు
ఆలవోకగనైన లీలనైన
కలిగింపకదురులనలు కరానివ్వకు
గడుసరి తనముల దుడుకునిడకు
అలరువిల్తుని పూలకన్న మిన్నగనున్న
నునుమెత్తనైననెమ్మనముగలది
కలుముల జవరాలు కడలి ముద్దుల పట్టి
1. శ్రీదేవి కేలీరు చేత మదర
చెణుకు దనములు దడు చెదురుముదురు
చురుకు చిలిపి దనంబుల జూడబోకు
ఉలుకు రానివ్వక తివల నలరజేసి
యేలుకొనుమయ్య! జగములనేలు, స్వామి! ౧౧౮

ముగుద; యందున సుకుమారి; సగమువిరిసి
విరియ జాలని వలపులవెలది, ఆకు
చాటు పిందెగ బెదిరిన చక్కనైన
చుక్క పద్మావతయ్మ నీ చక్కినలరె; ౧౧౯

లలిత లలనా జనాపాంగవలిత మృదుల
మధుర మానస యలమేలు మంగ యనుచు

(1) పద్మావతమ్మకు భయములెదగ

నెరిగి; దూకెడు చిపిన నెగరబోకు
సరతల నేలు ముదితల మురియజేసి ౧౨౦

పరమ రసికాగ్ర గణ్యుడవనుచు మెచ్చి
ఈ సతుల బేర్మి కల్యాణ మెసగజేసి
ఇచ్చి మీకప్పగించితి మిచ్చలలర
చెలిమి నలరించు శృంగార శ్రీనివాస! ౧౨౧

(1) పద్మావతమ్మకు భయములెదగ

ఓ శ్రీవెంకటరమణా! శ్రీనివాస!

ఈ బేల లందిరా బాలలు మాయింటి
కొమ రొప్పు ముద్దుల కూనలయ్య
అన్నెముల్ పున్నెములరయంగ జాలని
అద్దంపు మనసున్న ముద్దరాండ్రు
ఇల్లును దాటి వేరిల్లు నెరుంగని
అమ్మ కొంగులచాటు నలరువారు
తలిదండ్రి యొడిలోన దారాడుటేకాని
మా యమాటరెగని మతులు వీరు
పేర్మితో బెంచి యిన్నాళ్లు పెద్ద జేసి
కేల నిడి నాము; తాల్మితో జాలిగలిగి
రసికతలనేలు వెంకటరమణ మూర్తి!
పాలనీటన ముంచ నీభారమయ్య! ౧౨౨

పేర్మి నవమాసములు మోసి పెద్దచేసి
కడుపుతీయని పంటల నిడితిమయ్య!
పూని సంబ్రాన నేలిన పూలగంప
రసికతల నేల కున్నను రాలగంప ౧౨౩

నియమనిష్ఠల సద్ధర్మ. నీ రతి వెల్గు
నమ్మి నిన్మది సంయమనమ్ము నమరి
సాగు మమ్ముల సహృదయ స్వాంతుడవయి
కరుణ గని శ్రీల నేలుము పరమ పురుష! ౧౨౪

అస్తు శుభములు మీకు మీయ తివలకును
విశ్వకుల దీపకులు నౌచు నుర్విలోన
పూర్ణ వసుధైక సత్కుటుంబులుగ మీరు
త్రిభవన ఖ్యాత కీర్తిలో దేలుడె లమి ౧౨౫

ఓ కల్యాణ నవ వధూలక్ష్మలారా:-

శ్రీలనిడువాడు శృంగార శ్రీనివాసు
డమృత హృదయుడు నాశ్రిత సుమతిజనుల
బ్రోచు మావాడటంచు తెంపూని నతని
చులుకనగ జూడవద్దమ్మ సుధతులార ! ౧౨౬

మాపెరటి తోటలో పూయుమధురమైన
ముద్దుదొంతర మల్లెలన్ ముద్దులాడు
గండుతుమ్మెద మాదని కసురుకున్న
మూతి వాయగ కుట్టునో ముదితలార ! ౧౨౭

శ్రీమధురైకనామ గుణ శీలుడు
పావన సత్య ధర్మ దీ
క్షామహనీయ మూర్తి; వర
సాధుజనాదర ణీయ కీర్తి; వి
శ్యామల శ్రీమనోహరుడు;
శాశ్వితు డుజ్జ్వల చక్రవర్తి; మా
స్వామి, దయామయుండు, మిము
చల్లగ, నేలును శ్రీనివాసుడై, ౧౨౮

ఈ శేడె యల నాడు నెగసి నరసింహుడై
దుర్దైత్య నాయక ధూర్త్రువణవె
ఈ స్వామి దశరథ శ్రీస్వామి యొనలేని
యజ్ఞ సంజాత పుత్త్రైక ఫలము
ఈ దివ్వెడల యశోదా దేవి ముంగిట
దారాడు మురువు ముత్యాల మూట
ఈ చందమామ యోగీంద్రాది మౌనుల
యెదకల్వసిరి పేర్మి కింపు బంతి
చల్లనౌ నమృత ము ప్పొంగు నుల్లమలరు
వెలుగు వకుళమ్మ కూర్ముల (1) పెద్దబిడ్డ
భక్తజన కల్పతరువైన కలిమి దొడ్డ
మీ మనస్సుల మురిపించు మిసిరిగడ్డ; ౧౨౯

దాసివలె మంత్రి తీరున తల్లివలెను
లక్ష్మివలె వసుధతీరున లక్షణైక
దివ్య సౌందర్యవతివలె దేవదేవు
నెంచి సర్వైక విధుల సేవించుడమ్మ! ౧౩౦

౬ స్వామీ స్వామినులారా: -

పెద్దలు తీర్చిదిద్ది తగ
బెంచిన ధర్మపథాల గాచుచున్
నిద్దపురాగ డోలికలనె -
మ్మిన నూగుచు భవ్య సౌఖ్యముల్
తద్దయు దేలి సర్వజగ
దాశ్రయ జీవుల (2) కన్నవార
దిద్దుచు నేలుకొండు. జగ
దీశ్వరులై కరుణాంతరంగులై ౧౩౧

(1) పెంపుబిడ్డ (2) తల్లిదండ్రులై

అనుచు నాకాశ రాజులో వధిపులెల్ల
మహిత దివ్యాధి కారిణుల్ మగువలెల్ల
పెద్దముత్తైదువులు భక్త వితతులెల్ల
విభుని యేకాంత సేవ సేవించినారు; ౧౩౨

అలరి వేల్పుల ముత్తైదువులు మనోజ్ఞ
మైన సరసోక్తులెదగ శ్రీ శ్రీనివాసు
చెలిమి నొలకించు నేకాంత సేవలపుడు
అరచు కన్నులు చాల వన్నట్లు విరిసె ౧౩౩

(మంగళాశాసనము)

ఎదలను మేల్మి హొ ప్రమిద
లేర్పడ గూరిచి; కూర్మివత్తులన్
మెదలగ జేసి; భక్తిని దమిం
గడు నేయిగ బోసి; జ్ఞాన మిం
పెదగెడు జ్యోతిగా మిగుల
వెల్గగ; మంగళ గీతులర్మిలిన్
మధువుల బాడుచున్ హరికి
మంగళ హారతులిచ్చి రంగ నల్ ౧౩౪

స్వామి! మంగళములు శ్రీనివాస! మీకు
రాణువ ము గుల్కుమీ కూర్మి రాణులకును
భవ్య భవదీయ కల్యాణ వైభవముకు
మహిత బ్రహ్మోత్సవములకు మంగళములు ౧౩౫

అని సతులు భక్తులును సేస బ్రాలు జల్లి
పేర్మి దేవేర్లతో గూడి వెలుగుచున్న
శేషఫణి తల్పశాయియౌ శ్రీనివాస-
విభుని నతులిడి భక్తి సేవించినారు, ౧౩౬

ఎంతటి పూర్వ పుణ్యములు
నేర్పడి యున్న కతాన; స్వామిశ్రీ-
కాంతుని యుత్సవంబులను
కర్మ లతా కలితైక బంధమా
సాంతము ద్రెళ్ల; భక్తహిత
సాధులు జూచి తరింతు రందు నే
కాంత మహోత్సవంబు కలి
కల్మష మూడ్చును నిశ్చయంబిలన్, ౧౩౮

వేల్పు ముత్తైదువులు భక్త విబుధులెల్ల
స్వామి బ్రహ్మోత్సవములకు వచ్చినట్టి
పెద్ద పెద్దలు నీ తీరు వేడ్క మీర
వినతులై శ్రీశు నపుడు సేవించినారు ౧౩౯

(1) పరమ వైఖాన సాగమ పండితాళి
పదము క్రమ జట ఘనముల వరల జేసి
వేద పనసల సుస్వర విధులు నమర
శ్రీనివాసులకు మహదాశీస్సు, లిడిరి ౧౪౦

మీకును; మీ తనూ విమల
మేదుర లక్ష్మికి; మీ ప్రియార్హులౌ
మీ కమనీయ లక్ష్ములకు;
మీ యుభయప్రద హస్తశోభకున్
శ్రీకరవైన కౌస్తుభపు
శ్రీకిని; శంఖరథాంగ దీప్తికిన్;
మీకగు వైజయన్తికి; స
మీకృత మంగళ మెప్పు డెప్పుడున్ ౧౪౧

(1) మహిత శ్రీపాంచ రాత్రాగమార్యబుధులు

మీ పదపద్మ సంపద క
 మేయ మనోహర రత్నమౌళికిన్
మీ పలుతీరు సంపదకు
 మేలగు మీ లలితేక్షణాలకున్
మీ పరివార కోటికిని
 మీ విహితార్చక పాచకాదికిన్
మీ పదదాసదాసులకు
 మేలిమి మంగళమౌత! యెప్పుడున్ ౧౪౨

నూతన జలధర శ్రీతతి చెలువారు
 నీలాతసీ సుమ నీలతనుడు
బిరుదైన దనుజాల పీచము నణ చెడు
 చుట్టుకైదువుగల జట్టి జోదు
అరివీరగజముల నదరింపజేయు స
 వ్వడు లేను శంఖమున్ వరలువాడు
పిలిచిన నోయని పలికి యార్తుల నెల్ల
 నభయ ప్రదుండుగా నాదువాడు
ఎంచి భక్తుల మొరల నందింపజేయు
లక్ష్మి కిరవైన కౌస్తుభ లాలితోరు
చారు వక్షస్థలుండు మా స్వామి యెపుడు
మహిత కళ్యాణుడౌచు మమ్మరసి బ్రోచు, ౧౪౩

కరిరాజ వరదుకు గరుడ సద్గమనుకు
 మా శ్రీనివాసుకు మంగళములు
1. దాక్షిణ్య లధికి దయగల తల్లి!
 మాన్య శ్రీ పద్మకు మంగళంబు

1. దాక్షిణ్య గుణవల్లి దయగలతల్లి పద్మావతీ దేవికి మంగళంబు

కరుణాయతాలోల కమలాక్షి యల మేలు
మంగమ్మ తల్లికి మంగళములు
శ్రీ తజనా వాసమై వితత విఖ్యాతమై
మసలు శేషాద్రికి మంగళంబులు
శ్రీ శ్రీయః పతి పాదాబ్జి శ్రీల కెపుడు
మహిత కల్యాణ వైభవ మంగళంబులు
స్వామి నెదనమ్మి కొలిచెడి భక్తతతికి
మహిత వేంకటపతి కృపా మంగళములు ౧౪౪

ఆలయాచార్య వర్యుల కర్చకులుకు
ఘన గుణాఢ్యులు ధర్మాధి కారులకును
భక్త జనులకు వైష్ణవ స్వాములకును
మాన్య జనులకు కల్యాణ మంగళములు ౧౪౫

(ఫలశృతి)

అవని శ్రీపతి బ్రహ్మోత్సవాలు నెచట
జరుగుచుండు నాయచ్చోట శాంతిశ్రీలు
సత్య ధర్మైక సంపదల్ సస్య వృద్ధి
మసల వెల్గెడు వసుధకు మంగళములు ౧౪౬

కలియుగ మందు నెచ్చట న
ఘాపహమౌ హరివైభవోత్సవం
బలరునొ; యచ్చటే పరమ
వైభవల లక్ష్మలు పాడి పంటలు
చెలువము లీన గల్గు; నట
శ్రీపతి సత్కరుణా కటాక్షముల్
కలిగి కలిన్ హరించుచు సు
ఖంబుల గూర్చుమ సజ్జనాళికిన్ ౧౪౭

పెండ్లిగాగం కన్యలు విమల భక్తి
బరమ పురుషార్థములఁగోరు భక్తులిటులఁ
శ్రీ శుకల్యాణ వైభవ శ్రీలనోర్మి
మండలమితంబు పఠియింప మంగళమగు ౧౪౦

స్వస్తియగు గాత! ప్రజకు సత్ప్రభుతకెల్ల
న్యాయ ధర్మానుసారులౌ నాయకులకు
గోద్విజాళికి సజ్జన కోటి కఖిల
విశ్వమునకౌత శుభములు విరివిగాను;

ఇయ్యది

శ్రీ శ్రీనివాస దివ్య కళా వైభవంబను ప్రబంధమ్మున
శ్రీ శ్రీనివాస దివ్యకల్యాణవైభవంబను పంచమసర్గము
సర్వస్వము శ్రీశేషాచలాధి వాసుండైన శ్రీవేంకటే
శ్వర స్వామివారి దివ్యపాదారవిందయు
గ సన్నిధిలో సమర్పితమౌచు ముగిసినది

ఓం తత్సత్

-: శ్రీ శుభం భవతు :-

శ్రీః
శ్రీహయగ్రీవాయనమః
శ్రీసరస్వత్యైనమః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణేనమః :-

# శ్రీ శ్రీనివాస ఉదాహరణవైభవము :- షష్ఠసర్గము :-

## వినతి

**హయగ్రీవస్వామి :-**

శ్రీమదనవద్యశరదభ్ర శీతకిరణ
దివ్యధావళ్య సౌందర్యదేహు డనఘు
డాదిమధ్యాంతరహితుడు వేదవేద్యు
డురుదయాంబుధి, మదివెల్గు తురగముఖుడు ౧

జ్ఞానసౌందర్యవైభవస్వామియైన
పూర్ణశరదిందు మండల భూషితుండు
స్ఫటిక దేహోజ్జ్వలుండు శ్రీసాధ్విహితుడు
శ్రీహయాస్యుడు మన్మది జేరి వెలుగు ౨

శ్రీహయగ్రీవ ! శ్రీహయగ్రీవ ! యనుచు
ఎవడు త్రికరణ శుద్ధితో వెదగి పలుకు
వాని వాక్తతి గంగాభవాని గాదె?
అనుచు నెఱనమ్మి శ్రీశుహయాస్యుగొలుతు ౩

**వాగ్దేవి :-**

లలిత శరదిందు సుస్మేరజలజముఖివి
వికసితోత్పలనయనను సలక విద్య
లకుమ నెలవైన పలుకుల లలన నెదుట
విలిపి కొలిచెదనరవింద నిలయనెపుడు ౪

శ్రీతరుణీశుడౌ హరిని;
శ్రీశుక వాణిని; విప్రసేమునిన్;
మాతులుడైన మద్గురుని;
మాతలిదండ్రుల; దేశికార్యులన్
అతత కీర్తి మూర్తులగు
నార్యుల పూర్వకవీశ్వరార్యులన్
చేతమునందు గొల్చుచు ర
చింతు నుదాహరణైకసత్కృతిన్, ౫

మార్గదేశీయ కవితానిసర్గ విబుధ -
వివిధ కవితావతంసులన్ విమలభక్తి
భావమున గొల్తు వినుతసద్భావకవుల
విహిత సంగీత సాహిత్యమహితబుధుల, ౬

పరమసహృదయ సాహితీబంధువులను ;
మార్గదైశిక వరగేయ మధురభావ
వచనకవితాది సత్కళాపరుల నెల్ల
సతతమెదనిల్పి సద్భక్తి సలిపి గొలుతు, ౭

బాసలకెల్ల తల్లియయి
పర్విన వేలుపుబాస నీ యిలన్
వాసిగ తేట తేనియలు
వారుచు వెల్గెడు చక్కనైనమే
ల్బాసగు తెల్గుబాస నెద
బాయక గొల్చుచు (1) తల్లి దేశమున్
భాసుర భారతావనిని
ప్రార్థనజేసి కృతిన్ రచించెదన్ ౮

1. తెల్గు

రక్తి కవులను సాధుసద్భక్తి కవుల
ముక్తి కవులను సత్ప్రజాశక్తి కవుల
శ్రీమదనవద్య గుణ రససిద్ధికవుల
చిత్తమున నెంతుసత్కావ్యసిద్ధికొఱకు ౯

హరిపదాబ్జములను వరలగా సద్భక్తి
బరగి చేయుస్తుతుల ఫణితిలోన
నెదగి మిగుల నొప్పె నీయుదాహరణమ్ము
లనుచు పూర్వకవికులమ్ము పలికె. ౧౦

మరుగుపడుచునున్న మహనీయమైన నీ
మార్గముద్ధరింపమనసు గలిగి
ఎదన భక్తి నిలిపి యీయుదాహరణాన
పలుక నెంతు శ్రీనివాస విభుని, ౧౧

అరయ నీకవితకు నాద్యులై పాల్కుర్కి
సోమనార్యబుధుడు సూరినుతుడు
వినుత తాళ్లపాక పెద తిర్మలార్యులు
వరలిరనుచు కవులు ప్రస్తుతింత్రు ౧౨

మహిత మధుర భక్తి మాన్యమీమార్గము
మరలవిరియజేయుమనసు పుట్టి
శ్రీనివాసవిభుని శ్రీవైభవంబును
ఈ యుదాహరణము నెన్ని వ్రాతు ౧౩

శ్రీనివాసుని కల్యాణ సేవలందు
కడుపొగసులూరు చిన్నని కాన్కగాగ
అర్పిడితివి యీ యుదాహరణకృతిని
కవిత నా జన్మ ధన్యమై ఘనతగాంచ ౧౪

స్వామి కల్యాణ వైభవోత్సవములందు
భక్తి మీరగ నీకృతిన్ శక్తి కొలది
రక్తితో వ్రాసి సేవానురక్తి గలిగి
శ్రీశు కర్పించి భవము తరింతునంటే. ౧౫

శ్రీః

శ్రీహయగ్రీవాయనమః :-
శ్రీసరస్వత్యైనమః :-
శ్రీశ్రీనివాసపరబ్రహ్మణేనమః :-

# శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవము
# శ్రీ శ్రీనివాస - ఉదాహరణ వైభవము

## షష్ఠసర్గము

**ప్రథమావిభక్తి :-**

శ్రీ యనవద్యమౌ కరుణ
        జిల్కెడు చల్లని చూపు జల్లిపెం
పైయలరార లోకముల
        పాలన జేసెడి వత్సలాత్ముడా
పైయిల భక్తసంతతిని
        బాయకనేలెడి కన్న తండ్రి, మా
శ్రీయలమేలు మంగపతి
        శ్రీగిరిరాట్పతి బ్రోచు మమ్ములన్

**కళిక**

మౌనిలోక హృదయ పద్మ
        మాన్యబాలభాస్కరుండు,
దానవాది కుమత ధూర్త
        దాహకవైశ్వానరుండు
ఐహిక సుఖదుఃఖ బంధ
        నాలసడల జేయువాడు
విహిత దివ్య భవ్యసౌఖ్య
        వితరణాంఘ్రియుగళివాడు
అహరహమ్ము భక్తజనుల
        నహయహమిక నేలువాడు

బహుళ శుభగుణాకరుండు
భవభయముల బాపువాడు
శ్రీహితు డనవద్యభక్త
చేతసములనుండు వాడు
ద్రోహులైన రక్కసులను
దుర్బలులను జేయువాడు

**ఉత్కళిక**

బహుసహస్రనామవర్తి
మహిత ధర్మ విజయమూర్తి
దివ్య విమత రమ్య కీర్తి
భవ్యభక్త వరద వృత్తి
పరమ శిష్ట జగతినేలు
కరుణ లున్న హృదయ శీలు
డనుపమసుగుణాలవాలు
డనిశము శ్రితలోకపాలు
డనగవెల్గు వేంకటపతి
తనరవెల్గు శ్రీగిరిపతి
ఘనుడు శ్రీనివాసవిభుడు
అనిశము మన్మది లసితుడు

**ద్వితీయావిభక్తి :-**

శ్రీకరుణార్ద్రమానసుని ;
శేషగిరీంద్రుని; శ్రీనివాసునిన్,
ప్రాకట మొప్పభక్తులను
వత్సలతన్ కరుణించు భూపతిన్,
మాకగు కొంగుబంగరపు
మాన్యుని; సజ్జనకల్ప భూజునిన్,

శ్రీకమనీయ శ్రీపతిని;
జేర్చియెదన్ నతిజేతునర్మిలిన్

**కలిక**

ఉరగధరాధర సుందర మందిర
మునజెలు వారెడు కొండలరాయని;
సిరికిరవైకడు సొగసగు కౌస్తుభ
మురమునమురిసెడి సోగులరాయని,
శంఖము చక్రము మేల్తిరునామము
చక్కని మకుటము గలసిరిరాయని;
శృంఖలసముదుర్భవహారపదముల
జెల్వగుటందెల సందడి వానిని;
చెక్కరవిర్ధోర సోకులమీరిన
చక్కందనముల చుక్కలరాయని;
దిక్కరినమ్ముచు దరిజేరగను
ధీనుల దిక్కయినిలిచెడివానిని;
భక్తుల బాధలపిలుపులనేలెడు
భావముగల్గిన పండితరాయని;
రక్తిన శ్రీగరుడాచలవరమున
రంజిలు శ్రీశుని వేంకటరాయని

**ఉత్కలిక**

కరుణలువిరిసిన
సరసహృదయుడన
అగణితగుణగణు
లగు భక్తులగన;
జ్ఞానులు బొగడగ
దీనులు దలువగ

యోగులు గొలువగ
భోగులు ముదముగ
పలునుతిసేయుగ;
కొలువగు వానిని;
పిలిచిన పలికెడు
కలుములరాయుని;
మానకగొలిచెద
శ్రీనయ సామిని
చెలువగువానిని
దలచెద శ్రీశుని

**తృతీయావిభక్తి**

శరణ ని వేడి చేరుకొని
  స్వాంతమునన్ గడు భక్తిమీర పా
మరులగు భక్తులార్తి నెద
  మానని బాధలబిల్వ;నో యటం
చరమరలేక సత్కృపలు
  సాగగ వారల బ్రోచుతండ్రియా
సిరిదొరచేత రక్షణల
  జెందవె చిత్తమ! వానిసత్కృపన్.

**కలిక**

కరుణలెద గులుకాడు
  కమలాధవుని చేత
హరిహరాజులకెల్ల
  వరదుడా విభుచేత
శేషగిరి వాసుడా

చెన్నరాయని చేత
దోష సంతతిని బో
దుడుచు ధీరుని చేత
వరకృపామతి భక్త
పాలుడగు ప్రభుచేత
ఉరుతరైక దయా ప
యోదియగు హరిచేత
వీరశృంగారాది
విబుధుడౌస్మరుచేత
కూరుముల్ గలమేటి
కొండరాయనిచేత
పేరిమిన విశ్వాస
వెలుగు సరసుని చేత
చేరుకొని వేడు నను
జేదుకొను విభుచేత.

ఉత్కళిక

లేములను దొలగించి
కామితము లిడిపెంచి
భావముల విరియించి
శ్రీవిజయమలరించి
భక్తులను మురిపించి
ముక్తిపథమందించి
వరలు సిరిదొర చేత
మురియు ధర దయజేత
వినుత సుజనుల జేత
వినుతిగొను విభుచేత;

కరుణించి ననుగాచు
కమలాధవుని చేత
పరిరక్షణలు గాంచి
ధరవెలుగు కృపచేత
శరణన్నవారలిల
తరియింత్రు సిరిచేత.

చతుర్థీ విభక్తి

హరహర దేవతాదులు న
హర్నిశమెవ్వని సత్కృపార్థులై
పరమతపోధనాఢ్యులయి
ప్రస్తుతిజేయుచు గొల్చుచుందురో
నిరుపమ భక్తితత్పరులు
నెమ్మది నెవ్వనికై తపింతురో
కరుణను గోరి యవ్విభుని
కైమది నర్పణ సేతు నన్నుతిన్

కలిక

ఉరగాచల భాసుర చరణునికై
సిరిమేల్పదనీరజభృంగునికై
కరుణారసపూరిత నయనునికై
వరమౌనుల మానసనిలయునికై
దీనులునౌ భక్తుల మేరువుకై
దానవమత సంహరు ధీరునికై
శ్రీనవమృదుమానసహంసునికై
మానిత శ్రీగిరిమందిరపతికై
శ్రిత కింకర జనసేవిత విభుకై
నతులొనరించెదనావిహితునికై

**ఉత్కళిక**

సరసులు సుజనులు
పరమమునిజనులు
సురులుబుధవరులు
ఉరుతరసుగుణంలు
నిరుపమసుమతులు
సురుచిర హృదయులు
తరగని వినతులు
బరగిన కొలుపులు
వరలిన విమలులు
తిరమగు తలపులు
మురిపెపు సొగసులు
మురిసిన ముసిముసి
చిరునగవుల యెద
లొరసిన మమతలు
నురకల నలరుచు
విరియుచు గొలిచిన
సిరిదొరకై నతి
వరదునికై నుతి,

**పంచమీవిభక్తి**

మండితదర్మ తత్పరుడు
మాన్యుల భక్తులపాలిదేవుడై
అండని జేరుసజ్జనుల
నాదరమేర్పడబ్రోచు తండ్రియై;
దండిగవెల్గునిమ్మహిని
ధర్మజగత్పరి రక్షకుండునై

యుండినవానివల్ల విజ
యోన్నతిగాంచును ధర్మమిద్ధరన్

కలిక

ఏడుగిరులరేడయి యిల
నెదగి వెలుగు విభునివలన
ఆడయీడ యనక నంత
టమరి యున్న వానివలన
పిలిచినంత నోయటంచు
పలికిబ్రోచుప్రభువు వలన
కలతజెందుబీదసాద
కులము నేలు సామివలన
భవభయముల బాపి భక్త
వరులనేలు ఘనుని వలన
భువనములకు నేత యగుచు
నవని వెలుగుశ్రీశు వలన
పాపవితతినూడ్చి భూమి
భారమూడ్చెడీశువలన
ప్రాపుజూపి శ్రితుల గాచు
స్వామి శ్రీనివాసువలన
కరుణ లెదగరక్షణ గని
వరలు ధరణి కూర్మివలన
విరిసిన నా హృదయలక్ష్మి
పేర్మివెలుగు శ్రీశువలన

దుష్టజగతిని దునుమువాడు
శిష్టులనురక్షించువాడు
ఆర్త సుజనుల కండనిలిచి
ధూర్తకుజనుల దుడుమగలచి
విశ్వవిభుడని వినుతిగలిగి
శాశ్వతుండని చదువగలిగి
దర్మ పాలన దనర గలిగి
కర్మఫలములుగలుగకెదగి
పరగవెలసిన ప్రభువువలన
ధురము లడగగ మురుపువలన
ధరణి వెలుగు ను దారువలన
విరియు వేంకటవిభునివలన

షష్ఠీవిభక్తి

ఈ యతి సుందరైక భువ
        నేందిర మానసహంసుడెవ్వడో
మాయగజేసి పాపముల
        మాడ్చెడు శ్రీగిరికెవ్వడీశుడో
పాయని కీర్తి సంపదల
        వర్ధిలు నీభువనేశుడెవ్వడా
శ్రీయలమేలుమంగకగు
        శ్రీహరి కర్పణ సేతు మన్మదిన్

## కళిక

కమలాకుచకుంకుమభూషితునకు
కమలాయత కోమలలోచనునకు
సితభవ్యోల్లసదూర్ధ్వపుండ్రునకు
ధృతదివ్యోజ్జ్వల శంఖచక్రునకు
ఘనహేమదుకూలునకు ధీరునకు
అనఘోన్నతరత్నాంకమకుటునకు
స్మితసౌందర్య కళాఽననేందునకు
నుతదివ్యజ్జల జాంఘ్రియుగళునకు
ఉరగాచల మందిర సుందరునకు
పరమ కృపాళునకు భక్తసులభునకు
నిరుపమకరుణాఽనంద హృదయునకు
శరణాగతవత్సల సద్గుణునకు
వినుతులు మామక శ్రీనివాసునకు
వినతులు లక్ష్మి వేంకటవిభునకు

## ఉత్కళిక

హరిహరహితుడై
సురగణనతుడై
మునిజన నుతుడై
అనుపమగుణుడై
మనసిజవిభుడై
అభయ ప్రదుడై
విభవ ప్రభుడై
కలిసంహరుడై
ఖలభంజనుడై

భువనావనుడై
భవతారకుడై
తనరు శ్రీపతికి
వినతి భూపతికి

## సప్తమీ విభక్తి

పరమదయాంబు రాశియయి
భక్తులపాలిటి పాలవెల్లియై
విరిసిన భక్తవత్సలత
వెల్లువయైయెద బొంగువాడునై
గిరివరశేషభూధరుని
కీర్తిని బెంచుచు లోకపాలుడై
వరలిన శ్రీనివాసవిభు
పాదములందు వసించు చిత్తమా !

### కలిక

దారుణోరుభవజలధిని
దాటవేయు వానియందు
మేరలేని యహము నూడ్చి
మేల్మిత మిడు వానియందు
పరమమౌని హృదయజలజ
బాంధవుడగువానియందు
శరణమన్ననెవరినైన
కరుణనేలు వానియందు
శాత్రవదురిత మకరహనన
చక్రియైన వానియందు

దౌష్ట్య మౌఢ్య (1) తామసమా
    ర్తాండుడైనవానియందు
సుజన యోగి తతికి దేవ
    సురభియైన వానియందు
రుజనుబాపి భక్తజమల
    రూఢినేలువానియందు
ముదముమీరభక్తనుతుల
    మురిసిపోవువానియందు
ఎదునునిల్పిభక్తి గొలుతు
    శ్రీశుచరణ యుగళి నెందు

## ఉత్కళిక

శ్రీశ్రీసతి కైన వెల్గు
మాశ్రీగిరి వరమునందు
ధీరపరమయోగులందు
నోరిమిగల భక్తులందు
చేరినిలిచి పూజలందు
శ్రీరమహృదమాబ్జమందు
చేరి యాడి విభవమందు
శ్రీరమణుని పదములందు
కోరిమదిని నిలుపుకొందు
చారు విభవతతినిగందు
వానిదాసదాసులందు
నేనయితత్పదములందు
భావమలరభక్తినంది
సేవింతును సిరులబొంది

పావన సత్కారుణ లందు
జీవులపోషణ లయందు
నెరగు శ్రీనివాసునందు
ఆ విభుజలజాంఘ్రులందు
మదిని నిల్పి మసలు చుందు
ముదముగ తత్కారుణ లందు
సదమలమయునుతులనంది
కదలాడగగొలుచుచుందు

సంబోదవ

శ్రీరమణీయ శేషగిరి
శేఖర మందిర దివ్యసుందరా!
క్షీరపయోధిజామధుర
సేధితమానసరాజహంసమా!
మారమనోజ్ఞధీరసుకు
మారకుమారుని గన్న తండ్రి! శౌ
రీ! రసరాడ్పతీ! భువనశ్రీ
పతి! బ్రోవవె! శ్రీశ్రియఃపతీ!

కలిక

భక్తకోటులవేలు దైవమ!
ముక్తినిడుసత్పుణ్యధామమ!
సాధుసేవితసుగుణ మార్గమ!
వ్యాధి నాశక మహిత నామమ!
ఆగమేడితవిశ్వరూపమ!
యోగిమానసరాజ హంసమ!
భక్తజన హృత్పద్మ భృంగమ!

భక్తిరసమయజలధివాసమ !
తిమిర నాశక భానుబింబమ!
సమరదుర్జయ శౌర్యవిక్రమ!
భవ్య తిరుమలగృహనివాసుడ!
దివ్యకరుణాఽమృతపయోధుడ!
శరణ మంటిని శల్వరాయుడ!
కరుణనేలర! శ్రీనివాసుడ !

### ఉత్కళిక

స్తుతనతమతులను
సతతముదయగను
మదిగల వరదుడ!
ముదమిడు రాయడ!
సువిహితనుత శ్రీనివాస!
కవినుతపదకమలభాస!
దీనసుజన కల్పతరువ!
దానవఖలహరపరశువ!
విశ్వశుభంకరవేంకటలమణా!
విశ్వంభలసన్నుత శ్రీచరణా!
సంకటహరణా ! సాధువిహరణా !
పంకజనయనా! పావన చరణా!
మీకు నమస్సులు మాకు నుషస్సులు
శ్రీకరములు సఫలీకృతకరుణలు
కలుగగజేయుము చెలిమిన గావుము
విలువగువినుతల వినిమము బ్రోవుము
ఏడుగు కొండల రేడు నీవనుచు
వేడిన భక్తుల తోడు నీవనుచు

దయగల తల్లివి తండ్రి వీవనుచు
నయభయ భక్తిన నలరినాననుచు
ఆపత్సంపద నాడుకొందువని
నీ పదయుగ్మమునిల్పినామదిని
సర్వస్వమ్ములు సకలమునీవని
ఉర్విననీవే, యొరులిటలేరని
అన్యులు నాకిల నరయగ లేరని
ధన్యుడనైనిన్ దగశరణంబని
చేరవచ్చితిని శ్రీగిరినాయక!
కారుణ్యంబుల గావుము కొంకక
మీకు నతాంజలి మాకు కృపాంజలి
చేకొనుమీకవితా కమలాంజలి

**సార్వవిభక్తికవము**

నీవె జగత్త్రయంబులకు
నేతవు, నిన్నెద నమ్మినాను; నీ
చేవెలుగొందు విశ్వము, భ
జింతురు నీకయి యోగులాత్మలో
నీవలనన్ ప్రపంచమిది
నిల్చును; నీకిడినాను మన్మదిన్
నీవిమలాంఘ్రులందు నను
నిల్పగజేయుము శ్రీశ్రియఃపతీ!

**కలిక**

నాకు నీవె రక్షకుడవు
నమ్మినాను నిన్నుమదిని

నీకృపచే భువనంబులు
నిండివెల్గునెమ్మదిగని
వేచియుంటినీకైయిట
వేగరార! నీవలనన్
ఏచివెల్గుదాసజగతి
ఈశ్వర! నీకంజలింతు
నీయబ్జాఘ్రులయందే
నిలువజేయుమబ్జనయన!
ధ్యేయమెనీపైన నాకు
దీనపోష! శరణమంటి
పాయనునీ స్మరణనెందు
వరదుడ! నీదాసునందు
నో యిందీ వరనయనా!
ఓ కరుణామయసదనా!
ముక్తిగోరు జ్ఞానకర్మ
పూర్ణయోగి హృన్నివాస!
భక్తియోగరాజయోగ
భ్రాజితసన్యాసయోగ
బుద్ధియోగులకు బుధులకు
పురుషోత్తమప్రాప్తియోగ
సిద్ధిగూర్చి యిహపరస
చ్ఛీసిద్ధిని గలిగింతువు
వీరలనెల్లర దయతో
వెల్గియేలుచుందువెటులో
ఆరయనన్నటులగాంచి
యాశ్రితవత్సల! బ్రోవవె

శ్రీకరవృషశైలవాస!
    శ్రితపోష! వేంకటేశ!
నీకిదె నావినుతాంజలి
    చేకొను(1)మో శ్రీనివాస!

### ఉత్కలిక

వేదాతీతాతిసుగుణ!
విజ్ఞసుజన వినుతచరణ!
వేంకటగిరివరవినోద!
సంకటహరమహితగాధ!
శరణమనుచు నీ పదముల
శరణంవేడినాను, వెతల
పారద్రోలి స్థితిగతులిడి
ధీర! యేలుకూరుములిడి
రారా! శ్రీగిరినాయక!
చేరరార! జాగులిడక
శ్రీశ! సప్తగిరినివాస!
(1)ఆశ్రితుడను గోపవేష!
వాసుదేవ ! దాస దాస
దాస శ్రీనివాస పోష
స్వామి! నాదు వినుతివినుము
శ్రీమనోజ్ఞ! వినతి గొనుము
మంగళకర! అలమేల్ శ్రీ
మంగాపతి! మంగళములు
పరమోదాహరణసూక్తి
వరమునిడితి పరమభక్తి

---

(1) మత్కృవితాంజలి

గైకొని కృపజూచి నన్ను
చేకొను శరణంటి నిన్ను
మంగళాంగ! నీకగుకడు
మంగళసుశ్రీలునెపుడు

అంకితాంకవము

శ్రీరమణా! దయా౽భరణ!
శ్రీగిరిభూషణ! భక్తపోషణా!
కూరిమిమీర మీకరుణ
గోరి యుదాహరణాఖ్యసత్కృతిన్
చేరి త్వదంఘ్రులందిడితి
చేకొని నన్గనరా! జగత్పతీ!
శ్రీరసరాట్పతీ! శ్రీతవి
శిష్టజగత్పతి! శ్రీశ్రియఃపతీ!

ఫలశ్రుతి

శ్రీకమరూపమై తనరు
శ్రీగిరినాయక శ్రీనివాస
భాకమనీయవైభవము
పర్వెడుదాహరణాఖ్యసత్కృతిన్
చేకొని భక్తి భావముల
జిత్తమునన్ బఠియింతురెవ్వరే
ఆకొనియున్న బాధలణ
గారగ గల్గు శుభంబు వారికిన్.

మంగళము

అస్తు; స్వస్తి సమస్తవిశ్వవితతేః
శ్రీభారతశ్రీతతేః

ధాన్యాగారవిభూషితాంధ్రధరణీ
శ్రీమాతృదేవ్యా శ్శుభం।
శ్రీపూర్ణోజ్జ్వలశేషశైల విలస
చ్ఛ్రీవేంకట శ్రీపతేః
తత్పాదాంబుజదాసదాస వితతేః
శ్రేయస్కర శ్రీజయః ౧

శ్రీశుభంబులు శేషాద్రి శ్రీశుకగుత।
తాల్మిజెలువారు తద్దాసదాసతతికి
భక్తజగతికి శ్రీ శ్రీనివాసుకృపలు
చెలగివెలుగుచు నిహపర శ్రీలనిడుత।

-: శ్రీశుభంభవతు :-

ఇయ్యది
శ్రీ శ్రీనివాస దివ్యకళా వైభవమందలి శ్రీ శ్రీనివాస ఉదాహరణ
వైభవంబు అను షష్ఠసర్గము
శ్రీమదలమేల్మంగా సమేత శ్రీ శ్రీనివాసపాదారవిందములలో
సమర్పితమై ముగిసినది.

-: స్వస్తిసన్మంగళానిసంతు :-

శ్రీః
శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మనమః
శ్రీ వ్యాసపురజ్ఞానసరస్వత్యైనమః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణేనమః
శ్రీ శ్రీ గీర్వాణవాణ్యాం

# శ్రీశేషాచలాధీశ్వర - శ్రీశ్రీనివాసవిభుం

## తారావళిః - సప్తమ సర్గము

### సంస్తుతిః

విష్వక్సేనం హయగ్రీవం వాణీం సా చార్య సంహతిం।
నత్వాతారావళిశ్చైషా - సద్భక్త్యాక్తా రితా మయా। ౧

మాతా పద్మావతీదేవీ - పితా శ్రీవెంకటేశ్వరః
బాంధవా శ్చ హరే ర్భక్తాః - దేశే రాష్ట్రేచ మే హితాః 3

శ్రీకల్యాణ గుణాఽభిరామ విభవ
శ్రీమత్కృపాంభోనిధిః
శ్రీకాంతాకమనీయకౌస్తుభమణిః
శ్రీవత్సచిహ్నోజ్జ్వలః
శ్రీకస్తూర్యభిరాజితూర్ధ్వ తిలకః
శ్రీవెంకటేశ ప్రభుః
శ్రీకారుణ్యమయే క్షణై రవతు మాం
శ్రీశేషశైలాధిపః 3

శ్రీదివ్యోన్నత శేషభూధర విభు
శ్రీ శ్రీనివాసో హరిః
శ్రీదేవీ సహిత ః స్సురాది వినుత
శ్రీభక్త కల్పద్రుమః
శ్రీదీవ్యత్కరుణాఽమృతోదధిపతిః
శ్రేయాంసి దత్వా ముదా
ప్రాదుర్భూతకృపాకటాక్షలలితైః
మాం సర్వదా పాత్వయమ్ ౪

శ్రీతార్తజనరక్షకః పరమ
సత్కృపాబ్జేక్షణః
ప్రపన్నసుజనాఽభయ
ప్రదకరాబ్జశోభాశ్రయః
అఘౌఘమకరాంతకో
ద్విజయశంఖచక్రోజ్జ్వలః
సదావృషనగాధిపః
కరుణయా చ మాం పాత్వయమ్ ౫

లోకైక మంగళకరోన్నతదివ్యమూర్తిః
పద్మావతీహృదయ పంకజభృంగరాజః
పర్జన్య నీల జలదాఽభ సమోజ్జ్వలాంగః
మాం పాతు సప్తగిరిరా డనిశం కృపాభిః ౬

శ్రీపన్నగేంద్రగిరి సుందరమందిరేఽస్మిన్
శ్రీమత్ప్రపన్న వరభాగవతైర్నుతాంఘ్రిః
భక్తాభయప్రదకరాంబుజ భాసమానః
పద్మావతీ ప్రియవిభు స్సతతం ప్రపాతు ౭

శ్రీశాయ భక్త జన మానస మందిరాయ
మంగాసతీ మధుర మానస మంజులాయ
దేవాయ దివ్యజన కీర్తితవైభవాయ
శ్రీవేంకటాద్రినిలయాయనమోఽచ్యుతాయ ౯

లోకైక మంగళకరోన్నత దివ్యమూర్తిః
పద్మావతీచరణ పంకజ చంచరీకః
పర్జన్యకృన్నవ ఘనాఘన నీల దేహః
లక్ష్మీమనోజ్ఞ విభువేంకటరాట్ప్రునాతు ౧౦

హేమాంబరాపుష్ప శరీరికాయై
శ్రీనీలజీమూత శరీరకాయ
ధమ్మిల్లకాయై కుటిలాలకాయ
నమశ్శియై శ్రీపతయే నమోఽస్తు ౧౧

శ్రీకుంకుమాసక్తకుచోన్నతాయై
శ్రీచందనోద్దీవ్యదురస్థలాయ
కృతోత్కృపాయై వికృతోత్థలాయ
నమశ్శియై శ్రీపతయే నమోఽస్తు ౧౨

నవ్యాయతేందీవరలోచనాయై
శ్రీపుండరీకాయతలోచనాయ
రసేక్షణాయై కరుణేక్షణాయ
నమశ్శియై శ్రీపతయే నమోఽస్తు ౧౩

కలక్వణత్కింకిణి కంకణాయై
మంజీరశింజాపదపంకజాయ
విశ్వార్చితాయై జగదీశ్వరాయ
నమశ్శియై శ్రీపతయే నమోఽస్తు ౧౪

సౌవర్ణ వర్ణోజ్జ్వల భాసురాయై
సాషాఢనీలాభ్రతమోన్నతాయ
స్మితాననాయై హసితాననాయ
నమశ్శ్రియై శ్రీపతయే నమోఽస్తు ॥౧౫

రమ్యేంద్రనీలోచ్చకలాఽలకాయై
మాయూరపించోన్మకుటాలకాయ
ధనాధిపాయై భువనాధిపాయ
నమశ్శ్రియై శ్రీపతయే నమోఽస్తు ॥౧౬

శ్రీః

శ్రీనివాసపరబ్రహ్మణేనమః

# శ్రీశ్రీనివాస తారావళిః

శ్రీమన్! కృపాఽమృతనిధే! శ్రితపారిజాత!
శేషాద్రివాస! గుణ భాసుర చిద్విలాస!
లోకాఽవనాయ ధృతదివ్యరథాంగశంఖ!
శ్రీశ్రీనివాస! పరిపాలయ మాం నతోఽస్మి ౧

శ్రీశేషశైలవరమందిర సుందరేఽస్మిన్
రాజచ్ఛుభాంగ! నవరత్నమనోజ్ఞమౌళే!
కస్తూరికాఘటితరమ్యనవోర్ధ్వపుండ్ర!
శ్రీశ్రీనివాస! అవ మాంశరణాఽగతోఽస్మి ౨

ప్రేమ్ణా భవత్కరతలాంబుజ దర్శితం తే
సద్భక్త తారక మనోజ్ఞ పదాబ్జయుగ్మం!
సంద్రష్టుధి ముత్సుక దియా చ సమాగ తోస్మి
సందర్శయాఽర్తహిత! తారయ మాంనతోఽస్మి'' 3

శ్రీశంఖచక్రపరిభూషితపద్మపాణే!
భవ్యేంద్రనీలమణి వర్ణ! శుచిస్మితాఽస్య!
శ్రీవత్సకౌస్తుభలసత్సువిశాల వక్షః
మాం పాహి వేంకటపతే! శరణాఽగతోఽస్మి ४

కారుణ్య పూర్ణ కమనీయ నవాంబుజాక్ష!
భక్తాఽవనాయ ధృతకంకణ బద్ధ దీక్ష!
దుష్టారిభంజన విధౌ కృతనేత్రరూక్ష!
శ్రీశ్రీనివాస! పరిపాలయ మాం నతోఽస్మి ౫

శ్రీశేషశైల శిఖరాఽలయ గర్భగేహే
భక్తాఽఽశ్రితాఽవన విధౌ చ సమావిరాసీః
తద్వచ్ఛ భారతధరావరమంది రేషు
లక్ష్మీపతే! వృషగిరీశ్వర! తే నమోఽస్తు ౬

దుర్వారదుష్కలి కులాంతక! ధర్మమూర్తే!
రాగాదిరోగ విషయోగ్రభవాబ్ధిపోత!
తాపత్రయోరుదురితేషణ తాపహారిన్!
సప్తాద్రినాయకపతే! వినతోఽస్మి నిత్యమ్, ౭

ఆర్తాభయప్రద కరాంబుజభాసమాన!
ప్రచ్ఛన్నదుష్టరిపుషట్కభయాఽపహారిన్!
అజ్ఞానగాఢ తిమిరాంతకచండభానో!
శ్రీ శ్రీనివాస! మమ దేహి తవాంఘ్రియుగ్మమ్ ౮

హేదేవదేవ! హితసంశ్రిత పారిజాత!
దుర్వార దుష్టల కలిప్రవిభంజకాంఘ్రే!
యోగీంద్ర యోగనుత సద్గుణ! విశ్వమూర్తే!
మాంపాహి వేంకటపతే! శరణాగతోస్మి ౯

పాప ప్రభంజితభవాగ్ని శమాంఘ్రితీర్థ!
తాపత్రయోపశమనోజ్జ్వలపాదపద్మ!
ప్రచ్ఛబౌద్ధమకరాంతక చక్రపాణే!
శేషాద్రివాస! అవ మాం శరణాఽగతోఽస్మి ౧౦

పాషండ ధూర్తఘనపర్వ తరాడ్విభేత్తః!
మాయావితండమతవాడ భుజంగతార్క్ష్య!
క్షుద్రోగ్రదుర్మతకులాంతక ధూమకేతో!
నారాయణాఽచలవిభో! శరణాఽగతోఽస్మి ౧౧

తాపత్రయేషణ వివర్ధితదుర్వికార
ప్రోచ్చూనదుర్మదజవేంద్రియరాగమోహ
భ్రాజద్దురంత భవసాగర తారకౌ తే
శ్రీశ్రీనివాస! చరణౌ శరణం ప్రపద్యే ౧౨

శ్రీశేషశైలశిఖరే విలసన్మనోజ్ఞ
శ్రీశ్రావణోన్నతనవోజ్జ్వల నీలమేఘః
ఆర్తశ్రితాఽవన విశేషదయాపయోధిః
పాతు ప్రపన్న విహిత శ్శరణాగతం మామ్ ౧౩

దుర్వార ఘోరభవసన్నగదశ్యమాన
మేనం త్వదీయపదపంకజ దానదానం
కారుణ్యపూర్ణ ఘనమంత్రజలేన శించన్
మాం పాహి వేంకటపతే! శరణాఽగతోస్మి ౧౪

పాషండదుర్మత భయంకరనక్రపూర్ణ
క్షుద్రారి వర్గ(వర్ణ) విషయాశ్రయరాగరోగ
ప్రాబల్యదుర్భవహరౌ మహిమాన్వితౌ తే
శ్రీశ్రీనివాస! చరణౌ శరణాగతోఽస్మి ౧౫

క్షుద్రారి వర్గ కుటిలాశయ దుర్విదగ్ధ
క్రూరోరు దుర్మత పిశాచఖిలాంతకోగ్ర
సాహస్రనామ! నుతధార్మిక చిత్తధామ!
దివ్యాంజనాచలపతే శరణాఽగతోఽస్మి ౧౬

దావానలేవ బహుధా పరిదృశ్యమాన
క్రూరాఽరిషడ్విషయ వాతరుజాగ్నిరేషః
దందహ్యతే సతతమీశ్వర! మాం కృపాబ్దే!
శ్రీశ్రీనివాస! మమ దేహి పదద్వయం తే ౧౭

శ్రీనాథ! తావకపదాశ్రయ భక్త మేనం
దీవ్య త్కృపాభి రిహ దుర్భవ రోగజాగ్ర
త్తా పా2పహారక భవజ్జలజాంఘ్రితీర్థైః
సంసించ్య పాలయ హరే! శరణా2గతం మామ్ ౧౮

నీచా స్త్వ సహ్యావిధినా2త్ర కలిప్రపంచే
స్వామిన్! మహత్వమపయాన్తివిశిష్టశిష్టాః
ధర్మాశ్రయాశ్చ పటుదైన్య ముపాశ్రయన్తే
నా2హంవసేయమిహ దేహి తవాశ్రయం మే ౧౯

ద్వేషో2త్ర జాతి కుల వర్గ మతాంతరేషు
దేవేషు సాధు బుధ ధార్మికసత్వభేషు!
వృద్ధింసమేతి సతతం ప్రభుతాధిపేషు
స్థాస్యేయమీశ! కధమత్ర ? కృపాం ప్రయచ్ఛ ౨౦

సన్మార్గ ధార్మిక విశిష్టసవర్గవర్గే
ష్వావిర్బ భూవురిహదుర్మతదుర్మనుష్యాః
స్వస్వైకజాతిమతధర్మమదృశ్యమేతి
నా2హంవసేయ మిహ;దేహితవాశ్రయంమే ౨౧

లోకే2ద్యజాతిమతసత్కులవర్ణ సంఘాః
సాంకర్యతామనుపయాన్తి ఖలప్రవృత్యా!
దుర్మార్గపాశవికవృత్తి ముపైతి లోకః
స్థాస్యేయమీశ ! కధమత్ర? కృపాంప్రదేహి ౨౨

దుర్వార దుష్టమతహేతువివాదమూఢాః
అతంకవాదనిరకాశ్చవితండవాదాః
హింసారిరంస హృదయాశ్చబభూవు రేతే
జానే వసామి కధమత్ర? దయైకసింధో! ౨౩

వృత్త్యాశ్రయైక హితనైతికధర్మ మార్గాః
వర్ణాశ్రమార్షవిధిధార్మిక సత్యమార్గాః
గ్లానిర్బభూవురిహ భారతకర్మ భూమౌ
స్థాస్యేయమీశ! కథమత్ర? కృపాపయోధే! ౧౫

వృక్షస్య మూలమివభారతభవ్యజాతేః
నార్యేవ మూలమితిచాఽత్ర వదన్తి సంతః
అద్యైవతాదృశసతీకులమేత్యమత్వం
నాఽహంవసేయమిహ; దేశహి తవాఽశ్రయంమే ౨౬

ఆధ్యాత్మికోన్నతపథప్రద శాస్త్రమార్గాః
అద్యాధిభౌతికకుతాంత్రికశాస్త్రవిజ్ఞై
స్వామిన్! బలాదిహరుణద్ధితవంత ఏవ
జానేయమీశ! భవదంఘ్రిపథః కదాఽస్మి ౨౭

కామేసఖీ? పుత్రహితాస్సఖాకే?
కేభాంధవా జ్ఞాతిసహోదరాః కే?
సర్వేత్విహాఽభాసహితాఽనుబంధాః
ప్రాప్యస్త్వమేవేతి సమాగతోఽస్మి ౨౮

నాఽహంప్రయాచే సకలైహికార్థం
స్వర్గైకభోగం నక దాపి యాచే!
తథాపియాచే భవదంఘ్రిపోతం
ప్రయచ్ఛదుఃఖాబ్ధి భవం తరేయమ్ ౨౯

ప్రపత్తిః

మాయానుబంధభవబంధురకర్మ లోకే
త్రాతాగురు ర్విభుమమాత్ర పితాచమాతా!
భ్రాతా2నుజాస్తనయ బంధు సుహృద్వరాధ్యాః
స్వామిన్ త్వమేవ; వరదేతి వమాగతో2స్మి ౧

శ్రీశంఖ చక్ర మకుటోజ్జ్వల వైజయన్తీ
మాలాచ్ఛకౌస్తుభలసత్పణి భూషణాఢ్య!
త్వద్దర్శితం భవహరం భవదంఘ్రియుగ్మం
శ్రీమన్! ఫణీంద్రగిరినాయక! దేహి మహ్యమ్ ౨

దివ్యోర్ధ్వపుండ్రలలితోన్నఫాలభాగ!
శ్రీవత్సకౌస్తుభమనోజ్ఞవిశాలవక్షః!
సుస్మేరదిద్ధమధురాయతలోచనాబ్జ!
శ్రీశ! త్వదీయ చరణౌశరణం ప్రపద్యే 3

(ఫలశ్రుతిః)

దేవత్వదీయ పదపంకజదాసదాస -
శ్రీ శ్రీనివాసకవిదాస కృతాంత్వదీయాం!
తారావళింపఠతి యో2నుదినంచసో2పి
త్వన్మంగళప్రదకృపాం సముపైతి నిత్యమ్

శ్రీ శ్రీనివాస! ఫణిరాడ్గిరి వేంకటేశ!
భక్తార్తి భంజన విధౌచకృతా2వతార!
గృహ్ణీష్వమద్విరచితాం కృతిమప్రమేయ!
మాం పాలయేశ! కృపయా పరయా ప్రణౌమి

ఇతిశమ్

ఇత్థమ్

శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవే శ్రీనివాస తారావళిః కృతిః
శ్రీ శ్రీనివాస పాదపద్మయుగళే సమర్పితాసమాప్తా

-: శ్రీశుభంభవతు :-

శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

శ్రీవాగీశ్వర్యైనమః

శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణేనమః

## శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవము

## శ్రీ వేంకటేశ్వర పంచచామర తారావళిః

శ్రియశ్శ్రియావిభూషితం
    విశాలవక్షసోజ్జ్వలం
ధగద్ధగధగన్మణి
    ప్రభాఢ్యమౌళి రాజ మండితం।
మృదుప్రఫుల్ల ముగ్ధమంద
    హాసగండపాండురం
జగత్ప్రభుం నమామిశేష
    శైలవేంకటేశ్వరమ్ ౧

రమాకుచాబ్జకుట్మలాగ్ర
    దృగ్విలాసలాలితమ్
తదీయసుందరస్తనార్ద్ర
    కుంకుమాద్యురస్థలం।
జగత్రయైకమోహకృ
    న్మనోజకోటి సుందరం
నమామ్యహం వృషాద్రినాద
    మచ్యుతం పరాత్పరమ్ ౨

సువర్ణ మండల ప్రభాఢ్య
శంఖ చక్ర వైభవమ్।
మనోజ్ఞదివ్యదూర్ధ్వ పుండ్ర
సన్ముఖేందు మండలమ్
ప్రశస్తవైజయన్తికా
విభుషితోజ్జ్వలంగళమ్
నమామ్యహం ఖగేంద్రశైల
వేంకటేశ్వరంవిభుమ్ 3

మణి ప్రగల్భరంజి తోరు
శేషభూషణోజ్జ్వలం
నవప్రసూనమాలికా ప్రభూ
షితాంగవైభవమ్।
ఘమంఘమంఘమోల్లస
స్నవార్ద్రచందనార్చితం।
జగద్విభుంనమామిదివ్య
దంజనాద్రినాయకమ్ ४

కటిప్రదేశ భూషితోరు
కాంచనోరు కాంచికం।
ప్రశస్త రత్నరంజితాబ్జ
హస్తకంకణోజ్జ్వలమ్।
సువర్ణ నూపురాఢ్యపాద
పద్మయుగ్మసుందరమ్
శ్రియఃపతింవృషాద్రిరాజ
రాట్పతింనమామ్యహమ్। ౫

నవాతసీసుమాభరమ్య
నీలనీరదాకృతిమ్।
సువర్ణవర్ణ సద్దుకూల
శోభితాంగవైభవమ్।
సహస్రకోటిశారదేందు
పూర్ణసుందరాననం
పరాత్పరంనమామ్యహం
ఫణీంద్రశైలవాసినమ్ ౬

అనంతకోటి భాస్కరప్రతాప
శౌర్యభాసురం।
పరాక్రమావలేపదుష్ట
దైత్యలోకభీకరమ్।
ప్రపన్నకైరవేందుమాప్త
సజ్జనా2భయ ప్రదం।
శ్రియః పతింశ్రితాశ్రయం
నామామివేంకటేశ్వరమ్ ౭

కృపార్ద్రచిత్తవైభవం
దయామృతాబ్జలోచనం।
ప్రసన్నభక్త లోక మాన
సాబ్జమత్తషట్పదమ్
మనోజ్ఞసద్గుణోదధిం
శ్రితార్తలోకరక్షకం।
నమామ్యహ జగద్విభుం
వృషాద్రిరాజసుందరమ్ ౮

ధరాతలా2వతీర్ణనీల
పూర్ణచంద్రమైషః
మనోజ్ఞనవ్యనీలిమాభ్ర
ఖండఏవసో2ప్యసౌ
రరాజ ఇత్యముంరమా
సతీమనోబ్జషట్పదమ్
మనోహరం జగత్ప్రభుం
నమామి వేంకటేశ్వరమ్ ౯

నవోజ్జ్వలాంజనా2చలావలేప
భంజవా2కృతిం।
రమాసతీప్రఫుల్లరమ్య
హృత్సరోజషట్పదం
మునీంద్రలోకభవ్యమాన
సాధివాసహంసినమ్
ప్రపన్న కల్పభూరుహం
నమామ్యహం శ్రియఃపతిమ్ ౧౦

ప్రశస్త భక్త పూర్వపుణ్య
సత్ఫలంకిమిత్యసౌ
కలౌయుగేరరాజ ఇత్యముం
కలిప్రహారకమ్।
భవోగ్రతాపతప్తమాన
సార్తసత్సుధానిధిం
అనన్య సత్కృపానిధిం
నమామి వేంకటేశ్వరమ్ ౧౧

మతైకసామరస్యకృ
త్సమైక్యభావసద్ధియా
దురంతదుర్మతప్రమూఢ
భావభగ్నతత్పరే
కృతాద్భుతావతార మత్ర
సర్వజీవతారకం
శ్రియఃపతింజగత్పతిం
నమామి విశ్వభూపతిమ్ ౧౨

కలిప్రగల్భనాశకోరు
దివ్యనామవైభవం।
సదా2నుకూల భక్త కామి
తార్థకృత్సురద్రుమం।
కలౌయుగే నిదర్శనవ్య -
రూపిణంపరాత్పరం
నమామ్యనన్య భక్తియోగ
పూర్ణభక్త పాలకమ్ ౧౩

కృతౌయుగే ప్రచండనార
సింహవిస్మయాకృతిం।
తతో మహద్యుగద్వయేచ
రామకృష్ణరూపిణం।
కలౌయుగేచ వేంకటేశ
నామరూపదైవతం।
ఇహాంచ భక్తపాలనే
రతం హరింనమామ్యహమ్ ౧౪

సదార్తదీన భక్తలోక
పాలనేఽభయప్రదం।
భవాఽహి దష్టసాదు
రక్షణే ధృతంఖగధ్వజం।
నమామ్యహంసుతాంజ
నాద్రినాయకం పరాత్పరమ్ ౧౫

అఘోగ్రసత్వపీడితార్త
రక్షణే ధృతాయుధం।
దరిద్రకీలిదాహితాఽ
శ్రితావనే సురాఘగం।
పవిత్రభక్తి పూర్ణసాధు
పాలనేశ్రియఃపతిం।
ప్రపన్నభక్త పారిజాత
మచ్యుతం నమామ్యహమ్ ౧౬

శ్రియఃపతింజగత్పతిం శ్రితాఽ
ర్తాలోకభూపతిమ్
జకత్రయైక సృష్టి సంస్థి
తిప్రణాశనే కృతిం
అనంతవేదవాక్పతిం
ప్రపన్నభక్తసద్గతిమ్
నమామ్యహం ఫణీంద్రశైల
వేంకటేశ్వరం విభుమ్ ౧౭

ఖలాంతకం భవాంతకం
సురారి దుర్జనాంతకం!
మురాంతకం దురంతపాప
కర్మకృన్నరాంతకం!
భయాంతకం రుజాంతకం
ప్రపంచదుర్గ్రహాంతకమ్
జగద్ర మాభివృద్ధివె
భవాంతకాంతకంభజే ౨౮

అనంత కోటిరూపిణం
హ్యనంత విశ్వకారణం
అణోరణీయభాసినం
మహోన్మహీయభాజనం
జగన్నుతాఽతిసద్గుణౌఘ
చారుదివ్యభూషణం
నమామ్యహంప్రపన్నసేవ్య
వేంకటాద్రి వాసినమ్ ౨౯

శ్రియకరం జయంకరం
శుభంకరంచ శంకరం
శివంకరం సమస్తభక్త
మానసంవశంకరం
భయంకరాఽఘదూషితార్త
సజ్జనా భయంకరం
నమామి సద్గుణాఽకరం
వృషాద్రి రమ్యభాస్కరమ్ ౩౦

కృపా2మృతాంబుజేక్షణం
దయాపయోధిహృద్ధనం
సమాశ్రితార్తభక్త రక్ష
ణేసదా కృతంమతిం
భవాబ్ధితారణే సుపోత
కృత్పదాబ్జయుగ్మకం
నమామి శేషశైలవేంక
టేశ్వరం పరాత్పరమ్ ౨౧

పితామహేశ దేవరాజ
సర్వదిక్పతీడ్గణైః
ధరా2ధిపేంద్రరాజరాట్ప
జాధినేతృమండలై ః
నమత్సురత్నమౌళిభి ః ప్రపూ
జితాంఘ్రియుగ్మకమ్
నమామ్యహంరమాధిపంచ
శేషభూధరా2ధిపమ్ ౨౨

అఖర్వగర్వషడ్రిపూగ్ర
సత్వదుర్భవాంబుధౌ
కళత్రపుత్ర మిత్రబంధు
వీచికోద్ధతోద్భయే
దురంతీవ్ర తాపక
త్రయోద్భవం తాగ్ని భీకరే
నిమగ్నమేనమీశ! వేంక
టేశ! పాహి పాహిమామ్ ౨3

కుమంత్ర తంత్ర యంత్ర
కూటనీతి దూషితే కలౌ
అపారపాపచింతనే
నిమగ్నమానవా2సురే
వసామినా2హమత్రమే
ప్రదేహితావకోన్నతం।
పదాబ్జ యుగ్మమీశ। వేంక
టేశ। పాహిమాంప్రభో! ౨౩

ప్రశస్త సత్యధర్మ శాంతి
దాంతి భగ్నదుర్మతౌ
కుశీల నర్మమర్మగర్బ
వాక్ప్రగల్బవంచకే
అహంకృతాత్మ దుర్మదాంధ
దూషితే కునాయకే
కలౌయుగే వసామి నాహ
మీశ। పాహిమాంప్రభో! ౨౪

అనన్యభవ్య దివ్య సత్కళా
మయే మనోహరే
విశిష్ట భక్తి పూర్ణభక్త
లోక చిత్తమందిరే
వసంతమిందిరా విలాస
లోలదృగ్విభూషితం
భవంత మాశ్రయామి పాహి
పాహిమాంజగత్పతే! ౨౫

విశాల భారతావనీ
రమాంధ్ర రాష్ట్ర భాసురే
మనోజ్ఞ మండలేషు రమ్య
(1) చిత్తూరాఖ్య మండలే
నగాధిరాజ శేషశైల దివ్య
శిల్పమందిరే
వసంత మాశ్రయే భవంత
మీశ! పాహిమాం విభో! ౫౮

ఇమాంస్తుతిం ప్రశస్త
చారు పంచచామరోజ్జ్వలాం
ప్రసన్నభక్తి చేతసాచ
యోపఠత్యహర్నిశమ్
సుఖాస్పదోరు వైభవం
యశఃప్రపంచకృచ్ఛ్రియం
శ్రియఃపతేః పదాశ్రయం
సమేతి సోపి శాశ్వతమ్.

ఇతిశమ్

సర్వ శ్రీశేషనాగాధీశ్వర శ్రీతారావళిః పంచచామర
తారావళిః సప్తమసర్గాన్వితాసర్వా
శ్రీనివాసపాద పద్మార్పితా అస్తు
శ్రీశుభంభవతు
శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

శ్రీ శ్రీనివాస దివ్యకళా వైభవము

# శ్రీ శ్రీనివాసవిభు తారాహారము

అష్టమ సర్గము

శ్రీమదనవద్య సౌందర్యకోమలాంగి-
యైన శ్రీహరి వక్షస్థలాన మురియు
శ్రీని శ్రావణ ఘననీల శ్రీశుభాంగు
డైన శ్రీ శ్రీనివాసుని నే నుతింతు ౧

శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

**వస్తువివరి**

హయగ్రీవస్వామి

శ్రీమదనవద్య విద్యల జెలగువాని
ప్పటి కథవళోజ్జ్వలాంగుని జ్ఞానపూర్ణ
దివ్య దానంద మయుని శ్రీదేవివిభుని
శ్రీహయాస్యుని గొల్తు వాక్సిద్ధి కొఱకు ౨

భావశుద్ధిన శ్రీహయగ్రీవ! దేవ!
శ్రీహయగ్రీవ! యని భక్తిజేసి యెవరు
స్మరణ జేతురొ వారి వాక్సరణిలోన
వాణి జాహ్నవియై సాగువసుధవెలుగు 3
(శారద)

మధురశరదిందు చంద్రికామందహాస
సుందరిని నీలకువలయానందనయన
నబ్జసింహాసనను నళినాననైన
శారదను గొల్తు కవితావిశారదునిగ ౪
(సిరి)

సిరి గలుముల జవరాలిని
హరియురమున కౌస్తుభమున హాయింగనుసుం
దరి ననవరతముగొల్చెద
కరుణ లు గల చూపు నన్ను గావగ నెప్డున్ ౫

శ్రీగజాస్యుని నలవిస్ససేను ఘనుని
వ్యాసపుర జ్ఞానవాక్పతిన్ వ్యాసగురుని
మాన్య పురుషోత్తమార్యుని మత్పితరుల
భక్తిగొలిచెద రసమయ వాక్కునెంచి ౬

పరమ గీర్వాణ వాక్కవివరునెల్ల
ఆంధ్రవాఙ్మయ ఘన సు కవీంద్రబుధుల
అద్యతన కవివతంసుల నాత్మనిలిపి
కృతిని వెలయింతు పరమార్థగతిని గోరి ౭

లలిత కళలన్ని పరమాత్మ లక్ష్యవిధులు
అందుకవితా కళన్న నవ్యాతినవ్య
భవ్య సౌందర్య రసవదవ్యయ విశేష
దీవ్యదానంద నిర్వాణ దివ్యపదము ౮

అందులకె కళలలోన పెంపంది వెలుగు
కవనసత్కళ ; తదుపాసకాళులెల్ల
విశ్వ కల్యాణ కాంక్షులై పేర్మిమీర
సుకవితారాధనల నిత్య సూరులైరి ౯

తాదృశంబైన కవితను తన్మనోజ్ఞ
కావ్యము శ్రీని శ్రీశుని కర్పణముగ
తత్పదంబులనిడున సద్భక్తిమీర
కవియు కవితయు ధన్యతన్గలిగివెలుగు ౧౦

దైవ దత్తముగుచు దనరిన కవితను
శ్రీశుచరణ కమల శ్రీలలోన
పరమభక్తి భావ వైభవమతినొచు
తాల్మి నొసగి జన్మధన్యునాదు ౧౧

శ్రీః

శ్రీ హయగ్రీవాయనమః

శ్రీ వాగేశ్వర్యైనమః

# శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవము

శ్రీ శేషాచలాధీశ్వర

## శ్రీ శ్రీనివాస ప్రభుతారాహారము - అష్టమ సర్గము

శ్రీ రమణీయమౌ ప్రకృతి
    శ్రీకి విహార మనోజ్ఞసీమయై
దారుణమౌ కలిన్దుడిచి
    దాసజనార్తిని బాపి దుర్భవో
త్తారకమౌచువెల్గి శుభ
    దంబగు శేషగిరింజెలంగుమా
శ్రీ రమణా! నతుల్గొనవె
    శ్రీ జగతాంపతి! శ్రీ శ్రియఃపతీ! ౧

శ్రీ రమయున్ సరస్వతియు
    శ్రీ గిరిజాసతి యండదండగా
కూరిమినిండగా మెలగి
    కోరి భజించిన విష్ణుజేశశో
భారమణీయ రూపగుణ
    వైభవ విస్మయ దివ్యరూప శ్రం
గార! త్వదీయుడన్ కరుణ
    గల్గగ బ్రోవవె! శ్రీ శ్రీ శ్రియంపతీ! 3

శ్రీవిభవైక కౌస్తుభ వి
శేష విశాల మహోమరస్థలా!
భావజకోటి సుందర! కృ
పాయతరమ్య సితాబ్జలోచనా!
పావన నామరూపగుణ
భాసుర! శేషనగోత్తమాధిపా!
కావవె దాసునిన్ శ్రితజ
గత్పతి! వేంకట శ్రీ శ్రియఃపతీ! ౪

శ్రీకిరమైన వేంకటగి
రింగల స్వామి సరోవరైక శో
భా కమనీయ తీరమున
పావన మందిరమందు భక్తలో
కైక సురద్రుమంబవయి
కల్మషహారివి యౌచు వెల్గుస్వా
మీ! కరుణాపయోనిధి! ద
యింగను దాసుని శ్రీ శ్రియఃపతీ! ౫

శ్రీ వేంకటాచల శ్రీశిఖరాభర
ణాయమానాంఘ్రి శోభాయమాన!
శ్రీరమా రమణీ మణీ రమ్య కుచశైల
తట సుందరానంద తల్పశాయి!
శ్రితజన చాతక శ్రేణీడి తానంద
సందోహకృద్వర్ష సాంద్ర జలద!
పరమ పదార్థి సద్భక్తకృషీవల
జగతికొ శ్రావణ జలదరాశి !
కలుషఖలకులవితతికి ప్రళయకాల

భీకరో గ్రాతిమేఘము! భీతిగొల్పు
దురితభవరిపునణగించి కరుణగనవె!
విశ్వపతి! శ్రీ శ్రియఃపతి వేంకటపతి! ౬

దయగలవాడ వంచు నిను
దాపని చేరుచు గొల్చు భక్తులన్
నయమున బ్రోచువాడవని
నమ్మి మనమ్మున నీదు సన్నిధిన్
భయకరమైన దుర్భవపు
బాధల కోర్వక జేరినాను, యిం
తయిన కృపార్ద్రచిత్తమున
దాసుని గావవె శ్రీజగత్పతీ ! ౭

ఆర్తులౌ శ్రితులకు నభయంకండవు
కలుషాత్ములకు భయంకరుడ వీవు,
తగు భవరోగికి ధన్వంతరివి నీవు
కలిసర్పభీతికి గరుడపతివి,
తతమోహ మకరపీడితలోక చక్రివి
మూఢదుర్మతతమోత్రొఢరవివి
ఆశాతినిబిడదుష్పాశాలవిత్రవు
బలరిపుషట్కకుద్దలివి నీవు
జనన మరణాది సుఖ దుఃఖజనకమైన
రాగభోగాది కర్మ దురంతములకు
కాలపురుషుండవౌలయకర్త వీవు
భక్త కోటికి వేంకటపతివి నీవె ౮

సులలిత రాగతాళగతి
      సూచన దప్పక మౌళి నున్నస
త్కలశపు రక్షగల్గి కడు
      దాల్మిన నర్తకి యాడుకైవడిన్
ఇలభవ భారమున్ దలన
      నిల్పుచు నిన్నెద గల్గిభక్తినన్
దలచినవాడె నీకు విహి
      తాత్ముడు భక్తుడటయ్య! శ్రీపతీ! ౯

నిర్మలకారుణ్య నిలయ వీవనుటకు
      తావకాంబుజపదోద్భవయెసాక్షి
నీదు చూపులు ప్రతాపాదరామృతకృప
      కనఘులౌ నిన శశుల్ గనగ సాక్షి
శిష్ట రక్షణ దుష్ట శిక్షణ కీవన
      ఘనములౌ శంఖ చక్రములె సాక్షి
శ్రితభక్త పాలన శీలి వీవనుటకు
      కొమరొప్పు వాత్సల్య గుణమె సాక్షి
శరణ మని చేరు రిపునైన కరుణ నేలు
గుణ ములకు నీదు సద్గుణ గణ ము లందు
దనరు శరణాగతైక వత్సలతవిధులె
సాక్షులగునయ్య! భక్తైక పక్షపాత!
కింకరుడ స్వామి! దయనేలు వేంకట పతి! ౧౦

చక్కని మానసంబుగల
      చల్లని తండ్రి వటంచునమ్మి యే
చక్కియు లేనివాడనయి
      చాలక నీ భవవార్ధి నీదుచున్

దిక్కారి యుక్కి బిక్కిరయి
తెల్యక దారిని; బిల్చి నాను; నా
దిక్కయి నీ పదద్వయపు
తెప్పను జూపుమురా శ్రియఃపతీ ! ౧౧

వేదాంత వనరమ్య వీధులందిరుగాడు
దేవ! వేదాన్తాల దెలియలేను
చతురశాస్త్రేతిహాసాది దుర్గవిహార!
శాస్త్రేతి హాసాల చదువుగనను
విశ్వ హితంకర వినుత కావ్యోద్యాన
సంచార! కావ్యాల సారమెరుగ
మధుర సంగీత సామ్రాజ్యేందిరాలోల !
సరస సంగీత సద్గరిమగనను
లలిత సంపత్కళా నంద నిలయ వాస!
కళలె ఱుంగను గాని నీ జలజ చరణ
యుగళి చింతన దప్ప నన్యంబు నెఱుగ
విశ్వపతి ! నన్ను గరుణించు వేంకటపతి ! ౧౨

ఉరగనగేంద్ర వాస! కరు
ణోదధిరమ్య మన ప్రకాశ! సుం
దర గుణ రూపవైభవసు
ధాంబుధి పూర్ణశశాంక భాస! సా
దర మృదు మంద హాస! శుభ
దాయక వేంకట శ్రీనివాస! నీ
చరణ సరోజ సన్నిధిన
సాగిలితిన్ కరుణించు శ్రీపతీ! ౧౩

తపమేమి చేసెనో తల్లియై వకుళమ్మ
శ్రీశ! నీకిట బెండ్లి జేసి మురిసె;
వ్రతమేమి చేసెనో శ్వశురుడై యాకాశ
రాజు కూతురు నిచ్చి రహితరించె
పూజేమి చేసెనో పొలతి పద్మావతి
నీ పదదాసియైనిలిచి వెలిగె
నియమమే మొనరించి నిలచెనో శేషాద్రి
భవదంఘ్రి శ్రీలపెంపయ్యి యెదిగె
ఏమినిష్ఠల గనిరొ ఆ యీశుడజులు
గోవులై క్షీరమిడి నిన్ను గొలిచినారు
ఎట్టి నియమాల నోర్వని హీనమతుడ
గాని హృదయమ్ము నర్పింతు గావుమీశ! ౧౪

క్షపణ కులింత నిన్ననరు;
శాక్యులు నీపయి తెల్విలేరు, దు
ష్కృపణ మతస్థులన్యులిల
కింపురుషత్వముగల్గినారు, నీ
కృపలకు పాత్రతన్దెలియ
కేసుఖదుఃఖ పుకర్మజాతులై
ఉపకృతి బొందలేరు, కరు
ణోదధి! నిన్ శరణంటి బ్రోవవే! ౨౫

నడుము సన్ననివాడ! నాజూకుగలవాడ!
లలితమౌ కనక చేలంబువాడ!
ఫాలభాగము నందు భవ్యోర్ధ్వపుండ్రంబు
తలపైన మణిమౌళి దనరువాడ!

జగ దేకరక్షక శంఖ చక్రమ్ములు
కరయుగ్మమున గుల్కగల్గువాడ!
నవవైజయన్తి క నర్తింప గళసీమ
కౌస్తుభ శ్రీనెదన్ గలుగువాడ!
అభయకర హస్తమున ''నన్ను నాశ్రయింప
శరణం గను డంచు చరణాల గరుణ జూపి
జీవులను బ్రోచువాడ! ఓ శ్రీనివాస!
వేడితిని రారా! శ్రీపతీ! వేంకటపతి! ౧౯

నాయనువిత్తునన్ గలిగి
నాయనుబంధములందు పెద్దయై
నాయను మోహపాశమున
నాశల వల్లరు లందు జిక్కి; నీ
ధ్యేయమె లేక స్వార్థుడయి
యీషణ దుర్భర పంకమందు సా
పాయత నుండు జీవుడు కృ
పామతి! నీ దరిగాన కెప్పుడున్ ౨౦

ఇతరాంతరాధిక్యమింకిపంజేసెడి
యానంద సందోహమలరువాడు
అజ్ఞాన తిమిరంబునణచి జ్ఞానార్కుడై
తెలివిని గృపసేయ గలుగువాడు
చరణాబ్జముల జేరి శరణన్న వారిని
వీడు వాడనక కాపాడువాడు
ఎడదలో మరుపు రానివ్వని శ్రీనిత్య
సూరుల సేవలన్ మీరువాడు

భూరి సుగుణుడు నుభయవిభూతివిభుడు
ప్రాప్యుడీతడె యని వాని పాదయుగళి!
గనగజేరవె! స్వాంతమా! యనుచు దెల్పి
స్వామి ! మది నిచ్చు కొంటి కాపాడుమంటి ౨౮

ఆధియు వ్యాధి యున్ జరయు
మారణ ముల్ సుఖ దుఃఖముల్ భవో
ద్బాధలు వోప సంతతశు
భంకర దీప్తి మదున్నతాకృతిన్
శ్రీధన సంతతిన్ గలిగి
చెల్వగు విశ్వ విభూతినేలు శ్రీ
నాధుడు వైన నిన్ను సుగు
ణాత్ముల సూరులగాంతు నెప్పుడో! ౧౯

సత్యనిత్యము గాని ఛల శబ్ద దేహమం
దాత్మయనే తెల్వి; నఘువు పనిని;
హేయ శరీరమున్ మోయింపకికపైన;
బద్ధజీవులను కాపాడదలంచి
కారణమే లేని కనికరంబుల గల్గి
పలు జన్మలెత్తిన పరమపురుష !
ఉభయ విభూతుల కభయప్రదాతవై
మీరిన శ్రీనిత్య సూరి వినుత !
తావ కోజ్జ్వల పాదపద్మైక దాస
దాస దాసుడ నైతినే నాసలుడిగి
చేయు భవభయతారకోపాయ నుతిని
వినవె కరుణించి నన్నేలుకొనవె! స్వామి! ౨౦

మదనుని చక్కనైన కుసు
మాస్త్ర సమాహితమైనవింటికే
ముదమున దాసులై చనెడి
మూఢజనంబుల గూడజాలరా!
చెదరని పుట్టుమచ్చ పలు
చెల్వములాడె డురంబువాడ! శ్రీ
సదన! జగత్ప్రభూ! వినతి
సత్ప్రీతి దాసుని నేలు శ్రీపతీ! ౨౧

వరువాతనే లేచి వచ్చి నిన్ సేవించి
భవదంఘ్రి జలజ సంపదలగొలిచి
గోపకులజుడవైన గోవింద! యని మిమ్ము
కూర్మి మీ సేవల గోరినాము,
ఇప్పుడు మా పైన తప్పిడి మా నుండి
కూరిమిన్ గ్రహియింపగోరవేమొ
నీతోడ మాకు నెన్నెన్ని జన్మలనుండి
పలుకూర్మి సంబంధ బంధమాయె
తమరికే చేసెదము మేము దాస్యమెపుడు
మాకు గల యితర కోర్కెల మట్టువెట్టి
ఏలుకొన మమ్ము మది విచారింపుడయ్య!
విశ్వపతి! వినతి శ్రీపతీ! వేంకటపతి! ౨౨

పుడమిని ముద్దు బెట్టుకొని
పోయెడి చల్లని గబ్బిమబ్బు సం
దడులు గలట్టి శేషగిరి
ధామమునన్ కొలువున్న రాయడా!

తడయక పుట్టే గిట్టుటల
దారులసాగి శ్రమంబునొందితిన్
చెడితిని మంచి చేయకని
చేరితి నిన్ శరణంటి శ్రీపతీ! ౨౩

ఎనలేని భక్తితో నెంగిలి పండ్లిచ్చి
స్వామి! నిన్ సేవించు శబరిగాను,
గంగ దాటెడువేళ గడుభక్తి మీ సేవ
గోరి యొనర్చిన గుహుడగాను,
సేతుబంధపు వేళ చేరి నీ విధులలో
కడు సేవ జేసిన యుడుత గాను
ఆర్తసంత్రాణుడవని నీకు శరణని
సాగిలించిన విభీషణుడగాను
పనికిమాలిన రిక్తుడ పాపమతిని
భక్తి నిసుమంత గానని పాశవికుడ
పరమ మూఢుడ నీ పాలబడ్డవాడ
వితతభవనాశ! సర్వేశ! వేంకటేశ! ౨౪

నీకిట శేషభూతుడను;
నీకె ప్రపత్తిని జేయువాడ నం
చాకొని వచ్చు దాసులకు
సమ్మతితో నభయంబునిత్తు వం
చేకడు రిక్త చిత్తుడయి
చేరిన నిన్ శరణన్న వానినిన్
చేకొనుమంచు వేడితిని
శ్రీగిరి రాట్పతి! శ్రీ శ్రియఃపతీ! ౨౫

నాకు నీతోడిదే లోకమిదంచు నీ
చెంత జేరిన గోపకాంత గాను
ఆశ్రితా వనుడ వంచాదరంబున నీకు
కూర్మి నెదనర్పించు కుబ్జ గాను
ఆర్తి ప్రపత్తితో నటుకులందించిన
కడురిక్తుడౌ కుచేలుడను గాను
ఆర్తావనుడ వంచు నాపద నెలుగెత్తి
వడి జాటి బిల్చు ద్రౌపదిని గాను
అర్హుడను గాను నీ కృప కవక తవక
నడత గల మానసుడ, గోపనాయకేంద్ర!
ఇహము మెగటయ్యె మదిని నిన్నెరుగలేను
శ్రీ శ్రియఃపతి! శరణంటి చేదుకొనవె! ౨౯

భవ విషనాగ బద్ధుడను;
వైరి షడుగ్రనిబద్ధ జీవుడన్;
జవ బలజీర్ణ దేహుడను;
శశ్లథ శల్యుడ; చంచలాత్ముడన్;
వివిధ వికారదుర్విషయ
వేల్లిత చిత్తుడ నైన వీడ నిన్
భవదనవద్య పాదముల
బాయను నిన్ శరణంచు చేరితిన్ ౨౭

కోనేటి రాయ! నిన్ జానొప్పు పదముల
నర్చించి తరియించె నన్నమయ్య
తెర దీయమని వేడ హరి! నీవు తెర దీయ
దర్శించె నిను బాడి త్యాగరాజు
నీ కథన్ కైతలో నింపి నీ కర్పించి

వినుతయ్యె తరియించె వేంకమాంబ
శ్రీకృష్ణరాయ నరేంద్రాది నృపకోటి
ఎంచి నిన్గొల్చి తరించెనయ్య!
పూర్ణ సద్భక్తి సుకవి మా పుట్టపర్తి
నారనార్యాది సుకవులు నాత్మ మిమ్ము
కూరిమిన నమ్మి శరణ ని చేరినారు
విశ్వపతి! బ్రోవు శరణంటి వేంకట పతి! ౨౮

శ్రీయుత మూర్తులౌ సురవ
రేంద్ర గిరీశ దిగీశులున్ సురుల్
పాయని భక్తి తత్పరులు
భవ్య చరిత్రలు భక్తులెందరో
నీ యనవద్య పాదముల
నెమ్మది గొల్చి తరించు చుందురో
శ్రీయలమేలు మంగపతి!
చేరితినిన్ శరణంటి శ్రీపతీ!

- - -

-:మంగాళాశాసనము:-

ప్రమిదగ జేసి చిత్తమును
భక్తిని నేయిగ నందు బోసి పెం
దమి గల బుద్ధి వత్తిగన
నన్యపు జ్ఞానముదీపలక్ష్మిగా
స్థిమితముతో నొనర్చి ; నతి
జేయుచు మంగళహారతిచ్చితిన్
కమలదళాక్ష! చేకొనవె
కావవె వేంకట శ్రీశ్రియఃపతీ! ౧

విశ్వముకెల్ల మంగళము
　　వేడ్కగ గల్గుత! భారతమ్మకే
శాశ్వతవైదివ్య వైభవము
　　సాగుత! ఆంధ్రరమామ తల్లకే
శశ్వద మోఘ మంగళము
　　సంధిలుతన్! వృషశైలవాస! స
ర్వేశ్వర! మీకు మీపదవి
　　వేకులకొత! శుభంము లెప్పుడున్ 3

మీ సతియైన శ్రీసతికి;
　　మీ తిరుమేనుకు; సత్కృపాత్రమౌ
మీ సుకుమారమౌనెదకు
　　మీ నయనాబ్జదయామృతాబ్ధికిన్
మీ సితశంఖ చక్రముల
　　మేలిమిశక్తికి; మీ హితార్థులౌ
దాసుల కెల్ల మంగళశ
　　తంబులు; మీ కరుణన్ సెలంగుతన్! ౪

గతులను దప్పకుండగ స
　　కాలమునన్ ఘనమేఘ వర్షముల్
కుతుకత సాగు గాత! తగ
　　కుంభిని సస్యవశేషశాలియై
సతతము వెల్గుగాత! కడు
　　శాంతిగ భారత లక్ష్మి యొప్పుతన్!
వితత ఫలప్రదంబగుచు
　　వెల్గుత: ఆంధ్ర ధరిత్రి కూర్మినన్ ౫

దేశములు శాంతి భద్రతన్ దేలి మిగుల
సకల సౌభాగ్య శ్రీలతో సాగుగాత!
వర్ణములు నాల్గు; సత్ప్రజా వైభవములు;
జాతి మూలపుద్విజులు సత్ఖ్యాతిగనుత! ౬

ప్రజల కనుపమ సత్ప్రజాస్వామ్యమునకు
ధరణి వర్ణాశ్రమాచారధర్మములకు
స్త్రీలకన వద్య సౌభాగ్య శ్రీలునగుత!
స్వామి! మీ దౌ కృపాధుని సాకవెపుడు

కృతిసమర్పణ

కరుణ గలట్టివాడు; తుర
గాస్యుడు; వాసరవాగ్వధూటి; శ్రీ
గురుపురుషోత్తమార్యుడు న
కుంఠిత సత్కృప పల్క జేయుగా
వరదుడవైన నీ దయలు
వర్షిలనన్ పలికింపజేయుగా
సరసత బల్కి తీకృతిని
స్వామి! దయన్ గొనుమయ్య! యిచ్చితిన్

ఫలశ్రుతి

ఎవ్వరు నీకృతీందిరను
నేర్పడ నిత్యము భక్తిచిత్తులై
నొవ్వని క్షేమమొప్పగ మ
నోజ్ఞముగన్ పఠియించుచుందురో
దవ్వున జేరువారిని స-
దయురగా చలవాసు సత్కృపల్
తవ్వలకొద్ది రవ్వలు ను
దారత గల్గను వారి కిమ్మహిన్ ౭

నీ రమణీయ పాదముల
నిల్పి మనంబున నిర్మలాత్ములై
ఆరని భక్తి తత్పరత
లందగ కామ్య విహీన చిత్తులై
కూరిమి మీరని న్గొలిచి
కోరిభజించెడు భక్తకోట్లకే
నీ రుచిరైక సత్కృపలు
నెమ్మిన దక్కునటయ్య శ్రీపతీ !

## శ్రీ శ్రీనివాస సన్నుతి

ఈ పాదమే కదాయిలనెల్ల గొలిచింది,
ఈపాదనమునె బ్రహ్మ యెటిగికడిగె
ఈ పాదములె గదా యిందిరా కరముల
కితవయ్యె యనురాగ వితతిగూర్చె
ఈ పాదమే కదా ప్రాపయి గంగకు
పుట్టినిల్లై లోక పూజ్యతనిడె
ఈ పానమే గదా యిభరాజు కఘమూడ్చి
భవ మూడ్చి యిడె పరబ్రహ్మపదవి
ఈ పదంబులె ద్రౌపది యిడుములుడిపె
ఈ పదంబులె భక్తుల ప్రాపకములు
ఈ పదంబులె వేంకటగిరి కిరవులు
ఇహ పరంబుల నొసొగెడి శ్రీపదములు
తాల్మి మది వెల్గ నాభవతారకములు

ఏ పదాబ్జము బ్రహ్మాండ మొగసియుంటె
ఏ పదంబుల వెదకి రింద్రేశ బుధులు
ఏ పదంబులు పెను శిల నింతిజేసె

ఆ పదంబులె యిహ పరతారకమని
అవని వేంకటగిరి పదాలని నతింతు, ౨

ఆల సోమకుని జంపి యాగమాళిని దెచ్చి
అజు కొసగిన మేటివౌపదములు
అల మంధరము మోసి యమృతభాండముదెచ్చి
వేల్పుల కిచ్చిన వేదములు
క్రూర దైత్యుల గూల్చి వీరతన్ పుడమిని
పేర్మి పైకెత్తిన వే పదములు
దుడుకు రక్కసి గూల్చి బుడుతను గరుణించి
విబుధులనేలిన వేపదములు
పరగ మరుగుజ్జు రూపమై బలిని నడచి
విశ్వముల నెల్ల గొలిచిన వేదములు
ఆపదల నెల్ల బాపెడి వే పదములు
ఆపదంబుల మది నెంతు నయ్య! యెపుడు ౪

క్రూరులౌ పరిపంథి వీరులౌ రాజుల
పడ గూల్చి ధర నేలు పదములనుచు
అల రావణాదుల హతమార్చి ధర్మమున్
వసుధనిల్పినవైన పదములనుచు
చండ కర్కశ జరాసంధాది దౌష్ట్య భూ
పతుల నొంచిన వీర పదములనుచు
దురభిమాన కుశీల దుర్యోధనాదుల
మదమడంచిన శౌర్యపదములనుచు
పాపులను గూల్చు కల్కివౌ పదములనుచు
భక్త తతి నెల్ల గాపాడు పదములనుచు
మదిని దలపోసి నా స్వామి పదయుగళిని
శరణ మంటిని రక్షించుస్వామి! నన్ను ౫

అలకరిరాజు నేలితివి
యా ధ్రువునిన్ సతియాజ్ఞ సేవినిన్
చెలిమిన స్నేహశీలుని కు
చేలుని కుబ్జను గోపికాదులన్
అలఘుల పాండవేయులన
నన్యుల శాంతనవాది భక్తులన్
పలుకృపనేలినావు బరు
వా ననుగావగ శ్రీ శ్రియఃపతీ ! ౬

నిను నెఱ నమ్మినాను మది
నిల్పితి నీ చరణాబ్జ యుగ్మమున్
మననముసేతు నెల్ల పుడు
మానక నీ గుణ నామ కీర్తనన్
తనియగ నిన్ జపించెదను
తావక దాసుల దాసదాస సే
వను విడనాడలేదు గన
వా నను దిక్కరియున్న దీనునిన్ ౭

శ్రీమధురైక మానసవ
శీకరసుందర! సత్య ధర్మదీ
క్షామహనీయమూర్తి! నత
సాధుజనాదరణీయ కీర్తి స-
ఫణిభూషణ ! నతుడ శ్రీనివాసాభరణా !
త్కామిత దానశీలి! భవ
కాననదాహక వీతిహోత్ర! ఓ!
సామజరాజసద్గమన స్వామి!
దయన్ గరుణించు దాసుడన్ ౮

ఫణి రాడ్గిరి నారాయణ !
మణివర్ణా! పరమయోగిమానితచరణా!
గణ నీయకృపో ద్వితరణ!
ఫణిభూషణ ! నతుడ శ్రీనివాసాభరణా ! ౯

సప్త సంతానముల తీరు సాగియున్న
సప్తగిరులకు నేతవై జగతి నేల
కలియుగంబున వెలసిన కమలనాభ!
మీ పదంబుల శరణంటి ప్రాపునిడవె ౧౦

అరయ కడలిన నలలకు నదుపులేదు
మదినిగల కోరికలకింత మదుపులేదు
అలల యాశలునిలుకడ నందినపుడె
నిన్ను దెలియుట యగునంద్రు నిజగురువులు ౧౧

మనసు నిలువదు మనసులో మసలుచున్న
ఆశలాగవు బ్రతుకు భారమ్ముతెగదు
పట్టుకొని యున్న చీకటి పాసి పోదు
బ్రతుకు తెల్లారదెపుడు శ్రీరమణ! గనవె ౧౨

పూని చూచిన జగమొక బొమ్మలాట
మాయకిట కట్టుబడిన బొమ్మలముమేము
సూత్రధారుడవయి స్వామి! చోద్య మొప్ప
పరగనాడింతువంట నాబ్రతుకుగనవె ! ౧౩

గాంచ నీ నామకీర్తనే కలియుగాన
భవము దొలగించి ముక్తి సత్పథముజూపు
శాస్త్రమిదియని సూరులు చాటినారు
స్వామి!కీర్తించితిని నిన్ను సన్నుతించి ౧౪

సకల దుఃఖోపశాంతి దుష్కలి హరమగు
స్వామి మీ నామ కీర్తన సలుపుచున్న
దీనుడను రార! శ్రీహరీ దిక్కు నీవె
దానవాంతక! నతుడ నీ దాసు గనుము ౧౫

శోభలల రెడియత సీసుమాభ దేహ!
నవ్వులొలికెడి చల్లదనాల చూపు
కరుణలొల్కించ పుండరీకాక్ష! దయలి
వినతుడౌ వీని నేలవె వేంకటేశ! ౧౬

చెలగి తిరువేంగడమున వేంచేసియున్న
దైవరాయడె మాలిదైవ మనుచు
మదిని దలపోసి యన్యంపుమతలుడిగి
చేరి శరణంటి కరుణింపు శ్రీనివాస! ౧౭

ఇతిశమ్

ఇయ్యది

శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవంబున శ్రీ శ్రీనివాస ప్రభు

తారాహారము - సన్నుతి - అను అష్టమసర్గసర్వము

శ్రీ శ్రీనివాస విభుపాదపద్మార్పణమై

ముగిసినది

శ్రీశుభంభవతు

శ్రీః

శ్రీః
శ్రీ హయ గ్రీవాయ నమః
శ్రీ సరస్వత్యై నమః
శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీ శ్రీనివాస దివ్య కళా వైభవము

# శ్రీ శ్రీనివాసదివ్య కళా చతుష్షష్టిః

## నవమ సర్గము

శ్రీరమణుడు శేషాద్రిపు -
రీ రమణుడు స్వామి పుష్కరిణి తీరమునన్
చారు కళానిలయుడు సం
చారుడునై నిలుచు నాదు స్వాంతమునందున్ ౧

శ్రీ తరుణీ మనోజ్ఞముల
జల్వములన్ (1) ప్రణయానురాగమున్
ఖ్యాతిగ విశ్వమంతట
నఖండ శుభంబుల వెల్గజేయు మా
యాతత సృష్టి సంస్థితిల
యాఢ్యము వేంకట రూపమౌ పరం
జ్యోతి శుభంబులిచ్చి దయ
జూచుచు మన్మదివెల్గు నర్మిలిన్ ౨

శారద నీరద సుస్మిత
చారు విశేష నవాబ్జ శారద కరుణన్
పేరిమి నలరెడు వాఙ్మయ -
శ్రీరుచి నిడ స్వామి! నిన్ను జేర నుతింతున్ 3

---

(1) కరుణానురాగమున్

సంగతిగ భువన వితతికి
రంగగు సిరి సంపదిడుచు రాజిలు శుభస -
న్మంగళ దేవత దివ్య-
న్మంగళమిడి బ్రోవ; నిన్ను నర్మిలి గొలుతున్ ౪

సులలిత కవితా సుందరి
నలరించెడు శ్రీనివాస నయగుణ కవితా
కళ లీనజేసి విబుధులు
చెలిమిని నిడి బ్రోవ; మిమ్ముజేర నుతింతున్ ౫

కరుణారస పరిపూరిత
వర సులలిత మధుర హృదయ పంకజ విభవా!
శరణాగత జన వత్సల
బిరుదాంకిత శ్రీనివాస! పేర్మి నతింతున్ ౬

ఉరగా చల మందిర సుం -
దరవరదా! శ్రీనివాస! ధర్మవిశేషా!
పరమాశ్రితజనపోషా!
స్థిర సద్గుణ వేంకటేశ! శ్రీశ! నుతింతున్ ౭

ఉరుతర మృదు మంజుల భా
సుర తరుణా రుణన వాబ్జ సుందర చరణా!
సురుచిర కరుణా భరణా!
వరవేంకటరమణ! శ్రీనివాసా భరణా! ౮

సరసీరుహ మృదులోద్గుణ
నిరవద్యానంద పూర్ణ నిర్మల కరుణా
భరవయవా! నుత చరణా!
ఉరగ వగా భరణ! వినతు లో శ్రీరమణా! ౯

పారావారకృపా కర!
ధీరా! గంభీర! సాధుదీనవిహారా!
రారా! బ్రోవగ సుందర
దారాధర నీల దేహధారా! కొలుతున్ ౧౦

శ్రీ గిరినాథ! సర్వేశ్వరా! మామక -
చిత్తషట్పదము మీ చెలిమిగోరి
భవదీయ పదపద్మభవ్య సంపదలందు
వీడని భక్తి దారాడవెంచె
పరిపూర్ణ సత్కృపా భాసుర గుణమూర్తి!
పరికింపరా! స్వామి! కరుణ గల్గి
నిను దప్ప నన్యంబు నింతైన గనలేదు
శరణని వేడి నీదరికి జేరె
చేతనా చేతను నెల్ల చిత్తమలర
ఎంచి వాత్సల్యమున గరుణించినావె
దాసుడగు వీని చిత్తమున్ దయల గనుము
విశ్వపతి! శ్రీ శ్రియఃపతి! వేంకటపతి! ౧౧

నా చిత్తము మీ పదముల
దాచిన ధనమనుచు జేరె దాస్యత మీరవ్
ఓ చతురాననసన్నుత!
మీ చిరు నెనరుంచి బ్రోవు మీశా! వినతుల్ ౧౩

పరమ దయానిధీ! కరుణ
బంచుము నీ పద దాస దాసుపై
నిరుపమ భక్తి తత్పరత
నిశ్చల భావము; నిర్వికారముల్

స్థిరముగ జేసి నీ చరణ
సేవల దాసుని కంద జేసి బ్రో
వర! పురుషోత్తమా! పరమ
పావన! నీకు నతుల్ శ్రియఃపతీ! ౧౩

నా మనోలక్ష్మి మీ పాద నళిన యుగళి
వీడకుండగ జేయుము వేడుకొందు
చంచలముగాని భక్తిని సాధు విధిన
వెలుగ చేయుము నతులివే వేంకటపతి! ౧౪

నిదురలేచి మరల నిదురించు వరకు నా
చేత నొరులకింత చేటు గాని
కలుగకుండ జూడు కలిగించు ముపకృతిన్
చిత్త శుద్ధి బుద్ధి సిద్ధి నిడుము ౧౫

మామక చిత్తమందెపుడు
మత్సరముల్ విషయానుకూల దు
ష్కామన లెల్ల రెచ్చిపడి
సాగగ జేయకు మయ్య! వేడెదన్;
శ్రీమహితాత్మ! నీ చరణ
సేవలయందనిశమ్ము మన్మదిన్
ప్రేమన నిల్చునట్లు కృప
వెల్గగ జూడవె! శ్రీ శ్రియఃపతీ! ౧౬

సచ్చిదానంద సౌందర్య సత్యమూర్తి!
నిర్మలోన్నత జలధర నీల దేహ!
పరమకారుణ్యజలధి! ఓ పరమపురుష!
వినతుడను స్వామి! కరుణించు వేంకటపతి! ౧౭

రమ్య గుణగణ భూష పురాణ పురుష
పరమ దివ్యదయానిధీ! సరసిజాక్ష!
వరద! సర్వేశ్వరా! కృపా పారజలధి!
ఈశ! శరణంటిర! అనుగ్రహింపు స్వామి! ౧౮

నా యందున్ మిము గొల్చు భక్తి విభవ
జ్ఞానంబు వైరాగ్యమున్
ధ్యేయంబున్ గలిగించి సంతతము
మీ దివ్యాంఘ్రి పద్మంబులన్
పాయంజేయకుమంతె చాలు! కరుణా
పారాంబుధీ! దాసునిన్
మీ యవ్యాజ కృపైక పాత్రునిగ స్వా
మీ! చేయవే మ్రొక్కెదన్ ౧౯

మీ నిర్హేతుక జాయమాన కరుణా
మేయాతి దృక్సంతతిన్
ఈ నాపై ప్రసరింప జేయుమురు! యం
తే చాలు నీ జన్మకున్
నేనీ జన్మ దరించునట్లు కృప నెం
తేన్ సాగగా జేయవే
మీ నీరేజ పదైక దాసుడను స్వా
మీ! వేడెదన్ శ్రీపతీ! ౨౦

నిను నా చిత్తమునందు నిల్పుకొను శాం
తుల్ దాంతి శక్తి క్రియల్
ఘన సామర్థ్యము జ్ఞాన వైభవ మసం
ఖ్యాకమ్ము పెంపొంద జే -

సినజాలయ్య! భవత్కృపాగరిమతో
 సేవించి మీ యంఘ్రులన్
మననంజేయుచు నే తరింతుర! రమా
 మాన్యా! నతుల్ శ్రీపతీ! ౨౧

నిన్ను గొల్చు భక్తి నీయందు ననురక్తి
నిలుకడైన మనసు, నింద్రియముల -
నిగ్రహించు శక్తి; నెదగుషడ్రిపులను
గూల్చు యుక్తి నిడవె! కూర్మి దలతు ౨౩

దేవదేవా! సాధు దీనమందారమా!
 భక్తవత్సల! పరబ్రహ్మమూర్తి!
శ్రితపారిజాతమా! హితకల్పభూజమా!
 యోగిమానస రాజయోగహంస!
కల్యాణగుణ రాశి! కారుణ్యవారాశి!
 శరణా గతా వన చారుహృదయ!
ఆర్తజిజ్ఞాస సదర్థార్థి సన్నుత!
 సాధులోక శరణ్య! సత్యమూర్తి!
సర్వలోకైక పాలన జాయమాన -
పరమకారుణ్య పరిపూర్ణభాసమాన -
దివ్య సౌందర్య నవ్యాబ్జ భవ్యనయన!
విశ్వపతి! నతులివే నీకు వేంకటపతి!'' ౨౪

సద్భక్త వత్సల స్వామి వీవని వింటి
 పెను దీనులకు కల్పవృక్షమంటి
ధర నాకు నీవుగా కొరులు లేరని యుంటి
 నిన్నాశ్రయించి నే నిర్భితంటి

భవబంధములనెల్ల పారదోలుదువంటి
నీ పదాబ్జములె నా ప్రాపెయంటి
అజ్ఞాన తిమిర సంహారి వీవని వింటి
విజ్ఞాన భాస్కర విభుడవంటి
ఆర్తజనులకు నభయప్రదాయివంటి
ధూర్తులకు ధూమకేతువై తోతువంటి
నిన్ను నమ్మిన నండగా నిల్తు వంటి
ఈశ! శరణంటి నిపుడు నన్నేలుమంటి ౨౪

సద్భక్త రక్షకుడ వని
సద్భక్తిన నిన్ను జేరి సాగిలితిని, యా
పద్బాంధవ! దుర్భవ సం
పద్బంధములూడ్చి నన్ను పాలింపు హరీ!'' ౨౫

దీనులకీవే దిక్కని
మానసమున నమ్మి నిన్ను మరువక భక్తిన్
జ్ఞానానందమయాకృతి!
నేనై శరణంటి గరుణ నేలుము స్వామీ! ౨౬

దేవ! యాశ్ర యించితిని నిన్ను; దీనుని
సఖ! అసత్తునుండి సత్తువరకు
పటు తమస్సునుండి వరపరంజ్యోతిన
జేర్చు కొనుము వినతి జేతునయ్య! ౨౭

మృత్యు ముఖము నుండి మేల్మినిత్యంబైన
సత్యమైన నమృత సరళి నంద -
జేయవయ్య! మ్రొక్కిచేరితి కరుణింపు
శేష గిరి నివాస! శ్రీనివాస!'' ౨౮

కరుణగలట్టివాడవని
కల్మష హారి వటంచు నిన్ను; నీ
చరణము లాత్మనిల్పి మన
సై శరణంటిని; చేరుకొంటి; నీ
దరి కిక నైన జేర్చుమురా!
దాసుని నింత ననుగ్రహించి; శ్రీ
ధర! యిహ సర్వ(1) దర్మముల
త్యాజ్య మొనర్చి నతించి (2)వేడితిన్ ౨౯

సర్వధర్మములను స్వామి! మీకైనేను
వీడినాను శరణం వేడినాను
పాపపంకిలంపు భవ బంధముల బాపి
తొల్మి నేలు దాస దాసునిగను'' 30

నీకు చెలగాటమా? స్వామి నాకు నిచట
ప్రాణ సంకటమాయె నీ భవములోన
పాప భూయిష్ఠలో కాన బ్రతుకలేను
ముక్తినిడుమయ్య! రక్షించి, మ్రొక్కుదయ్య !'' 3౧

పిల్లికిట చెలగాటమ్మ; తల్లడిల్లు -
ఎలుకకును ప్రాణ సంకట మలరి నట్లు
పరితపించితి దుర్భర భవమునందు
ఉద్ధరింపవె స్వామి ! చేయూత నిచ్చి, 3౨

ఆగ్రహోదగ్ర షడ్రిపుదూష్యమైన
రాగ రోగోరు సంసార సాగరాన
దారి తెన్నులు గానక దాట లేక
కొటుమిట్టాడుచుంటి గన్గొంటివయ్య ! 33

(1) సంపదల (2) చేరితిన్

మాయామేయ భవంబు నిత్యమని యే
మాత్రంబు స్వప్నాన; నే -
ధ్యేయంబందున నైన నమ్మను ప్రభూ!
యీయాలు బిడ్డల్ హితుల్
ప్రాయంబుల్ సుఖ దుఃఖముల్ విషయ దు
ర్వ్యాపారముల్ నిత్యతన్
బాయున్; మీ పదసన్నిధే స్థిరముగా -
భావించి నిన్ జేరితిన్.'' 38

పరమ దివ్యాచార్య వరుల సత్కృపలచే
పెళుసైన యఘముల విడిచివేసి
వారు చూపించిన పరమ సన్మార్గాన
సత్ప్రపత్తిన పేర్మిసాగ గలిగి
దేశకాలానుకూలాశయ సిద్ధులు
గలుగునట్లాచార గరిమనమరి
ఇతరాంతరములు గల్గించు భ్రమప్రమా
దములకు లొంగక దాటుకొనుచు
పలు విషయ వాసనల యూబిబారి నుండి
తప్పుకొని నీదు దివ్య పాదాంబుజములె
శరణమని సర్వధర్మాల బరగ ద్రోసి
చేరుకొంటిని శ్రీశ! రక్షింపుమంటి 39

సహ్యమౌ మిగుల నసహ్యమౌన పచార
దూష్యమై విషయ దుర్భాష్యమైన
జ్ఞేయమౌ మిగులనజ్ఞేయమౌనఘముల
భోజ్యమై షడ్రిపురాజ్యమైన

శక్తమౌ బహువిధాశక్తమౌ దుర్గుణ
సాధ్యమై ఈషణావాద్యమైన
త్యక్తమౌ ఫలమభివ్యక్తమౌ దురితసం
భుక్తమై తాపసంరక్తమైన
శాఠ్య దుర్వార దుస్తరా శా విశేష
రంగదుత్తుంగ కామ్యతరంగ రంగ
దుద్భవాబ్ధిన మోహాన దూకియాది
దాటకుంటిని శరణంటి దరికి జేర్చు 3౬

షడ్వర్గరిపులనేస్తంబులన్ సడలించి
తాపత్రయాగ్నుల దహనమార్చి
ఆశాపిపాస(దువ్యసనాల దొలగించి
ఈషణ త్రయపు పెన్ రోషముడిపి
సుఖదుఃఖమయమైన సుడిగుండములనుండి
తప్పించి కామ్యమున్ దాటివేసి
పాప పంకిలమైన భవవార్ధి దాటించి
మూఢ దుర్విషయ విముక్తి జేసి
రాజితోత్తుంగ కరుణాంబురాశివగుచు
నిర్మలానంద వాత్సల్య నిధులు నైన
విమల శ్రీ పుండరీకేక్షణముల నన్ను
పేర్మి కరుణింపుశరణంటి, వేంకటపతి! 3౭

కారుణ్య పరిపూర్ణ! కమలా యతేక్షణ!
కాఠిన్యమేల? నన్ గనికరింప
పద్మావతీ మనో ప్రాణనాథా! విభూ!
ఆలస్యమేల? నన్నాదుకొనగ

సర్వేశ్వరా! విశ్వసౌందర్యగుణమూర్తి!
అదనిది నన్ను కాపాడ గలుగ
అఖిలాండకోటి బ్రహ్మాండ శ్రీనాయకా!
ఆర్తు నేలగ సమయంబిదయ్య!
విశ్వవిఖ్యాతగుణగణ! వేదవేద్య!
సర్వవిజ్ఞాన సౌందర్య సత్యమూర్తి !
సకల విధులను వీడి నిన్ శరణమంటి
చేరుకొంటిని స్వామి! రక్షింపుమంటి'' ౩౦

పాహి మాం పాహి మాం పద్మావతీనాథ!
పరమ పురుషా! నిన్ను శరణమంటి
ఏహి మహ్యం కృపాం దేహి శ్రీగిరినాథ!
పరమ దయానిధీ! కరుణ జూపు
రక్ష మాం రక్ష మాం రాజీవదళ నేత్ర!
వేదనా పహ! భవా వేదన విను
త్రాహి మాం త్రాహి మాం దాసలోకశరణ్య!
దీన మందార! యీ దీను గనుము
సకల దురి తాపహాంబుజ చరణయుగళ!
శ్రితసుజనపోష! శ్రితుడ నిన్ జేరుకొంటి
పరమ కల్యాణ గుణగణస్వాంత! కరుణ!
శ్రీల నేలుము వాత్సల్య శ్రీనివాస!'' ౪౦

పురుషోత్తమా! కృపాపూర్ణసుధానిధీ!
నీ దయా మృతము నందింపవయ్య!
శ్రీనాథ! నారాయణా నందకల్యాణ
గుణ గణ పరిపూర్ణ! కూర్మి గనుము

పరవాసుదేవ! శ్రీ ప్రత్యక్షరంగేశ!
కరుణాపయోనిధీ! కావుమయ్య!
శ్రితహిత! సద్భక్త శ్రీపారిజాతమా!
వాత్సల్య హృదయ! కాపాడరార!
ఇహ పరమ్మున నాకు నెందెందునైన
నీవె దిక్కని చేరితి నిన్ను నమ్మి!
వమ్ము సేయక నా మనోభావములను;
కక్షసేయక రక్షింపు పక్షి గమన! ౪౦

శ్రవణ ఋక్షైక జాతక స్వామి నీవు
త్రిభువనైశ్వర్య మలరిన విభుడ వీవె
ఎవ్వరిల సాటి నీకు? శ్రీవేంకటేశ!
సాధు జన పెన్నిధి వని సాష్టాంగ పడితి'' ౪౧

ఇహ పరైశ్వర్య మిడు మని యాశ! నిన్ను
వేడనుర! కర్మ ధర్మాల వెలుగు బ్రతుకు;
కాని వేడుడు పుట్టువుల్ మాన జేయు
(1) నీ పదశ్రీల సన్నిధి (2) నిల్పుమంతె ౪౨

శ్రీ యురగాచలరాణ్మణి!
పాయని కల్యాణకర కృపాశ్రయగుణి! మా
నాయక మణి! వేంకట శ్రీ
నాయకమణి వెలుగుగాత! నా మది నెపుడున్ ౪౩

నీ కల్యాణ గుణ ప్రపంచమును నెం
తేన్ బల్కగారాదు; అ
నాకాధీశున కాబృహస్పతికి వీ
ణాపాణి కాధాతకున్

1. త్వత్పదశ్రీల నిలుపుము ప్రాంజలింతు, 2. నిల్పునన్ను.

నాకా పల్కుతరంబె? నా హృదయుల్
నా తీరు తెన్నుల్ సదా
నీకే తెల్యును గాన దాసునిగ న
న్నేలంగ రావే! ప్రభూ!' ౪౪

శారద చంద్ర చంద్రికల
చల్వలకే కొదవేమి లేదు; నీ
కూరిమిమీరు(వేడుకల) సత్కృపల
కోటులకే వెలితేమి లేదు! నిన్
జేరిన దాస దాసులకు
శ్రీలిడుట న్వెనకాడలేవు; ఓ
వారిజనాభ! నన్ కరుణ
వర్థిల నేలిన తక్కువేమిరా? ౪౫

అంతరంగ మందు హరిరాయ! నిను నమ్మి
కొలిచి నంత జాలు కొదువ లేదు
శుభము లెదగు పనుల నభయాన నెరవేర్తు
వనుచు నిన్ను గొలిచి మనగ నేర్తు ౪౬

మది నిను నమ్మి శ్రీగిరి ర!
మాధవ! నీ పయి భారముంచితిన్
వదలని భక్తిభావములు
వర్థిల నిన్ మనసార గొల్చితిన్
కదలక సత్ప్రయత్నముల
కామక నీవె యొనర్తువంచు నీ
పదముల జేర వచ్చితి శు
భాస్పద! దీర్పు మదీప్సితమ్ములవ్ ౪౭

ధృతి గల్గి దేశాల దిరిగి వేసారితి
నితరాంతరుల గొల్చి చితికినాను
గతి దొల్గ నితరుల గాంచి నే విసిగితి
మతి వోయి కులవృత్తి మాని చెడితి
ఆచార ధర్మాల నణచినే కుమిలితి
పసలేని ప్రియములన్ బలికి పడితి
కోవిదమ్మన్యుల గొలిచినే కూలితి
పెరదైవముల నమ్మి విరిగిపోతి
పూని ధనములకై కన్న పొళ్ళ గుడిచి
వేంకటేశ్వర! నీ సేవ వెలికి వేసి
చింత వంతల గుందితి చెదరి నీకు
వినతు నైతిని స్వామి! నన్ విసిగికొనకు'' ४८

మృగతృష్ణికలను నీరుగనెంచి భ్రమపడి
పరుగిడినట్లు నే పరుల గొలిచి
పెనుమేక మెడ చండ్ల పితికిన చందాన
పెడదారులం బట్టి విసువు చెంది
శశి విషాణమ్మును సాధించు పని తీరు
అన్యమతానుయా యాస మమరి
ఇసుమున దైలంబు నెసగదీసెడి భంగి
క్షుద్ర దేవతలను గొలిచి యలసి
బుద్ధ గలవాని వ్రాతగా పూని హీన -
బుద్ధితో వ్రాతలను వ్రాసి పొక్కుచుంటి
శక్తులన్నియు వ్యర్థమై చతికిల బడె
పొగిలంబడి శరణంటి స్వామి! నిన్ను ४६

పాల ముంచిన నీట నంబరగముంచ
స్వామి! నీ భారమయ్యా! నే వాదు బడను
శిష్టజనసూక్తులను బెడచెవినబెట్టి
ఫలము బొందితి కుంది నీ పాలబడితి'' ౫౦

తెలిసియో తెల్యకెన్నియో బలిమికొలది
చేయజాలని పనులను జేసినాను
మదన పడినాను తిరిగి పల్మారుజూచి
శరణమని చేరితిని నీదు చరణములను ౫౧

నిన్ను గానకలేక నెద సన్నుతాం గినీ
విరహాన తపియించె విసిగిపోక
నిన్నెంచి నా చిత్తమన్నుల మిన్నయై
నీ ల తమాలాల నెదన జేర్చు
అరసి నీ మాహాత్మ్యమాకాశతత్వమం
చఖిలదిక్తతిన నీ జాడనరయు
సర్వతోముఖుడవు సకల వ్యాప్తుడవని
ప్రతివారి నడుగు నిన్ ప్రశ్నజేసి
తలపునను వాక్కునను మనోజలజమందు
దివ్య మంగళ విగ్రహ దీప్తి నెదుగు
భవ్య భవదాకృతిన్ పరిష్వంగమిడును
విభుడ! మన్నించి నా మనో ప్రియను గావు'' ౫౩

ఆపద మ్రొక్కులవాడ! కొండలరేడ!
పిలువ నోయని పల్కు పెద్దరేడ!
ముల్లోకముల నేలు చల్లని దేవుడా!
వేంకటగిరి ప్రోడ! వేల్పురేడ!

వడ్డి కాసులవాడ! వారిజనాభుడా!
        గొల్రాలికిని సుతుంగూర్చువాడ!
కోరిన భక్తుల కోర్కె దీర్చెడివాడ
        వైకుంఠరాయ! గోపకులరేడ
సుదతి యలమేలుమంగకు ముదము గూర్చు
మదనజనకుడ! శ్రితుల సన్మాననముల
నందమలరగదిరిగెడు నంచరేడ!
కోరి శరణంటి నిన్ సిరికొండరేడ!'' ౨౪

ఏడుకొండలలోన నెదుగగా నెలకొన్న
        నీలికలువల కోనేటిరాయ!
కోరు భక్తులకెల్ల కొండలంత వరాలు
        మెచ్చి పేర్మలు పొంగ నిచ్చువాడ!
ఘనులైన పరమ భాగవతుల మ్రొక్కులం
        దినవాడ! కూర్మ లందిడినవాడ!
శరణం జొచ్చిన నార్త సద్భక్త జనులకు
        నెమ్మిదయాభిక్ష నిడినవాడ!
భక్తులై నిన్ను సేవించువారి బ్రతుకు-
లెల్ల పెనవేసి నీ గిరిన్ కొల్లలయ్యె
తమను సేవించి తరియించె దైవరాయ!
నన్ను గాపాడరార! నిన్ నమ్మితినిర! ౨౫

కుమ్మరి దాసుడా కురవర తిరునంబి
        ఇమ్మన్న వరముల నిచ్చినావు
దొమ్ములు సేసిన తొండమాన్ భూపతి
        చేర బిల్చిన నమ్మి చేరినావు

తొలగమచ్చిక తిరుమలనంబితో చాల
విచ్చలవిడి పల్కివొచ్చినావు
తిరుకచ్చినంబిని కరిగిరి పురి నుండి
పేర్మిన కృపల రప్పించినావు
వేంకటేశుండవై భక్త వితతి నెల్ల
మంచితనమునగరుణ బాలించినావు
ఈశ! నేరములున్న మన్నించి నన్ను
నెంచి నీ దాస దాసుగా నేల రావె!'' ౫౧

బృందారకాధీశ వందిత పదపద్మ!
ఇందీవరశ్యామ! సుందరాంగ!
ఇందిరాకుచతటోచ్చందనాంకితవక్ష!
వైజయన్తీగళోజ్జ్వల మనోజ్ఞ!
నవరత్నఖచిత సుందరహేమమకుటాగ్ర
భాసుర సులలిత బర్హిపింఛ!
గోపీ మనోరాగ గుంభితకువలయేం
దిందింది రా! మార దేవ జనక!
ధగ ధగద్గితకౌస్తుభాదరణ నవ్య
రమ్య శ్రీవత్సభూషితోరస్థలాఢ్య!
సరస వంశీ వినోద! శ్రీ గరుడ గమన!
కావ రావయ్య! నతుడ నన్ కమలనయన! ౫౨

నిగమాది శాస్త్ర సన్నుత!
అగణిత కల్యాణ గుణగణాద్భుతనేతా!
నగ వర గిరి నాయక! ప
న్నగశాయీ! కరుణనేలు నన్, శుభదాయీ! ౫౩

కరిపురనాథా వన! వర
కరివరదా! కమలనయన! కరుణాభరణా!
సరసీరుహసమవదనా!
తిరువేంకటగిరి విహరణ! దివ్యవితరణా!'' ౩౮

సరసీరుహ సింహాసన!
కరయుగళరథాంగ శంఖకాంత్యాభరణా!
శరణా గత సుజనా వన!
కరుణారస కమలనయన! కాపాడవె నన్'' ౩౯

రక్తాబ్జలోచనా సక్తజాజ్వల్య మా
నాభీల భ్రూవిద్యుదాభ లీల!
ప్రళయఝంఝానిలోద్భ్రష్టి కాపూత్కార -
భాసురోచ్ఛ్వాస నిశ్వాసజాల!
కులగిరి కుంభి నీ కుముదారి శశినభో -
చ్ఛలన సద్విథి లస చ్చండఖేల!
విపులోగ్రవదన దుర్వివరాతిదహనని
ష్ఠ్యూతోరుదంష్ట్రికాటోపభీల!
వివిధ జీవైక సంతాన భువనమగ్న
కరణ ప్రియకర గుణగణా గాధజలధి
భవ్యలీలానుకూల! నిన్ ప్రస్తుతింతు
శేషగిరిరంహ! వేంకట శ్రీనృసింహ!'' ౬౧

దారుణోజ్జ్వల ధగధగద్దగిత దంష్ట్ర
ఘట్టనోద్భూత విస్ఫులింగాగ్నిచటుల
దాహితారాతిఘోరదుర్దైత్యపటల!
నతులివే నీకు వేంకట నారసింహ!'' ౬౨

శ్రీవైష్ణవులు నిన్ను శ్రీపతి యని గొల్తు
 పరగ వేదాన్తులు బ్రహ్మ మనుచు
చేరి కొల్తురు నిన్ను శివుడని శైవులు
 పరగ కాపాలికుల్ భైరవుడని
శాక్తేయులిల నిన్ను శక్తిరూపని కొల్తు
 తగు దర్శనంబని దార్శనికులు
ఘనుడు బుద్ధుండని గాంతురు బౌద్ధులు
 అరయు మీమాంసకు లర్థమనుచు
అల్పకాములకిల నీవు నల్పుడవుగ
ఘనమతులకీవు త్రిభువన ఘనుడవుగను
కాన నౌదువు స్వామి! నా మానసైక
పరమహంసగ నినుగొల్తు ప్రస్తుతింతు! ౬౨

నీ వలన నాకు కొరతలు లేవు దేవ!
నీరు కొలదిగ తామరై నెగడు దీవు
సకల గంగాది నదులు నా జలముగాదె
వివిధ నామాల నొకడ నీవేర స్వామి! ౬౪

-::: శరణాగతి :::-

వివిధమున నీవె యొకడవై విశ్వమందు
వెలుగుచున్నావు సూర్యదేవులను బోలి
నీవె సకలమ్ము మాకు నో నీలవర్ణ!
వినతుడను బ్రోవు శ్రీపతీ! వేంకటపతి!

ఏ పాద పద్మంబు నిలవెల్ల గొలిచెనో
 ఆ త్రివిక్రమ రూపమునాత్మగొలిచి
ఏ పాద పద్మంబునెటిగి తా బ్రహ్మన్న
 కడిగి భక్తిన ముక్తి కాద్యుడయ్యె

ఏ పాద పద్మ మే యిల గంగపుట్టిల్లో
త్రిభవన పావన విభవయయ్యె
ఏ పాద యుగళి శ్రీయింరాబ్జకరాల
రాగానురాగాల రక్తి నలరె
ఏ పదంబులు కరిరాజు నెదిగి గాచె
ఏ పదంబులు ప్రహ్లాదు నేలుకొనెనొ
ఆ పదంబులు సకలా పదాపహ మని
చేర శరణంటి వేంకట శ్రీనివాస!'' ౨

ప్రణయమున నార్తితో భక్తి భావమెదగ
నెందఱెందఱొ భక్తులు నెదన మిమ్ము
నెంచి సేవించి మిగుల తరించినారు
స్వామి! దాసుని గరుణింపు శరణమంటి!'' ౩

అన్నమయ్యయు పెద తిర్మలయ్య చిన్న
తిరుమలయ్యయు తిమ్మక్క పరమభక్తి
వెంక మాంబయు మిము గొల్చి విధి దరించి -
రాశ్రయించితి వేంకట రమణ! నిన్ను'' ४

''శరణమన్నట్టి యెంతటి దురితునైన
చేరి రక్షింతు'' నన్న శ్రీ చారు హృదయ!
శరణమని చేరుకున్నాను కరుణ నేలు
విశ్వపతి! శ్రీ శ్రియఃపతి! వేంకటపతి! ౫

**(సమర్పణము)**

స్వామి! యీ దివ్య సత్కళా సరసకృతిని
మీ పదాబ్జాల నిడుకుంటి ప్రాపు జూపి
ఆర్తు నేలవె శ్రీ వేంకటాద్రి రమణ!
మంగళము నీకు శత కోటి మంగళములు ౬

(ఫలశ్రుతి)

ఈ చతుష్షష్టి సత్కళా శ్రీనివాస -
కృతిని నెవ్వరు పఠియింత్రు వితత భక్తి
నాయురారోగ్య వైభవ శ్రేయులొందు
రక్తి నాసక్తి గలిగి శ్రీరమణు గాంత్రు!''

ఇయ్యది
శ్రీ శేషాచలాధీశ్వర శ్రీనివాస దివ్యకళాచతుష్షష్టి సర్వము నవమ సర్గము
శ్రీ శ్రీనివాస పాదపద్మార్పణమై ముగిసినది
-::: శ్రీ శుభం భవతు :::-

శ్రీః

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీమదలమేల్మంగా సమేత శ్రీ శ్రీనివాసాయ నమః

శ్రీమహాసరస్వత్యై నమః

శ్రీ శ్రీనివాసదివ్యకళావైభవము

# శ్రీ శ్రీనివాస ప్రపన్నగాయత్రి

## -: దశమ సర్గము :-

శ్రీ మంగాసతి హృదయుడు
క్షేమంకరుడురు కృపార్ద్ర శీతలజలజ -
శ్రీమానిత నయనుడు స
త్ప్రేమాకరు డెపుడు బ్రోచు వేంకటపతి నన్ ౧

ఓంకార రూప వైభవ!
సంకట హర! భక్తలోక సన్నుతపదస
త్పంకేరుహ! త్రిజగత్పతి!
వేంకటపతి! శ్రీపతీ! కృపేధిత సుమతీ! ౨

శేషగిరీంద్ర వాస! అతసీ
సుమనీరద నీలభాస! శ్రీ
శేషఫణీంద్రశాయి! వివశీ
కృత భక్త హితానపాయి! శ్రీ
శేషఫణి ప్రశస్తమణి చి
హ్నిత భూషణ! సాధు సన్నుతా
శేష శుభాస్పదైక గుణ

సింధు! కృపామతి! బ్రోవు శ్రీపతీ! 3

షాడ్గుణ్యోజ్జ్వల కీర్తి వైభవకళా
స్వామీ! జగత్పాలనా
రాడ్గుణవ్యూండవు నీవె కావె జగదా
రాధ్యా! విభూ! దేవతా
రాడ్గౌరీశ దిగీశులాసురులెదన్
రంజిల్ల నిన్ గొల్త్రు వి
భ్రాడ్గాంభీర్యగుణా! దయన్ గనవె! దే ౪

రావ! దాసుడన్ శ్రీపతీ! బహుతము మామక
హృద్రోగాఽవహము; శత్రుషడ్వేయము, దు
ర్వ్యిద్రోహమ్ములు గలచెను
భద్రా! రక్షింపు మిపుడె భవదీయుడ! నన్'' ౫

శారద చంద్ర చంద్రికలు
జాల్కొను లే ముసినవ్వుసొంపుపెం
పూరగజేయు చందురుని
బోలిన చక్కదనాల మోము, సో
కూరెడు నిల్వు నామములు -
గుల్కెడు నెన్నుదురంద మొల్క; బం
గారపు పట్టు చేలములు
గల్గిన వేంకట రాయ! మ్రొక్కెదన్'' ౬

యమకాలపాశ బంధము
నయముగ మెలమెల్ల గ దుమ నంటగ బట్టున్
భయముడుపెడు నభయప్రద
జయహస్తము నాత నిడవె! శరణంటిని నిన్'' ౭

విబుధ సుజన భక్త విజ్ఞాన వేదివి
ఆర్తు లైన శ్రితుల కాప్త మతివి
సకల గోచరుడవు సాధుజిజ్ఞాసికి
అర్థిజనుల కీవె యర్థపతివి'' ౮

పద్మంబులు భక్తులహృ
త్పద్మంబులు నీకు నెపుడు ధర్మావనస
త్పద్మంబులు సన్నిధులవి
పద్మా హృత్పద్మవాస! ప్రణతులొనర్తున్ ౯

హేయంబె పునర్జన్మము
త్రోయంగనరాని భవపుదోషము నిక రా
నీయక నీ పద సన్నిధి
బాయుగ జేయకుము నాకు బల్మరు గొల్తున్ ౧౦

వేంకటగిరి నాయక! దు
స్సంకట హర! భక్త చిత్త జలజాళీంద్రా!
సంకోచ మేల? నీ పద
కింకరుడగు వీనిగావు కీర్తింతుర నిన్ ౧౧

★ కమలాక్ష! నిను మ్రొక్కు కరములే మకరములు
    అన్యమ్ములవి శ్మశానపు కొరువులు
కమలేశ! నిన్గాంచు కన్నులు కన్నులే
    అన్యంబులవియు పొడైన గండ్లు
శ్రీశ! నిన్ బల్కెడి జిహ్వయే జిహ్వయు
    అన్యముల్ మలినగ హ్వరపు తెరలు
మాన్య! నిన్ దలచెడి మనసె మనస్సౌను
    తగవన్యములు ప్రేత తల సుమములు

శ్రీనాథ! నిను మ్రొక్కు చేతులే చేతులు

నీ కొనర్చిన భజనయే నిక్కమైన
భజన యది యౌను, నన్యదుర్భజనలెల్ల
జన్మ నిష్ఫలమై హీనజన్మలకును
కారణము లౌను నిజము దుష్కలినిబెంచు ౧౨

వింటే నీ కథ వినవలె
తింటే తినవలెను నీదు తీయనిలడ్డున్
అంటే నీ పలుకనవలె
కంటే నిన్ జేర్చు సుతుని గనవలె వవనిన్ ౧౩

శౌనకుడవు భువనాళి కు
పాసకదైవంబ వీవె! భక్తులకు దయా
భాసురహృదయాంబుజుడవు
దాసుల కిరవైన దివ్యధామము నీవే ! ౧౪

యమ నియమాది సద్విధుల
యందిసుమంతయు చిత్తవృత్తి ధ్యే
యము గనదించుకైన యమ
యాతనగూర్చెడి దుర్భవైక మో
హమున మునింగిపో నహర -
హంబుదపించి కృశించుగాని; నిన్
స్థిమితముగాంచి చేరదని
చింతిలితిన్ నిను జేర వచ్చితిన్ ౧౫

ధీ యోగంబున నిష్ణన
రేయోగీంద్రాదులైన; శ్రేయస్కరమౌ
ధ్యేయంబున్ నీపై నిడు
మాయని సద్భక్తి యోగమౌ నిష్ణనగన్ ౧౬

మనుజ జన్మ కెపుడు మరుజన్మ రాకుండ
వెలగ వలయు నన్ను వేంకటేశ!
ఫలము గోర కెపుడు భక్తితో నీ సేవ
రక్తి జేయ జన్మ రహితు డతడు ౧౭

హితుడవు మాకు నాప్తుడవ
హీనశుభాస్పద నిత్యసత్యరా
జిత గుణవైభవాఢ్యుడవు;
శ్రీరమణీమణి మానసాబ్జశో
భిత వరరాజ హంసుడవు
పేర్మిన సజ్జన భక్తలోక సే
విత పద పద్మ మీ వనుచు
వేంకటనాయక! నిన్ను కొల్చితిన్'' ౧౮

తత్తావక శుభవైభవ
చిత్తాబ్జము కరుణ రసము శ్రీలలరారన్
విత్తంబుల గురిపించుచు
హృత్తాపము మాన్పి భక్తహితమొనరించున్'' ౧౯

నః కృత కైంకర్యంబు ల-
ధః కృతముల్ కాక మీ పదంబులవెలుగన్
వః కృత కరుణ శ్రీలిల
నః కలిమల కులము నెల్ల నార్పగజేయున్'' ౨౦

శ్రీయలమేలు మంగపతి
శ్రీగిరిరాట్పతి మామకీనమౌ
మాయని భక్తిబావమున
మంజులమౌ హృదయాబ్జమందు ప్రే -

మాయుతుడౌచు నిల్చి మము
మాన్యత లొప్పగ వత్సలాత్ముడై
పాయక బ్రోచునంచు నిను
స్వామి! నుతించుచు చేరితిన్ ప్రభూ!'' ౨౧

నిను మదినమ్మి యన్యముల
నెంతగ భావనలందు వీడి; నీ
ఘన పదపద్మ యుగ్మములె
కల్మషమూడిచి రక్షసేయు నం
చనిశము గొల్చి కొల్చి తమ
సన్నిధినే శరణంచు నిల్చితిన్
వినుతయశోవిశాల! కృప
వెల్గగ నన్ దయజూడు మ్రొక్కెదన్'' ౨౨

వాసవ ముఖ్యులాది సుర
వర్యులు; దేవగణాదు లాశ్రితుల్
నీ సరసీరుహాంఘ్రులను
నెమ్మనమందున నిల్పి భక్తులే
దోసములార దుర్భవపు
దుఃఖములార నతించినారు; నే
నా సరివాడగాను కృప
నందిడి దిక్కరువాని నేలుమా! ౨౩

సరసుడ గాను మీ చరణ
సన్నిధినందెడు శక్తిలేదు పా
మరుడను; దుర్భవాంబుధిన
మగ్నుడనై దరిదాపులేక మీ

చరణ నవాబ్జపోతముల
సాయము గోరుచు వచ్చినాడ, సు
స్థిరవృష భాద్రివేంకటపతీ!
కృప సేయవె శ్రీ శ్రియః పతీ!'' ౨౪

ప్రభువని నిన్ను జేరితిని ;
భక్త జనా మర భూజమంచు నీ
యభయము గోరివచ్చితిని ;
యారనిదుర్భర బాధ కోర్వకన్ ;
నభము ధరాతలంబు వెద
నార్తిన నేకముగా గనేడ్చితిన్
అభయ మొసంగి వేంకట ర
మాపతి! ప్రోవవె ! శ్రీ జగత్పతీ! ౨౫

చోద్యంబులు త్వద్గుణములు
హృద్యంబులు భక్తలోకహితపాలనముల్
వేద్యంబులు నిగమాళిక
భేద్యంబులు మహిమ లెల్లవేంకటరమణా! ౨౬

దనుజకులారి! యిమ్మహిని
దౌష్ట్యమతుల్ కలికాల భైరవుల్
మనుజనిశాచరుల్ ఖలులు
మత్సరచిత్తులు స్వార్థపూర్ణులై
అనవర తమ్ము సజ్జన భ
యంకరులై విహరించుచుండగా
కనుగొని యుండలేను భయ
కంపితుడన్ శరణంటి ప్రోవవే!' ౨౭

యాతనలందు; దుర్భవభ
యంకర బాధలయందు; జిక్కి వి
ఖ్యాత చరిత్ర! డీలువడి
కానగరాని వికారవీధులం
దాతత రోగతప్తనయి
తాలిమి బాయగ ద్రోవ దప్పి, స్వా
మీ! తమకై తపించితి, న
మేయ గుణా! కరుణించి బ్రోవు నన్ ౨౮

## -: వినతి: -

గేస్తుడవంచు నాశ్రిత ని
కేతను వీవె యటంచు స్వామి! నీ
వాస్తవ సత్కృపాదరము
వర్తిల జేసెడి వాడవంచు; నిన్
ఆస్తిని పాస్తిని నిమ్మనక
నర్మిలి వచ్చితి నిన్నుకొల్వగా
కాస్త దయన్ గనయ్య! బడు
గన్ శరణంటినిరా! రమాధవా!
కరుణామయహృదయాంబుజ!
గిరివరజయ వేంకటాద్రిగేహనివాసా!
శరణంటిని మిము జేరితి
కరుణింపవె వినతి గొనవె! కాపాడగదే! ౨

వేల వెలుంగు రేడొకడె

వేలగు జీవుల కొక్కడొక్కడై

లీలగ దోచినట్లు నిఖి

లేశ్వర! యొక్కడ వీవె యాచు లీ

లాలలితో ద్విభూతివ వి

లక్షణ రూప సహస్రమూర్తివై

లీలల వెల్గి జీవుల క

రిందమ! తో చెదవయ్య! మ్రొక్కెదన్''

3 (ఫలశ్రుతి)

అనిశమీ ప్రపన్నైక గాయత్రి నుతిని

భక్తి ననుదినంబెవ్వరు శక్తికొలది

పఠనసేతురొ వారికి వరలు మిగుల

నిహపరశ్రీలు, హరి కృపల్ నిలిచి కలుగు''

ఇతిశమ్

ఇయ్యది

శ్రీ శేషగిరివాసుడైన వేంకట శ్రీ శ్రియఃపతిపాద

పద్మంబులందు సమర్పితమై శ్రీనివాసప్రపన్నగాయత్రిదశమ

సర్గము సర్వము ముగిసినది

శ్రీ శుభంభవతు

శ్రీ

శ్రీ
శ్రీహయగ్రీవాయ నమః
శ్రీ సరస్వత్యై నమః
శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీ శ్రీనివాసదివ్యకళా వైభవము -
# శ్రీ శ్రీనివాస కళాషోడశి
# (౧౧) ఏకాదశ సర్గము

శ్రీగిరిరాడ్వర మందిర!
భోగాశ్రయ సుందరాంగ! ముగ్ధకళాశ్రీ!
రాగాశ్రయ రశికాగ్రణీ !
శ్రీగోవిందా! దయాబ్ధి! చేరి నతింతున్'' ౧

దైవరాయడ! తమరిపాదాబ్జములను
దాచుకొనియున్న మమతలదాల్మిమీర!
పూని మీకీరితిని నెంచి ముగ్ధరాగ!
పుష్పపూజల నర్చింతు పూర్ణహృదయ!'' ౨

వెక్కసము లైన నీ నామ వేలవేల!
వెలలు సులభము లధికమౌ ఫలము లయ్య
చక్కనయ్యరో! దీనులదిక్కునీవె!
అనఘ! నీ నామములె (1) నాకు ధనములయ్య! 3

నీ రామనామాలు నీ నామగానాలు
శతకోటి రూపాలు స్తుతిహితాలు
ఒక్కొక్క నామమ్ము నిక్కమౌ చిక్కని
మధురాలవాలాలు సుధలజాలు

(1) మాకు

నీ కథాద్యమృతాలు నిగమాంతవేద్యాలు
　　నుపనిషద్విధులు నుపవనాలు
రామాయణము మహాభ్రమణీయభారత।
　　భాగవతాదులే యాగమాలు
సత్యనిత్యైక వైభవాస్పదపదాలు
సర్వసంపూర్ణరామకృష్ణావతార -
వైభవశ్రీలు నీ గుణభాసురాలు
శ్రీశ ! దీపాలు మాకు మీ శ్రీపదాలు'' ౪

కృతయుగంబందు దుష్కృతుల దైత్యులగూల్ప
　　నవతరించితివి శ్రీనరహరివయి
త్రేతాయుగంబున ఖ్యాతదుర్దైత్యులం
　　గడదేర్ప పలువిలుకాడయ్యి
ద్వాపరంబున దుర్మదాంధులదురమూఢ్ప
　　రామకృష్ణావతారాఢ్యుడవయి
కలియుగంబున ఘోరఖలకలికులమార్ప
　　సప్తగిరీశ్వర స్వామివయ్యి
ధరణిలో మేటి ప్రత్యక్ష దైవమైన
వేంకటేశ్వర పతి వౌచు వెలసి భక్త
జగతి దరియింప జేసెడి నిగమరూప
పరమ కారుణి కుడవని ప్రస్తుతింతు'' ౫

సకల కల్యాణ వైభవోత్సవ విశేష
ములను సేవించి యిహపరమ్ములను గల్గ
ముక్తి గనుడనే యుపకార బుద్ధి నవని
వివిధ దివ్యార్చ రూపాల వెలసినావు'' ౬

## (స్వామి లీలలు)

అనరావు వినగరావవి నీవి మాయలో
దిన దినమ్మొక క్రొత్త చివ్వెలాయె
తోటి సంగడి కాండ్రనోటిలో దుమ్మిడ
నేమిది యనగ తేనియలు నాయె
తీట తీగల గొట్టితివి యేమి యని యేడ్వ
తనువులన్ సొమ్ములు ఘనములాయె
కాకిజున్నని పిల్వగా బాలకులు నేడ్వ
ఆమె కన్నీళ్ల ముత్యాలజాలు
బాలగోపాలు చిలిపిందనాల లీల
లరయ వింతలు వింతలై సిరులబెంచి
వేడ్క నీ లీలలై చాల వినుతికెక్కె
విశ్వవిహితంబులయ్యె శ్రీ వేంకటేశ!'' ౭

హరిదాసులము మేము సిరి మాకు మా యమ్మ
ఒరులిచ్చువారటే సిరులు మాకు
వసుమతీపతి మాకు వాసుదేవుడు తండ్రి
పరులిచ్చువారె? సంపదలు మాకు
పసగల్గు పదములు బ్రహ్మనిర్మితములు
బ్రహ్మకు తండ్రి మా ప్రభువుగాడె
మా యమ్మ మా యయ్య మమ్మేలుదురుగాని
అన్యులేలెడివారె? యవనిలోన
తల్లి దండ్రియు దైవంబు తగిన హితుడు
బుధు మిత్రాదు లిలమాకు పరమ విభుడె
సర్వమును మాకు శ్రీశేషశైలపతియె
స్వార్థదుర్విషయుల వేడ పనియు లేదు'' ౮

బిడ్డలు తల్లిని పెనవేసికొనినట్లు
ఇంద్రియమ్ములు నన్నునిరక బట్టె
మత్స్యముల్ జలములన్ మనలివీడని యట్లు
ఆశలు మదిని పోనాడలేవు
బండలన్ పాకురుపట్టి వీడనియట్లు
విషయవాసనలు నన్ వీడిపోవు
పటుచంచలంబైన పాదరసంబట్లు
నిలువదు మనసొక్కనిముసమైన
వరుసగా నొక్కటొక్కటి వదలలేక
అల్లుకొని లంకెలౌచు సంకెళ్లు నాయె
తప్పుకొను వెఱవుగానక తమరికిట్లు
విన్నవించితి శరణంటి వేంకటపతి! ౯

ఆపదమొక్కులవాడా! యనుచు నార్తి!
నెలుగెత్తువారిని వేలెదువట
వడ్డికాసులవాడ! దొడ్డవేల్పులరేడ!
అడుగడ్డుదండాలవాడ! ప్రోడ!
అడిగిన వరముల నాగకిచ్చెడివాడ!
పిలిచిన నోయని పలుకువాడ!
హే కృష్ణ మాధవా! హే కృపాసింధు! గో
విందా! యనుచు నిన్ను బిలిచివేడ
కరుణ గనినావు బాధ బోకార్చినావు
కలియుగంబున భక్తుల గావ(వెంచి)విచట
నిలిచినా వని నీ పద నీరజముల
జేర వచ్చితి; గరుణింపు శ్రీనివాస!'' ౧౦

ఎంతటి వాత్సల్యమే పొందువాడవో!
ఎంతటి నెనరున్న స్వాంతమతివొ!
ఏమారకను నిన్ను నెలుగెత్తి మొరలిడి
వేడిన కరిని గాపాడినావు
ఎంతటి ప్రేమార్ద్రహృదయుడవో నీవు
నెనరుంచి కుబ్జను నేలినావు
ఎంతటి కారుణ్యమెదగినవాడవో
ప్రహ్లాదు నిడుములన్ బాపినావు
ఎంతదయగలహితుడవో చెంతజేరు
కొను సుదాముని సిరులచే దనిపినావు
పంతమేలయ్య! నన్నిసుమంత నైన
దయల జూడవు? అర్తుడ దాసుడనుర!'' ౧౧

నీ నామమాధుర్య గానామృతశ్రుతిన్
కర్ణముల్ శ్రవణ యోగ్యంబులయ్యె
భవదీయ కల్యాణవైభవగుణకీర్త -
నములందు జిహ్వ విన్నాణ మందె
మనసు నీ నామసంస్మరణచే వెల్గె; త్వ -
చ్చరణ సేవలయందె కరము లలరె
అర్చనంబున వందనంబందు దాస్యాన
సఖ్యతన్ సద్బుద్ధి సాధు వయ్యె
సర్వ ధర్మంబులను వీడి స్వామి! నీదు
చరణ యుగళమె శరణని పరమభక్తి
నాత్మనర్పించుకొంటి నన్నాదుకొనవె
స్వామి! గనలేవ? వేంకట వాసుదేవ! ౧౨

గిరులలో నెలకొన్న మురువైన కోనేటి
రాయడు వాడు వరాలవాడు
కుమ్మరి దాసుడౌ కురువర తిరునంబి
కిమ్మన వరమిడు నెమ్మికాడు
దొమ్ములు సేసిన తొండమాన్ భూపతి
పిలువ వచ్చిన నమ్ము పేర్మికాడు
కంచి తిర్మలనంబికరుణించి తనచెంత
కొనరగా రప్పించుకున్నవాడు
కరుణలెద బొంగ భక్తులన్ గనికరించి
సంకటముబాపు వేంకటేశ్వరుడువాడు
శరణ మని చేర వచ్చిన పరుని నైన
నేలుకొనువాడు నన్ గరుణించువాడు'' ౧౩

(పుష్పార్చన)

ఘన మహింసా సుమం బన షేంద్రియ జయంపు
సుమము భూతదయాదివిమలసుమము;
శుచి యుక్త సత్షమా సుమము, శాంతి సుమంబు
సత్తప స్సుమము, సత్ జ్ఞాన సుమము
ధ్యానయోగ సుమంబు, త్యాగసత్సు సుమంబు
భక్తియోగోజ్జ్వల భవ్య సుమము
న్యాయ సత్యాశ్రయ నైతిక కుసుమంబు
సాధు దర్మరతంపు సత్సుసుమము
షడ్వికారా రి వర్గైక జయకుసుమము
ఈ షణ త్రయ తాపత్రయేధితైక
ధిషణ వణచెడు సుమము లీదివ్యకుసుమ-
ముల త్వదంఘ్రుల పూజింతు జలజనయన!'' ౧౪

నల్ల నల్లనివాడు నగవు చూపులవాడు
　　　తెలితమ్మి కన్నుల చెలిపివాడు
అరివీర నిర్మూలనంబొనర్చెడి మేటి
　　　చుట్టుకైదువు గేల బట్టువాఁడు
భూనభోంతరముల పూని మార్మోగించు
　　　పాంచజన్యము కేల బరగువాడు
అడ్డదారుల దూగి యట మటించుజాల
　　　జక్కగా దిద్దు నాచార్య వరుడు
పరగ ప్రాబల్యులను నీటి పరిధి నుండి
తేట పరచిన వాడిల పాటి దప్పి
పోవు జీవుల దురితాల బూడ్చువాడు
ధ్రువుని నేలినవాడు నాధవుడు వాడు'' ౧౫

శ్రీశ! మాకెప్పుడు సేవింపదగినట్టి
　　　ప్రభుడవే గద జగత్స్వామి! నీవు
కాని మాకుంద్రమౌ కడు ప్రార్థనలనెల్ల
　　　యూఢి దీర్చెడి కింకరుడవు గావు
జగదీశ! మేము మీ చరణాంబుజ ములను
　　　సేవించి గొలిచెడి సేవకులము
కాని మే మెపుడైన కలనైన మీ కిట
　　　యజమానులము గాము నిజము స్వామి!
అన్యులెవ్వరొ మూఢదుర్మాన్యులెల్ల
మీకు యజమానులమ్మని మిడిసి యంద్రు
కాని యన నట్లు నేను వోగరుడగమునా!
పేర్మి నీ భృత్యభృత్యుల భృత్యు డమర! ౧౬

మందుగానట్టి యా మందు నీ నామమే
భవరోగ బాధలన్ బారద్రోలు
ఈషణ త్రయ రోగ మింకించు నీ పాద
జలజతీర్థము చిత్త శాంతి బెంచు
ఇహపర బలము నందించు దివ్యౌషధం
బిందిరారమణ! నీ పేర్మిపూజ
షడ్వర్గ రిపులను సమయింపజేసెడి
భవదీయ నామ జపౌషధంబు
లనుచు నెఱనమ్మి స్వామి! నిన్గనగనెంచి
యనఘ తపముల సాధించి యన్నమయ్య
దేవ! మీ కీర్తనముల నందించ మాకు
పాడి యొసగెను పేర్మి నీ జాడ జూపి'' ౧

శుభకరంబైన నీ కళాషోడశి కృతి
నర్పిలిడుకొంటి మీ పద నళిన యుగళి
నరసి గైకొమ్ము వేంకటనాథ! మీకు -
నతులివేనయ్య! కృపలతో నన్ను గనవె! ౨

భక్తితత్పరతలు మీర భవ్య మతిన
పాడెదరు నెవ్వరీ కళాషోడశి నిల
వారు శ్రీ వేంకటేశుల పరమకృపకు
పాత్రులయి చాల నిహ పర ఫలముగాంత్రు

**ఇయ్యది**

**శ్రీ అలమేలుమంగాసమేత శ్రీ శ్రీనివాస పరబ్రహ్మ**

**పాదపద్మార్పణమై ముగిసినది**

శ్రీ

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవము

# శ్రీ శ్రీనివాస కళాష్టాక్షరి

## ద్వాదశ సర్గము

ఓంకార మందిరాశ్రయ!
పంకేరుహదళ విశాలభాసురనయనా!
సంకటహర! కింకరుడను
వేంకటగిరి రమణ! కావవే! శ్రీరమణా! ౧

నలిగి పరుల పంచనబ్రతుకదిరోత
పశువు చెట్టు పుట్ట పక్షిగాను
అడవి బుట్టి బ్రతుకు టదిమేలు, భక్తితో
మెచ్చి నిన్ను బిచ్చ మెత్త మేలు ౨

మోడుగ నైన కారడవి
బొంది జనించుట మేలు స్వామి! ఈ
పాడుజగాన శాత్రులకు
వంచి తలన్ బ్రతుకంగ హేయమౌ
కూడుకు గుడ్డకై పరుల,
గొల్చి మనుండుట కంటె మిమ్ములన్
బాడుచు నుంఛవృత్తిన శు
భం బగు జీవన మద్ది మేలగున్ ౩

శ్రీనాథ! గోకుల శ్రీనాథ! భువనంపు
చక్కని కొట్టపుశాలలోన
తిరమైన పెనుమాయ తెరల నింపుగ గట్టి
అరయని యజ్ఞాన మడ్డుపెట్టి
పరమ మనీషను భ్రమిదంబుగా జేసి
పరగ సుజ్ఞాన దీపంబు పెట్టి
తోలుబొమ్మలనెల్ల దొరకొని గడియించి
అజున కాడించెడి యాట నేర్పి
సూత్రధారుడవయ్యి సూచన లందించి
ఆడింతువట బొమ్మలాట నీవు
నిన్ను మెచ్చెద రిడరు నీ కున్ననొరులు
పరగ మన్నించు దాతలీ మహిని లేరు
ఎన్నగా వేంకటేశ్వర! నీ పదాబ్జ
దాసులు న్నతులై నిన్ను దాల్మిగొల్తు ౪

నిగమాది విధుల నెంతేని కీర్తించుచు
నిను బాడి ప్రకటించె ఘనుడు గురుడు
అకళంక భక్తుడు నా యన్నమార్యుని
పేర్మితో గనిన శ్రీ వేంకటేశ!
నారద సనకస నంద నాదులు నెల్ల
వేడి నిన్ కీర్తించి పెద్దలైరి
ఆతీరు మా యన్నమార్యులు నిన్ బాడ
జేరి పాలించిన శ్రీనివాస!
సప్తస్వరాలలో సామగానములూర
శ్రీసతి నిన్ బాడి చేరినట్లు

పరమభక్తాగ్రణి పదకవితాచార్య
వర్యుడు పాడి నీ పదముల గని
భక్తియోగాగ్రగణ్యులాసక్తిమీర
పూని సంగీత సాహిత్యపూర్ణ లెంద -
రెందరో నిన్నుగొల్చి తరించినారు
శ్రితుడ నన్ గావు శేషాద్రి శ్రీనివాస! ౫

వారిధికిని కడ లారిన నీరాడు
వారి యాశలు కడ వరలు టేది
దాహమారినవెన్క తత్త్వమున్ గనుదన్న
దాహమారదు తత్త్వదర్శిగాడు
తనువుండినందాక తరుగునా మోహంబు
మోహ మారక ముద మొంద లేడు
ముందెఱింగిన వెన్క మొదలు మరచెనన్న
ముందటేమెఱుంగేల మొదలు మరచు?
ఇన్నిదెలిసియు దెలియక నేమిఫలము
లిన్నిటికి మిన్న వేంకటాద్రీశ! నీదు
మన్ననలగాంచ మేలది మనిషి కతడు
కలికలిమి జిక్కి కలనైన గనడు నిన్ను'' ౬

సాధువై యెద సత్యసంపన్నుడగువాడు
ఎవ్వడైనను వా డు నెఱుగు హరిని
పరుల నావలెనని భావించు సుజనుడు
నేకులజుండేని యెఱుగు విభుని
ధర్మతత్పరుడురుకర్మఫలత్యాగి
వాడెవండైన శ్రీపతిని గనును

రాగవిద్వేషముాడ్చివిరాగియౌచు
ప్రజకు హితముగ చరియించువాడు మిగుల
పగల నణగించి మతిగల్గి బ్రతుకువాడె
స్వామి! మీ దాసుడై యిహ పరము గాంచు ౭

యమివైన గాని సంయమివైననే గాని
మాధవ! నా యజమాని వీవె
తల్లివైననుగాని తండ్రివైననుగాని
సఖుడవైనను నాకుస్వామి! నీవె
గురుడవైననుగాని కూర్మిచుట్టముగాని
అనుజన్ములన నాకు ఘనుడ! నీవె
హితుడైనగాని స్నేహితుడవైననుగాని
సాకెడువా డన్న నాకు నీవె
దాతవీవైన విధాతవైననుగాని
ప్రాణదాతవు నాకు వరద! నీవె
గాలిధూళైనగాని యేకాలకూట
మైనదెగమ్రింగి లోకాలమనగజేసి
కాచుకొన్నట్టి కొండలరాచవాడ
తోడునీడన్న నీవె నీవాడ నేనె! ౮

(సమర్పణ)

శ్రీశ! యీ సత్కళాష్టాక్షరిని మనోజ్ఞ -
మైన తావక పాదపద్మంబులందు
నిష్ఫలాపేక్ష భక్తితో నిడితి నయ్య
కరుణనేలుము దాసుని గనికరించి'' ౯

(ఫలశ్రుతి)

ఎవరు ఈ కళాష్టాక్షరి నెప్పి భక్తి

శ్రద్ధ మీరంగ పఠియింపజాలుమంద్రు

వారలకు శాంతి సౌఖ్యంబు వరలు నెదిగి

ఇహ పరమ్ములు శ్రీహరి కృపలుగలుగు

శ్రీః

శ్రీహయగ్రీవాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీ శ్రీనివాసదివ్యకళావైభవము

## శ్రీ శ్రీనివాస సన్నుతి

## (౧౩) త్రయోదశ సర్గము:

శ్రీలు చెలువారు మీ పదశ్రీలు గలుగ
సొగసుమీరిన వేంకటనగము నేడు
శ్రీనగోత్తమమనుపేర జెలగి వెలిగె
పరమపదమయ్యె మీ వల్ల భక్తతతికి'' ౧

స్వామి! సర్వాపరాధాల సమయజేసి
దోసమున్నను మన్నించి దాసు గనుము
వత్సలత మీర కరుణ పెంపంద వీని
గనికరింపవె! శ్రీపతీ! గొనవె నతులు ౨

### (శ్రీపాదతీర్థము)

అమ్మలమిన్నలేవలపు
టందపు చెక్కెరమోవికన్న;పా
ల్వెన్నలకన్న; గ్రొత్తని జి
లేబులకన్న; మరందమాధురుల్
మిన్నగుతెల్లతేనియల
మేలిమికన్నను; ద్రాక్షకన్న; మీ

సన్నుత పాదతీర్థములే
　　　సర్వముకన్నను మిన్న'' శ్రీహరీ!'' ౪

మధువుకన్నను చిక్కని మధురమైన
పాయసముకన్న; గోవులపాలకన్న;
చెలియ నునువాతెఱ్ఱైన తేనెలపుకన్న;
స్వామి! మీ పాదతీర్థసేవనమె మిన్న ౪

ఇహపరమ్ముల సౌఖ్యాల నెదుగ జేసి
ఆయురారోగ్యవైభవం బలర జేసి
జన్మదరియింపజేయుమీ చరణజలజ
మధుర తీర్థాలు భవహర సుధలు మాకు'' ౫

అనుచు భక్తిన మదినెంచి యమృతమయము
లైన భవదీయ శ్రీపాదలలితజలజ
తీర్థముల నాత్మసద్భక్తి తృప్తినతుల-
సలిపి సేవించి వినుతాంజలుల నొనర్తు
(నామమాధురి)

కోమలమైన చల్లనగు
　　　కోయిల పాటలతీపికన్న, శ్రీ
సామజమందయానల ప
　　　సందగు గానరసాలలోని రా
గామృతరాశికన్న; కవి
　　　కంఠములో గులుకాడువాక్సరీ
శ్రీ మధురోక్తికన్న; రస
　　　సింధువులే భవదీయనామముల్' ౭

ఎదగుచు జాలువారు పెలి
    యేరులకమ్మనితేనెసవ్వడుల్
కదలుచు పాటలై సుధలు
    గ్రాలెడు రాగరసాలకన్న; నా
మదశిఖిరమ్యక్రేంకృతుల
    మాధురికన్నను; ముగ్ధయావ్వనో
న్మద సుదతీ రసోక్తులను
    మార్కొని మిన్నగు నీదు నామముల్ ౮

దివ్యభోగరుచుల దీటణగించుచు
రసములందు నమృతరసముకన్న;
నిత్యసత్యమైన నిజసుధామయమైన
మీ మనోజ్ఞనామమేర! మిన్న; ౯

తీయ తీయని తేనియతేట తెలుంగు
పలుకు సొగసుల నలరించు గులుకుదనము
లున్న నీ వేల నామాల చెన్ను లెల్ల
త్రిభువనములందు మిన్నయై దీప్తు లలరె ౧౦

అనుచు దలపోసి మదిలోన మననజేసి
ఇహ పరశ్రీల నొసగుచు నెదగజేయు
మీ సహస్రైక నామాలు దోసమణచి
భవము దరియింప జేయని ప్రస్తుతింతు'' ౧౧

స్వామి! మీ నామ కీర్తన భవ భయమ్ము
దొలగజేయును శుభముల గలుగజేయు
ఆధి దుర్వ్యాధులను మాన్పు నాత్మశాంతి
గలుగ జేయును దురితమున్ గలచివేయు'' ౧౨

## (స్వామి ప్రసాదము)

స్వామి! మీకు నివేదనంబలరియున్న
మీదగుశుభప్రదంపుప్రసాదమున్న
దాసజగతికి నిహపరతారకమయి
భవముదాటించు భవదంఘ్రిపదము జూపు'' ౨౩

అందులకె యున్యమైన పదార్థములకు
అన్నిటను మిన్నయై చాలవాసికెక్కి
చిత్తమున శుచి పవిత్రత జేర్చి సత్వ
మెదగ మీ ప్రసాదమే మాకుము దము బెంచు ౨౪

అనుచు నెఱనమ్మి బ్రహ్మమ రాదులెల్ల
పరమ భక్తులు యోగులు పరమఋషులు
స్వామి! భవదీయ తీర్థప్రసాదములను
భక్తి గైకొని మిము గాంచి ప్రస్తుతింత్రు ౨౫

మీకు నైవేద్యమిడని యేమేల్మియైన
సత్పదార్థములవిగా వసత్తుగాని;
మలిన తామస పూతిసంకలితమైన
దుష్పదార్థమె భవరోగ దుఃఖకరమె ౨౬

అని మనమ్మున నమ్మి నేననిశమీశ!
మీకు నర్పింప కన్యమే మేనిగావి
గైకొనను స్వామి! భక్తితో మీకునిడిన
సాత్విక పదార్థమే మమ్ముసాకునెపుడు ౨౭

స్వామి! యిటులని తీర్థ ప్రసాదములను
చిత్తమున భక్తిదోంగ స్వీకరించి

మమ్ము సతతమ్ము కాపాడుముమ మతుల
వేడుకొంటిని సన్నుతిన్ వేంకటేశ! ౧౯

(సంస్కృతి)

సొగసులయొకిమీడు మగసిరి రాయడు
సిరిసిరి చిలుకమ్మ చెలిమికాడు
పలులోకముల ప్రాపు తొలిపల్కులకు దాపు
పడి వేడు భక్తుల పాలికాపు
వరయోగి మానస పరమహంసపు యోగి
శ్రితజన రసరమ్య చిత్తభోగి
పటు దుష్ట షడ్రిపు పరులకు విసవాగు
తను గొల్చుహితుల కమృతంపువాగు
సర్వమును వీడి శరణని చరణకమల
ములను గొలిచినవారికి ముక్తి నిడెడు
త్యాగియగువాడు నీవనిని సాగిలించి
వేడితిని భృత్యుడను; బ్రోవు వేంకటేశ! ౨౦

ఇందీవరశ్యామ! యిందిరాకుచతటీ
చందనాంకిత దేహచారుసీమ!
మందారమాలికా మకుట సంశోభిత!
కందర్ప జనక! గోవిందరాజ!
ధగధగద్ధగిత సుందర దివ్యకౌస్తుభ
వక్షస్థలోజ్జ్వల వైభవాఢ్య
పాంచజన్య రథాంగ భాసురకరపద్మ
శ్రీ పద్మ! భక్త హృచ్ఛ్రీసదనమ!
భవ్య రమ్యోర్ధ్వపుండ్ర సంభాసమాన
బహుళ చికురాలకార్ధేందు ఫాలభాగ!

కరకమల దర్శితానఘ చరణయుగళ!
వినతులివి నీకు శ్రీపతీ! వేంకటపతి! ౨౧

(సమర్పణము)

వరద! తావక కల్యాణ కరమనోజ్ఞ
భవ్య శ్రీమత్కళా దివ్యవైభవముల
భక్తి నిడి మీకు శరణంటి పరమకృపల
దీను నేలవె కల్యాణ శ్రీనివాస! ౨౨

(ఫలశ్రుతి)

స్వామి! భవదీయమైన నీ పరమకృతిని
భక్తి జదివెడివారికి భవదభీష్ట
కరుణనందించి కాపాడు సిరులనొసగి
శ్రీశ్రియఃపతి! నతులివే శ్రీగిరిపతి!

శ్రీ అలమేలుమంగా సమేత శ్రీ శ్రీనివాస
పరబ్రహ్మ పాదార్పణమై ముగిసినది.

ఇతిశమ్

శ్రీః

శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

శ్రీసరస్వత్యైనమః

# శ్రీ శ్రీనివాస దివ్యకళావైభవము
# శ్రీనివాసులకు మంగళశాసనము

## (౧౪) చతుర్దశసర్గము

శ్రీమదనన్య నీలరుచిరే
　　ధితనీరదనవ్యసుందరా!
కోమలదివ్య నీలమణి
　　గుంభితవర్ణ!సురారిమర్దనా!
సామజభవ్యసద్గమన!
　　స్వామి! భవత్తిరుమేనుకంబుజ
శ్రీమహితాంఘ్రి సంపదకు
　　చెల్వగు మంగళ కోట్ల గల్గుతన్ ౧

నూతన జలధరరుచిగల
ఖ్యాతమనోజ్ఞాద్భుతైక గాంభీర్యభవ-
ప్రీతమువుకు వినుతసరో
జాతాయతనేత్రములకు పొగుత! శుభముల్ ౨

మహితరమ్య నీలమణి వర్ణ సౌందర్య!
దురిత దనుజ దమన దోర్బలాఢ్య!
నీకు నీ ప్రతాప నిజ దోర్బలమునకు
కోట్ల మంగళములు గూడుగాత! 3

సితనవాబ్జాయతామోఘ వితతలలిత-
మధుర తావక నేత్ర సంపదల కెపుడు
ఆయు రారోగ్య సకల భాగ్యములు నైన
మంగళమ్ములు సతతమ్ము మనలుగాత! ४

శ్రితజనావ నకరుణా రి వితత మధుర
సుధలు నిండిన తావక సురుచిరాబ్జ-
నేత్ర సౌందర్య వైభవ నిధుల కెపుడు
భక్త రక్షణ సౌభాగ్య ఫలము లగుత! ౫

భక్త జన పారిజాతమ్మై పరగుచున్న
శ్రిత జనా భయ దాయక శ్రీకరాబ్జ
రాగ సౌందర్య వైభవ రాశి కెంమి
భక్త హృత్పద్మనిధులెప్డు బరగుగాత! ౬

నీదు వక్షస్థలంబున నిండి వెలుగు
కౌస్తుభ శ్రీల జెలువారు కాంచనాబ్జ-
వన విహారికి శ్రీలక్ష్మి జనని కైన
శ్రితజనా వన వాత్సల్య శ్రీ లెదుగుత! ౭

నచ్చి నచ్చిక విరిసిన ముచ్చటైన
మచ్చులన్నిటి నెదలో మలచుకొన్న
మెచ్చులందిన నీ యెద మచ్చకెపుడు
ముజ్జగంబుల మురిపాలమురు వలరుత! ౮

దుష్ట దోర్మద చాణూర ముష్టికాది
దురితులన్ ద్రుంచినట్టి యోధోర్బలాఢ్య!
నీలమణివర్ణ! భవదీయ నీరజాంఘ్రి
యుగళికొ మంగళంబులు యుగయుగాలు ౯

మీకున్ మీ తిరుమేను సంపదలకున్
మీ చల్లనౌ సత్కృపా
శ్రీకంజాక్ష మనోజ్ఞశోభలకు; మీ
శ్రీవత్స సత్కౌస్తుభ-
శ్రీకిన్ దివ్య దురస్థలంబునకు మీ
చిత్రాబ్జ సుశ్రీలకున్
మీకౌ కీర్తికి వేలకోట్ల శుభముల్
మేలై వెల్గు వెల్లప్పుడున్ ౧౦

మీకున్ మాకగుపేర్మిబంధములు సొం
పిల్లన్ సదా వెల్గుతన్
మీ కాంతావరలక్ష్మికిన్ ధరణికిన్
మీ శంఖ చక్రాసికిన్
మీ కౌమోదకికిన్ సుశార్ఙ్గ మునకున్
మీ సత్కృపాదృష్టికిన్
శ్రీ కల్యాణ పరంపరల్ సతము వా
సింగాంచి వెల్గొందుతన్। ౧౧

చక్రము : భవదీయోజ్జ్వల కౌస్తుభాంతరపట
ద్భాస్వద్వయోమంజులో
ద్భవ లావణ్య విశేషలక్ష్మికిని; శుం
భజ్జ్వాలికా మాలికా
జవవిస్ఫారిత విస్ఫులింగ విలస
త్సుదర్శన శ్రీలకున్
భువనోద్యజ్జయ దీప్తి గల్గ శుభముల్
పూర్ణంబులై వెల్గుతన్ ౧౨

**శంఖము-గదః-** తావక శ్రీముఖోత్థిత తానిలపూరిత
శంఖనిర్గతో
తీవ్ర దైత్య దుర్హృదయ
తీవ్ర విదారక నిస్స్వనంబుకున్
వైనత వైరి నాశక గ
దాయుధ దివ్య పటుత్వ శక్తికిన్
ఏ విధులందుగాని జయ
మేర్పడ మంగళకోటి గల్గుతన్! ౧౩

**నందకము:** దుర్మద దుర్విదగ్ధ ఖల
ధూర్త భయంకర దుర్జయాతిదు
ష్కర్మవికారదైత్యకుల
కంఠవిలుంఠన జాత రక్తజా
లోర్మి సుసిక్త వర్తన వి
లోడిత తావక నందకాఖ్య స
న్నిర్మలఖడ్గ దీధితికి
నిత్యము దివ్య శుభంబు లొప్పుతన్ ౧౪

**శార్ఙ్గము:** దైత్యారాతి బలావలేప హృదయో
ద్భగ్నంకరారావమై
అత్యుద్విగ్నకరంబులై మిగులవే
జ్యాభీషణోద్రావముల్
అత్యంతంబు హితంబులై సురలకెం
తన్ శాంతిపాఠంబులై
నిత్యంబైయలరారుశార్ఙ్గమునకున్
నిల్చున్జయోత్సంపదల్ ౧౫

దాసులమైన మాకు; జగ
    దాశ్రయశేషిగ వెల్గుమీకు; వా
వాసమునైన కూరుములు
    వాయని బంధము లెల్లకాలముల్
వాసిగ వెల్గుతన్! తమరి
    వక్షమునందనవద్యమూర్తియై
శ్రీసుదతీమ తల్లియగు
    శ్రీజనయిత్రి శుభాలవెల్గుతన్! ౧౬

సాధువులార! మీరు విభు
    సన్నిధి సేవలొనర్ప నెంచినన్
కాదన కన్యసాధనల
    ఖండన సేసి మదీయమార్గమం
దాదర ముంచి రండు హరి
    దార్శనికోత్సవ మొప్పు నేడు ప
ద్మాధవుడైన నాహరికి
    తప్పక దీవెన లిచ్చి రావలెన్ ౧౭

బహుళ మార్గాంతరమ్ముల బయన మిడుచు
సాధనాంతరముల యందు సాగువారు
ఈ మహోత్సవ విధులకు వింతనైన
అర్హులనరాదు మదిలోన నరసికొనుడు ౧౮

సాధనాంతరపరులకు పలుప్రయోజ
నాంతరపరులకెందు నేవాడు మాకు
ఏడుతరములమండియు నెట్టిబంధ
మరయ మిట్టి మా కిడకుడు మచ్చ నెందు ౧౯

మీకు నితరపు సంబంధ మేమి లేని
యెడల మాతోడరండు; దురీర్ష్యదనుజ
లెదుగు లంకను బడగూల్చి యెదుగు రామ
చంద్రుకిడవలె మంగళాశాసనముల ౨౦

కైవల్యప్రీతులార! యిష్టమగుకాం
　　క్షల్ పొందలేనప్పుడే
ఈ వింతాతను వూడనప్పుడె విచా
　　రించండి చిత్స్థితిన్;
మావేద్యుల్ గల గోష్ఠిజేరవ నిశ
　　మ్మాశ్రీశు మంత్రమ్మనే
భావంబందు జపించి స్వామి కిడి ది-
　　వ్యాశీస్సు వర్ధిల్లుడీ! ౨౧

దురితఖలాసురీయులను
　　దున్మిన శ్రీశుని భక్తసంతతిన్
వరలిన భక్తులార! హరి
　　బాడుడు కొల్వుడు మమ్ముగూడి పో-
మరువుడు నాది నేన నెడి మా
　　టను; స్వామికి సేవజేతుమం
చరమరలేక జేసి కడు;
　　చల్లని దీవెన లిచ్చి వెల్గుడీ! ౨౨

మా జనకుండు తాతయును
　　మాన్యులు నేడు తరాల మేము నీ
రోజుకు గూడ శ్రీపతికి
　　రూఢిగజేతుము సేవ లర్మిలిన్,

తేజము లుగ్రమై వెలుగ
    తీక్ష్ణబలా సురు గూల్చినట్టి మా
శ్రీజయనారసింహులకు
    జేయగ రండు శుభాశిషమ్ములన్ ౨౩

ఇన శశి వహ్నిరోచులను
    నీసడజేసెడి శంఖచక్ర దీ
ప్తిని వెదజల్లు చిహ్నముల
    వెల్గుమదీయుల స్వామిసేవలన్
మన గలిగున్న వారము స
    మాహిత సంగరబాణదైత్యునిం
చిన యదురాజసింహునికి
    చేరగ రండు శుభంబు పాడగన్ ౨౪

కమ్మని భోజ్యవస్తువుల;
    కంఠ మనోహర హార సంపదన్;
సమ్మతి గుండలమ్ములను;
    చల్లని కర్పూరచందనాదులన్;
నెమ్మన నిచ్చి సౌఖ్యముల
    నిల్పి ధనాఢ్యుని జేసినట్టి మా
నమ్మిన స్వామి కిచ్చెద న
    నన్యశుభాశిషలన్ కృతజ్ఞతన్ ౨౫

శ్రీపతి కట్టివిడినది చేలము జెల్మిన
    కట్టుకొందు మా
మాపతి భుక్తశేషమువె
    మక్కువ దిందుము తాల్చిముక్తమౌ

నేపుగు మాల దాల్తుమెద-
విల్చి తదాజ్ఞ జరింతు మే విధిన్
ఆ ఫణిశాయి కిత్తు ముక్ర
త్తజ్ఞతతో పలుకోట్ల దీవెనల్ ౨౮

సర్వశేషివినీవు సర్వేశ్వరత్వమ్ము
బాయని విశ్వనారాయణుండవు
సకలకైంకర్యముల్ స్వామి! మీకేమేకుము
చేయ ప్రమాణముల్ సేసినాము
నేను నాదను వీడి నిజసులాదులుమేము
నీసేవలనె సేయనెంతుమయ్య
కంసదుర్నరక దుష్కలుషుల దునిమిన
వరధనురా చార్య వరలు మీరు
కాళియోన్నతఫణిఫణ జాలమందు
కాళ్లగజ్జెలు ఘలు ఘల్లు ఘల్లు మనగ
తాండవించిన త్రిజగదాధార! నీకు
సకల శుభకరమంగళా శాసనములు ౨౭

శ్రీదేవిపై మోహపాదోదధింగల్గి
చెల్వొందు జగదేక శ్రీనివాస!
దేహాత్మబుద్ధ్యాది తీవ్రవారులజోలి
పోకసద్గోష్ఠినిబూని సేయు
విజ్ఞాడా శిల్పనంబిని ప్రపన్నుని బోలి
తగుశేష భూతు డీదాసుడయ్య
స్త్రీలనా కర్షించు చెల్వుడవే కాదు
పురుషదృక్చిత్తాపహరము నైన

భువనమోహన సౌందర్యమూర్తి నీవు
నాకు గల వైరి షట్కము నణతు నీవె
ఈశ! అష్టాక్షరీ మంత్రమొసగ మీకు
మంగళముసేయు వక్కక్రమమసలనిడవె ౨౮

-: **అమ్మతో మనవి** :-

శ్రీలు చెలువారు శృంగార శ్రీనివాసు-
పేర్మిరాణి వి భక్తుల వేల్పుటావు ;
నీవె యని నమ్మి చేరితి వేదవినుత
కరుణ గను మమ్మ దాసునో కన్న తల్లి! ౨౯

పరమ కారుణ్య గుణకల్పవల్లి నీవె
అన్యులెవ్వరు తల్లి! నన్నాదుకొనగ;
నిన్ను దప్పన్యముల నెదన్ నిలుప నమ్మ!
దాసుడను దాసపోషణీ! దయల గనుము 3౦

శ్రీనివాసుల హృదయమ్ము చెక్కపెరుగు
నీదు హృదయమ్మునవనవనీతమమ్మ
పురుషకారిణీ! దాసులన్ బ్రోవుమనుచు
పరగ నెరిగించు శ్రీసతీ! పతికి మమ్ము 3౨

మంగళము తల్లి! నీకు నీమమలకెల్ల
భక్తజన వత్సలాత్మక భావములకు;
నీదు చల్లని యెద సిరిన్ నిలిచి యున్న
దయల కను మంగళమ్మ పద్మావతమ్మ! 3౨

నిన్ను నమ్మినవారికి నెన్నడైన
నాశ మిల లేద టమ్మ! ఓ నళినవేత్రి!
కరుణగల తల్లివని నిన్ను శరణ మంటి
జనని! కరుణించు నా నలాంజలిని గొనవె 33

విశ్వనాటక లీలాతివినుతచరితు
డైన శ్రీ శ్రీనివాసుడేజ్ఞానయోగ
వేద్యుడనియండ్రు విజ్ఞానవేత్తలెల్ల
వాడెమిత్రుడువా చిత్త పద్మకెపుడు ౩౪

పరమ పవిత్రులందు విలు
వైన పవిత్రుడు మంగళంబులం
దురు శుభ మంగళాంగుడు స;
దున్నత దివ్యుల కెల్ల దేవుడి-
ద్ధర గల జీవకోటులకు
తల్లియు తండ్రియు నాప్తబాంధవుం
డరమరలేని సత్కారుణా
డా పరదైవము శ్రీనివాసుడే ౩౫

అని కృష్ణద్వైపాయను
డనినట్టు లనారనాఖ్యుడా విభు డవనిన్
వినుతపవిత్రాత్ముండని
అనిశము పాడికిడుదు మంగళాశాసనముల్ ౩౬

వినుతభక్తాగ్రగణ్యులు విష్ణుచిత్త
విబుధవర్యుల శ్రీసూక్తి విని నుతించు
వారు; శ్రీ శ్రీనివాసులన్ జేరి సతము
సలుపుచుందురు మంగళాశాసనముల ౩౭

ఈ సుఖంకర మంగళాశాసనముల
పరమ సద్భక్తిపరులైన వార లెపుడు
ననుదినమ్ముల స్వామికి నందజేయ
వాని కృపతోడ విహపర శ్రీవిగాంత్రు ౩౮

ఇయ్యది

శ్రీమ దఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీ శ్రీ ఇందిరాల

పుర నివాస శ్రీరుక్మిణీ సత్యభామా గోదాసమేత శ్రీ

రాజ గోపాల స్వామి పాదారవింద సేవాతత్పర; శ్రీ

భారద్వాజ గోత్ర పవిత్ర శ్రీమాన్ నల్లదీగ నరసింహా

చార్య చూడామణీ గర్భ శుక్తి ముక్తాఫలాయమాన;

శ్రీలక్ష్మీహయవదన అనుగ్రహ లబ్ధ వాగ్వైభవ; శ్రీవా

సర సరస్వతీ కృపాస్వావలమ్బిత కవితాకళారాధక

శ్రీనివాస కవి విరచితంబైన శ్రీ శ్రీని

వాస దివ్యకళా వైభవంబున శ్రీ

శ్రీనివాస మంగళాశాసనంబను

చతుర్దశ సర్గము శ్రీఅలమేలు

మంగా పద్మావతీ శ్రీనివాస పాద

పద్మార్పణమై ముగిసినది

శ్రీశుభంభవతు

సర్వేజనాస్సుఖినోభవంతు సర్వేషాం సముత్తమ్మం

గళానిసంతు

శ్రీః



- హైద్రాబాద్) (౧౬) విబుధసూక్తి సుధాకరము (శ్రీరామాపబ్లిషర్స్ వారి ప్రచురణము) (౧౭) శ్రీమదార్ష కళాభారతీ వైభవము (వాసరసరస్వతి) (౧౮) ఇష్టద రాజశతి (నిరోష్ఠ్య ప్రబంధము - వరదరాజపుర వరదరాజస్వామి) (౧౯) శ్రీరఘురామస్తుతివైజయన్తి (అల్వాం - శ్రీరామసాగరము) (౨౦) శ్రీశ్రీనివాస దివ్యకళావైభవము (తిరుపతి) (౨౧) శ్రీరఘురామ శతపారిజాతము (రామగిరి) (౨౨) శ్రీరామగిరి రాఘవపతి సుప్రభాతము (రామగిరి) (౨౩) శ్రీనందారం నరసింహభక్త జీవితవైభవము (వచనము).

## అముద్రిత గ్రంథములు

(1) శ్రీరామచంద్రోదాహరణ కావ్యము - తారావళి (2) శ్రీసుప్రభాత కల్హారమాల (3) లక్ష్మీనారాయణ - శ్రీరంగనాయక - శ్రీరాజవేణుగోపాల - వరదరాజ - గోదా - ధన్వంతరి (1) రమణ మహర్షి (2) ఉమా మల్లికార్జున (3) శ్రీదేవి సుప్రభాతములు మొదలగునవి.

(3) రసపంచి ఖండ కావ్యములు (5) సింగిపదాలు (6) భక్తిసుధార్ణవము (దృశ్యరూపకము భక్తతిన్ననిచరిత్ర) (7) వీరపాండ్య కట్టబ్రహ్మనాయక్చరిత్ర ప్రథమ స్వాతంత్ర్యసమరాంధ్రయోధుడు పద్యకావ్యము) (8) శ్రీగోదాశతపారిజాతము (9) ఆకాశవాణి వ్యాసరత్నమం (10) కళ్యాణ ఆశీస్సుమాంజలి (పలువురి మంధుమిత్రాది పుత్రీపుత్రులకొసంగిన ఆశీస్సులు) మొదలగునవి.

-: శ్రీశుభంభవతు :-

శ్రీ